# విషయ సూచిక

## ట్రాజెడీలు

# ముందుమాట



ప్రపంచ వ్యాప్తంగా కథకులందరికీ ప్రేరణ షేక్స్పియర్.

హోమర్ యుద్ధగాథల గురించీ, వీరయోధుల సాహసాల గురించీ రాశాడు. టాల్‌స్టాయ్ జీవితాల్లోని విషాదాన్ని అద్భుతంగా చిత్రించాడు. టెరెన్స్, మార్క్ ట్వేన్‌లాంటివాళ్లు హాస్యం పండించారు. డికెన్స్ మెలొడ్రామాలూ, ప్లూటార్క్ చరిత్రలూ, హాన్స్ క్రిస్టియన్ ఆండర్సన్ ఫెయిరీటేల్స్ రాశారని అందరికీ తెలుసు.

షేక్స్పియర్ మాత్రం అన్ని రకాల కథలూ రాశాడు - హాస్యం, విషాదం, చరిత్ర, మెలొడ్రామా, సాహస గాథలు, ప్రేమ కథలు, ఫెయిరీ టేల్స్ - ఏదీ విడిచిపెట్టలేదు.

అందువల్లనే కథా లోకంలో అతడు ధృవతార.

ఇప్పుడు కథలన్నీ వచనంలోనే చదువుతాం. కాని ప్రాచీన కాలంలో మౌఖిక ప్రక్రియ ఎక్కువగా ప్రచారంలో ఉన్నందువల్ల కథల్ని పద్యరూపకంగా చెప్పటానికే ప్రాధాన్యం ఇచ్చారు. పద్యాలను జ్ఞాపకం పెట్టుకోవటం సులభం గద! షేక్స్పియర్ కాలంలో కథల పుస్తకాలు వచనంలో వున్నా, రంగస్థలంమీద మాత్రం పద్య నాటకాలనే ప్రేక్షకులు ఇష్టపడ్డారు. కవితాత్మకమైన పదాలకు మంచి గాత్రం, సంగీతం కూడా తోడయితే జనం ఉర్రూతలూగిపోరా!

షేక్స్పియర్ నాటకాలు రాశాడు. అందువల్ల సహజంగానే అవన్నీ పద్య రూపకాలు. రణరంగమైనా, పూపొదనైనా, మంత్రగత్తెనైనా, చంటిపిల్లనైనా, మృత్యువుతో పోరాడిన వీరాధివీరులైనా, యువప్రేమికులైనా, వాగుడుకాయనైనా - వ్యక్తుల వివిధ రూపాలను ఆయన సజీవంగా పట్టుకున్నాడు.

షేక్స్పియర్ కథకుడు మాత్రమే కాదు. గొప్ప కవి కూడా. ఒక్కమాటలో, ఆయన ప్రపంచ సాహిత్యం ఆవిష్కరించిన అరుదైన జీనియస్. శతాబ్దాలనాటి అతని నాటకాలు నేటికీ నిత్యనూతనంగానే ఉన్నాయి. ప్రతిభ సంగతి కాసేపలాపెడితే, నాటక రంగం

యొక్క అవసరాలను బాగా అవగాహన చేసుకున్న వ్యక్తి షేక్స్పియర్. నటుడిగా, ప్రొడ్యూసర్‌గా లండన్ స్టేజిమీద సుదీర్ఘకాలం పనిచేశాడు.

అతడు నాటకాలు రాయటానికి ప్రధాన కారణం వాటిని పుస్తకాలుగా ప్రచురించడం కాదు. తక్షణ అవసరం రంగస్థలంమీద ప్రదర్శించటం. షేక్స్పియర్ జీవితకాలంలోనే అతడి నాటకాలకు బ్రహ్మరథం పట్టారు ప్రేక్షకులు. ఆరు నాటకాలు ప్రచురితమైనాయి కూడాను. అతడి మరణం తర్వాత ఏడేళ్లకు, 1623లో ఇద్దరు మిత్రులు జాన్ హెమ్మింగ్స్, హెన్రీ కాండెల్  నాటకాలన్నింటినీ పుస్తకంగా ప్రచురించారు.

అదే "ఫస్ట్ ఫోలియో." ఇందులోని 14 కామెడీలు, 12 ట్రాజెడీల కథలివి. ఈ సంకలనంలో చారిత్రిక నాటకాలు లేవు.

## చారిత్రిక నాటకాలు (ది హిస్టరీస్)

షేక్స్పియర్ పది చారిత్రక నాటకాలు రాశాడు. (కింగ్ జాన్, రెండవ, మూడవ రిచర్డ్, మిగతా ఏడు హెన్రీల గురించి) ఎనిమిది నాటకాల్లో ఇంగ్లండు చరిత్రలోని రాజుల వంశ క్రమం చిత్రించాడు. తొలి అంతర్యుద్ధంతో చివరి నాటకం ముగుస్తుంది.

ఆ రోజుల్లో ప్రామాణిక చరిత్ర గ్రంథాలేవీ షేక్స్పియర్‌కు అందుబాటులో లేవు. సహజంగా జనంలో ఉండే భావన – మాతృదేశాన్ని వ్యతిరేకించిన వాళ్ళంతా శత్రువులు. ఇంగ్లండు విజయానికి సహాయం చేసిన వాళ్లే దేశభక్తులు – కు అయన అతడు అతీతుడు కాడు.

జోన్ ఆఫ్ ఆర్క్ ఇంగ్లండును వ్యతిరేకించింది గనక ఆమె గురించి వ్యంగ్యంగా రాశాడు. ట్యూడర్ చక్రవర్తులకు వ్యతిరేకంగా పోరాడిన మూడవ రిచర్డ్ షేక్స్పియర్ నాటకంలో విలన్.

ట్యూడర్ వంశంలోని చివరి రాణి క్వీన్ ఎలిజబెత్‌కు చారిత్రక సత్యాలు తెలుసుకోవాలనే కోరిక లేదు. దేశభక్తినీ, ఇంగ్లండు ఘన కీర్తిని శ్లాఘించే వాళ్లనే ఆమె ప్రోత్సహించింది. మరి, షేక్స్పియర్ తొమ్మిది(చారిత్రక) నాటకాలు ఆమె కాలంలోనే రాశాడు. చారిత్రక వ్యక్తులతో పాటు, అనేక కల్పిత పాత్రలను (ఉదా.. సర్ జాన్ ఫాల్స్టాఫ్) కూడా సృష్టించి జనరంజకంగా ప్రదర్శించాడు.

**ముక్తవరం పార్థసారధి**

# 1. ది కామెడీ ఆఫ్ ఎరర్స్



కథాస్థలం ఏషియా మైనర్‌లోని గ్రీకు రేవు పట్టణం. గ్రీకు నాటక కర్తలు ఈ కథా వస్తువును అప్పటికే ఎన్నోసార్లు వాడారు. కవలల్ని, పోల్చుకోవటంలో పొరబాట్లు జరుగుతాయి. ఫలితంగా ప్రేక్షకులకు నవ్వుల పంట.

బాల్యంలోనే అన్నదమ్ములు విడిపోతారు. పెరిగి పెద్దయ్యాక ఒకడు ఆ ఊరికి వస్తాడు. తన సోదరుడు అక్కడే ఉంటున్న విషయం వాడికి తెలియదు. వారికి సంబంధించిన వ్యక్తులందరూ ఒకరిని చూసి మరొకరనుకుంటారు. స్టేజిమీద ఇలాంటి కథలు బాగా రక్తి కడతాయి. పాత్రలకన్నా ప్రేక్షకులకెక్కువ సమాచారం తెలియటమే అందుకు ప్రధాన కారణం. ఒకరి కన్‌ఫ్యూషన్ మరొకరికి వినోదం.

సైరాక్యూస్ నగరం నుండి ఒక వృద్ధ వర్తకుడు రేవు పట్టణం ఎఫెసస్‌కు వస్తాడు. అప్పటికే రెండు నగరాల మధ్య శత్రుత్వం ఉంది. పరిహారం చెల్లించకపోతే వర్తకుడికి (పేరు ఏగియన్) మరణ దండన తప్పదంటారు అధికారులు. నగర పాలకుడు (డ్యూక్) నిస్సహాయత వ్యక్తం చేస్తాడు. చట్టం మారదు. వృద్ధుణ్ణి తన గోడు చెప్పుకోవటానికి అనుమతిస్తారు.

ఏగియన్‌కిద్దరు కవలలు. వాళ్లకు సేవ చెయ్యటానికి మరో ఇద్దరు కవలల్ని పనిలో పెట్టుకుంటాడు. పడవ ప్రమాదంలో కుటుంబం చెల్లాచెదరైంది. భార్యా, ఒక కొడుకూ తన వద్దున్నారు. కొడుకు పేరు అంటిఫోలస్. వాడు పెరిగి, తన సోదరుణ్ణి వెదకటానికి అనుచరుడు డ్రొమియోను వెంట తీసుకుని వెళ్లాడు. అయిదేళ్లయింది. కొడుకును వెదుక్కుంటూ తనూ బయల్దేరాడు. ఈ నగరం తనకు మరణ శిక్ష విధించినందుకు విచారమేమీ లేదు. ఇంకేం మిగిలిందని? ఇద్దరు పిల్లల్నీ పోగొట్టుకున్నాడు. ఇలాంటి బతుకుకన్న చావే నయం.

దృశ్యం : ఎఫెసస్ నగరంలో వీధి. మరో అపరిచితుడు ప్రవేశిస్తాడు. ఇతడే ఆంటిఫోలస్. వెంట డ్రొమియో. బంగారు నాణాల సంచిని సత్రంలో భద్రపరచి రమ్మని ఆంటిఫోలస్ సహచరుణ్ణి(డ్రొమియో) పంపిస్తాడు. మరుక్షణమే డ్రొమియో తిరిగి ప్రత్యక్షమవుతాడు – కనీసం ఆంటిఫోలస్‌కు ఆ వచ్చిన మనిషి అలా కనిపిస్తాడు. నిజానికి అతడు డ్రొమియో కవల సోదరుడు. ఆంటిఫోలస్ సోదరుడి వద్ద పనిచేస్తున్నాడు. యజమానికి భోజనం తీసుకుపోవటానికి మార్కెట్‌కు వచ్చాడు.

ఆకారమేకాదు, కవలలకు పేర్లు కూడా ఒకటే. ఇద్దరూ ఆంటిఫోలస్‌లు. అనుచరులిద్దరూ డ్రొమియోలు. (నాటకంలో వీళ్లను ఆంటిఫోలస్ ఆఫ్ ఎఫెసస్, ఆంటిఫోలస్ ఆఫ్ సైరాక్యూస్‌గా గుర్తిస్తారు.)

డ్రొమియో(ఎఫెసస్), ఆంటిఫోలస్(సైరాక్యూస్)ను "భోజనం చల్లారిపోతుంది. త్వరగా ఇంటికి రమ్మని" పిలుస్తాడు. బంగారం క్షేమంగా ఉందా లేదా అని ఆలోచిస్తున్నాడు, ఆంటిఫోలస్. డ్రొమియో వచ్చి భోజనం గురించి మాట్లాడటం విని విసుక్కుంటాడు. ఎఫెసస్ నగరం మంత్రగత్తెలకూ, నయవంచకులకూ పెట్టింది పేరని అతడికి తెలుసు. బంగారం భద్రంగా ఉందని తెలిస్తే, తను మరో చోటికి వెళ్లటమే శ్రేయస్కరం.

తరువాతి దృశ్యం : ఆంటిఫోలస్(ఎఫెసస్) ఇల్లు. భోజనం రెడీగా ఉన్నది. భార్యా, మరదలూ అతడి కోసం నిరీక్షిస్తున్నారు. డ్రొమియో వచ్చి జరిగింది చెబుతాడు.

"బంగారం ఎక్కడ పెట్టావన్నాడు.

భోజనానికి రమ్మన్నాను.

'బంగారం' తప్ప మరోమాట లేదు.

"భోజనం చల్లారుతున్నది"

'బంగారం!"

"ఇంటికి వస్తావా రావా?"

"బంగారం గురించి చెప్పరా మూర్ఖుడా."

"అమ్మగారు మీ కోసం కాచుక్కూర్చున్నారు. త్వరగా రావాలి."

"పెళ్లాన్ని తగలెయ్య..... నాకు పెళ్లామేమిట్రా గాడిదా. బంగారం గురించి చెప్పు..."

ఇల్లాలి పేరు ఆడ్రియానా. ఇది విని లబోదిబోమంటుంది. వెంటనే వెళ్లి ఎలాగైనా అయ్యగార్ని ఇంటికి తీసుకు రమ్మని పురమాయిస్తుంది.

"నా పని ఫుట్‌బాల్ లాగున్నది" అంటాడు డ్రొమియో.

"నా బతుకు నాశనమయ్యింది" అంటూ రోదిస్తుంది ఆడ్రియానా. ఆమె సోదరి లూసియానాకు అక్కమీద జాలేస్తుంది.

తన బంగారం సత్రంలో క్షేమంగా ఉన్నదని తెలిసి ఆంటిఫోలస్(సైరాక్యూస్) తృప్తిగా ఊపిరి పీల్చుకుంటాడు. అతడూ, డ్రొమియో జోకులేసుకుని నవ్వుకుంటున్నప్పుడు

అడ్రియానా, లూసియానా ప్రవేశిస్తారు. అంటిఫోలస్(సైరాక్యూస్)ను చూసి అడ్రియానా అతడే తన భర్త అనుకుని చెంతకు చేరుతుంది. అంటిఫోలస్‌కేమీ అర్థం కాదు. తల తిరిగి పోతుంది. ఇక్కడికి వచ్చినప్పటి నుండీ వింతలు జరుగుతూనే ఉన్నాయి. వీళ్ల వెంట వెళ్లటమే మేలనుకుంటాడు. డ్రామియో అనుసరిస్తాడు.

మరికాసేపటికి ఆకలితో ఇంటికొస్తాడు అంటిఫోలస్(ఎఫెసస్). వెంట ఒక మిత్రుడూ, డ్రామియో కూడా ఉన్నారు. కాని డ్రామియో(సైరాక్యూస్) వాళ్లను గేటువద్దే ఆపేస్తాడు. చెప్పినా వినడు. తనింట్లోకి తనను వెళ్లనివ్వని ఈ మూర్ఖుణ్ణి అంటిఫోలస్(ఎఫెసస్) చెడామడా తిడతాడు. మిత్రుడు భోజనానికి మరెక్కడికైనా పోదామన్నాడు. భార్యే ఇలా చేయిస్తున్నదనుకుంటాడు అంటిఫోలస్(ఎఫెసస్). అడ్రియానా కోసం ఆర్డరిచ్చిన బంగారు గొలుసు వేశ్యకిచ్చి కసి దీర్చుకోవాలి.

ఇంట్లో - అంటిఫోలస్(సైరాక్యూస్) భోజనానంతరం అడ్రియానా చెల్లెలు లూసియానాతో ప్రేమలో పడ్డాడు. తన బావ (అలాగే అనుకుంటుంది గద ఆవిడ) ఇంత నీచంగా ప్రవర్తించినందుకు బాధపడుతుందామె. మరోవైపు లావుపాటి పనిమనిషి డ్రామియో మీద మనసు పడుతుంది. ఈ గందరగోళాన్ని భరించలేని అంటిఫోలస్ ఊరు విడిచి వెళ్లిపోవాలనుకుంటాడు. ఆ రాత్రికే ప్రయాణం. షిప్పు మాట్లాడమని డ్రామియోను పంపిస్తాడు. బంగారు గొలుసు తెచ్చిస్తాడు కంసాలి. ఈ ఊరి వింతల్లో ఇదో వింత అనుకుంటాడు అంటిఫోలస్.

కంసాలికి డబ్బు అవసరమున్నది. అంటిఫోలస్(ఎఫెసస్)ను అడుగుతాడు. గొలుసివ్వకుండానే డబ్బులడిగిన కంసాలి మీద అంటిఫోలస్‌కు కోపం వస్తుంది. బాకీ ఎగ్గొట్ట ప్రయత్నించినందుకు కంసాలి అతణ్ణి అరెస్టు చేయిస్తాడు. షిప్పు రెడీగా ఉన్నదని చెప్పటానికి వస్తాడు, తమ్ముడి సేవకుడు. బెయిలు కోసం డబ్బు తీసుకురమ్మని అతణ్ణి అడ్రియానా వద్దకు పంపిస్తాడు.

డ్రామియో డబ్బు తెస్తాడు కాని మరో అంటిఫోలస్‌కిస్తాడు. ఈ నగరంలో అందరూ తనకు బహుమతులిచ్చేవాళ్లే. భోజనం. గొలుసు. ఇప్పుడు డబ్బు. వేశ్య కనిపించి తనకు వాగ్దానం చేసిన గొలుసేమైందంటుంది. "ఈ ఊళ్లో అన్నీ దయ్యాలు, భూతాలు ఉన్నా"యనుకుంటూ వెళ్లిపోతాడు అంటిఫోలస్. వేశ్యవచ్చి అతడికి పిచ్చెక్కిందని అడ్రియానాతో చెబుతుంది.

జైల్లో అంటిఫోలస్(ఎఫెసస్) బెయిల్ డబ్బుకోసం నిరీక్షిస్తున్నాడు. భార్యా, మరదలూ, వేశ్యా వస్తారు. వెంట ఒక బక్కచిక్కిన భూత వైద్యుడు కూడా. పేరు పించ్. పించ్ నాడి చూడబోతే అంటిఫోలస్ వాడి గూబ వగలకొడతాడు. డ్రామియోకక్కూడా పిచ్చి లక్షణాలున్నాయని భూతవైద్యుడు ఇద్దర్నీ వెంట తీసుకుపోతాడు.

సత్రానికెళ్లి, బంగారం, లగేజి తీసుకుని వెళ్లిపోవాలనుకుంటాడు అంటిఫోలస్.

సేవకుడు డ్రొమియో జల్సా చేస్తున్నాడు. ఈ ఊరివాళ్లు ధర్మదాతలు. అడక్కుండానే అన్నీ ఇస్తారు. "ఆ గయ్యాళిని వదిలించుకోగలిగితే ఇక్కడే సెటిలయినా నష్టం లేదు" అనుకుంటాడు. కాని, మరుక్షణమే కంసాలి వచ్చి డబ్బడుగుతాడు. అంటిఫోలస్‌కు కోపం వస్తుంది. కత్తి దూస్తాడు. యుద్ధానికి సిద్ధపడతాడు. అతడికి పిచ్చెక్కిందని ముగ్గురాడవాళ్లకూ నమ్మకం కుదిర్తుంది. వీళ్లను చూసి సైరాక్యూస్ మనుషులిద్దరూ ఒక ఆశ్రమంలో దాగుంటారు.

ఆశ్రమంలోని ఒక వృద్ధురాలు అంటిఫోలస్‌కు పిచ్చెందుకెక్కిందని అడుగుతుంది. బహుశా భార్య సాధింపులు భరించలేకే ఇలా జరిగింది అంటుంది. అది విన్న ఆడ్రియానాకు కోపం వచ్చి డ్యూక్‌గారికి ఫిర్యాదు చెయ్యాలనుకుంటుంది.

ఏగియన్‌కు వేసిన ఉరిశిక్షను పర్యవేక్షించటానికి అటుగా వచ్చాడు డ్యూక్. ఆడ్రియానా తన గోడు వెళ్లబోసుకుంటుంది. ఈలోగా సంకెళ్లు విప్పుకున్న అంటిఫోలస్ డాక్టర్ పించ్‌గారి గడ్డం పీకుతున్నాడని తెలుస్తుంది. తన భర్త ఆశ్రమంలోనే వున్నాడని ఆడ్రియానా విశ్వాసం.

అంటిఫోలస్(ఎఫెసస్) ప్రవేశించి డ్యూక్‌ను న్యాయం చెప్పమంటాడు. ఇంట్లోకి రానివ్వనందుకు భార్యను శిక్షించాలంటాడు.

డ్యూక్ ఒక్కొక్కర్నీ ప్రశ్నిస్తాడు. గందరగోళం మరింత పెరుగుతుంది. ఆశ్రమంలోని వృద్ధురాలు రెండవ అంటిఫోలస్‌నూ, రెండవ డ్రోమియోనూ ప్రవేశపెడుతుంది.

కవలలు ఎదురెదురుగా నిల్చుంటారు: ఇద్దరు కొడుకులను చూసి ఏగియన్ ఆనందంతో పొంగిపోతాడు. ఆ వృద్ధురాలు తప్పిపోయిన తన భార్యేనని కూడా తెలుస్తుంది.

ఇప్పుడు అంటిఫోలస్(సైరాక్యూస్) లూసియానాను నిరాటంకంగా ప్రేమించవచ్చు. కొడుకులు, కోడళ్లు (తన చిన్న కొడుకు త్వరలో లూసియానాను పెళ్లి చేసుకుంటాడు), భర్తను చూసి ముసలి ఇల్లాలు జీవితం ధన్యమైందనుకుంటుంది. డ్రోమియో లిద్దరూ ఆలింగనం చేసుకుంటారు.



# 2. లవ్స్ లేబర్స్ లాస్ట్

అది స్పెయిన్‌లో ఒక ప్రాచీన రాజ్యం. పేరు నావర్. అక్కడే జరుగుతుంది కథ. కాని అక్కడ 'స్పానిష్' లక్షణం ఇసుమంతైనా ఉండదు. ఇంగ్లీషు వ్యక్తుల్ని ఊహించుకుని స్పానిష్ నేపథ్యం సృష్టించి ఉంటాడు షేక్స్‌పియర్.

దీన్ని నాటకం అనటం కన్నా, 'క్రీడ'గా అభివర్ణించటం సబబు.

నావర్ రాజుగారి ఉద్యానవనంలో కథ ప్రారంభమవుతుంది. ప్రజలందరూ మూడు సంవత్సరాలపాటు సుఖభోగాలను విసర్జించి జ్ఞానాన్వేషణలో గడపాలని ఆజ్ఞాపిస్తాడు రాజు. ఉన్నతోద్యోగులూ ఆలోచన బాగానే ఉందంటారుగాని, ఒక యువకుడు బెరాన్ అభ్యంతరం వ్యక్తం చేస్తాడు. కాని చివరికి అతడూ అంగీకరించక తప్పదు. మూడు సంవత్సరాలపాటు రాజసభను 'పవిత్రం'గా ఉంచగలగాలి. ఎలాంటి వ్యసనాలకూ, స్త్రీలోలతకూ తావులేదు. స్త్రీలతో మాట్లాడటమే నిషిద్ధం. కాని ఫ్రెంచి రాకుమారి రాచకార్యం మీద నావర్ వస్తున్నది. మరి మాట్లాడకపోతే ఎలా? రాజుగారు వెంటనే ఈ నియమం సడలిస్తాడు. లోలోపలే సంతోషిస్తాడు బెరాన్.

స్త్రీ సంపర్కాన్ని గురించిన ఈ రూలు రాజ్యంలో అందరికీ వర్తిస్తుంది. కాని అప్పటికే దీన్ని కొందరు ధిక్కరిస్తున్నట్టుగా తెలుస్తుంది. ఒక యువకుడు కాస్టార్డ్‌లో మరో యువతి జాకెనెటాతో కనిపించాడు. రాజభటులు వాళ్ళి సభకు ఈడ్చుకు వస్తారు. ఈ వ్యవహారమంతా తను స్వయంగా కళ్లతో చూశానని ఒక స్పానిష్ వీరుడు (ఆర్మాడో)

లేఖ కూడా పంపిస్తాడు. అప్పటి కృత్రిమమైన భాషను పారడీచేస్తూ రాసినట్టుంటుంది ఆర్మాడో ఉత్తరం. అందులోని అంతరార్థం ప్రేక్షకులకు తెలియటానికి చాలా సమయం పడుతుంది. అయితే ఆ వీరుడు తను స్వయంగా జాకెనెటాను ప్రేమిస్తున్నాననీ, అందువల్లే ఆమె మరో మనిషితో తిరగటం ఇష్టంలేదని మాత్రం రాయడు.

తనలాంటి వీరాధివీరుడు ఒక ఆడపిల్ల చూపులకు చిత్తైపోయానని అంగీకరించటం కష్టం. కాని హెర్క్యులిస్ మొదలైన మహానుభావులు స్త్రీ క్రీగంటి చూపులకు బానిసలైనప్పుడు తనెంత! ఆర్మాడో ఒక్కడే కాదు. రాజుగారు, అతడి ఉన్నతోద్యోగులూ ఫ్రెంచి రాకుమారి ముందు ఓటమినంగీకరించక తప్పదు. రాజుగారి ఉద్యానవనంలోనే ఆమె తన గుడారం వేసుకున్నది. ప్రతిజ్ఞ చేశాడు గనక, రాజుగారు ఆమెను అంతఃపురంలోనికి అనుమతించటానికి వీల్లేదు. అయితే, రాచమర్యాదలు మాత్రం చెయ్యక తప్పదు. స్వయంగా వెళ్లి ఆమెకు అభివాదాలు పలికి ఆహ్వానించవలసిందే. బెరాన్ ఒక ఫ్రెంచి సుందరి రోసాలైన్‌కి దాసోహమంటాడు. రాకుమారి పరివారంలోని మరో ఇద్దరు యువతులు మిగిలిన ఉన్నతోద్యోగులిద్దరిని వశపర్చుకుంటారు.

బెరాన్‌కిది తొలి ప్రేమానుభవం. ఇన్నాళ్లూ అతడు ప్రేమలో పడ్డవాళ్లను ఎద్దేవా చేశాడు. (ప్రేమికులు జర్మన్ గడియారాల్లా నిలకడగా ఉండరు!) రోసాలైన్‌ది గోధుమ రంగు చర్మం. నిజమైన సుందరి తెల్లగా ఉంటుందన్నది అతని నమ్మకం. అయినప్పటికీ ఆమెను ప్రేమించకుండా ఉండలేకపోయాడు.

స్త్రీ సాంగత్యాన్ని నిషేధించిన నావర్ రాజ్యంలో ఇప్పుడందరూ కాంతా దాసులే. చట్టాలూ, నియమ నిబంధనలూ గాలికి వదిలేశారు. ఇందువల్ల లాభపడింది మాత్రం కాస్టార్డ్. తమ ప్రియురాళ్లకు ఉత్తరాలు తీసికెళ్లమని ఆర్మాడో మూడు ఫార్దింగులు, బెరాన్ ఒక షిల్లింగ్ ఇచ్చారతడికి. కాస్టార్డ్ తెలివితేటలు ప్రశ్నార్థకమే. రోసాలైన్‌కివ్వాల్సిన ఉత్తరం జాక్వెనెటాకు చేరుస్తాడు – ఆ సమయంలో ఆవిడ లేడిని వేటాడుతుంటుంది.

మరణించిన లేడి జ్ఞాపకార్థం అక్కడి స్కూలు టీచర్ (పేరు: హోలోఫెర్నెస్) ఒక విషాద గీతం రచించి అందరికీ వినిపిస్తాడు. తన కవితా సామర్థ్యంమీద అతనికి గట్టి నమ్మకం. "అప్రయత్నంగా వస్తుంది కవిత్వం నాకు. పదాలు, సమాసాలు నా ఆటబొమ్మలు....." జాకెనెటా తనకు చేరిన ఉత్తరం చదివి చెప్పమనటంతో కవిత్వ చర్చ మధ్యలో ఆగిపోతుంది. బెరాన్ రాసిన ఆ ఉత్తరంలో వ్యాకరణ దోషాలు ఎత్తిచూపుతాడు హోలోఫెర్నెస్. ఇది తుచ్ఛ కవిత్వమని తీర్మానిస్తాడు. మొత్తం మీద ఈ ఉత్తరం జాకెనెటాకు చేరవలసిందిగాదు. దాన్ని రాజుగారికి పంపమని సూచించి, కవిత్వంమీద తన ఘోరమైన విమర్శ ప్రారంభిస్తాడు.

బెరాన్ గేయాలు రాయకుండా ఉండలేదు. రాజు వచ్చినప్పుడు చేతిలో కాగితం పట్టుకుని నిల్చుంటాడు. కాని అతడిని చూసి ఓ మూల నక్కుతాడు. రాజుకు కూడా

ప్రేమ గాయం సలుపుతున్నది. అందువలన అతడూ ఓ గేయం రాస్తాడు. రాకుమారికి దొరికేటట్టుగా ఆ కాగితాన్ని జారవిడవాలి.

అటుగా వస్తున్న తన ఉద్యోగిని చూసి బెరాన్‌లాగ రాజు కూడా ఓ పొద వెనకాల దాక్కుంటాడు. ప్రేమలో పడినవాళ్లు కవిత్వ గండాన్ని తప్పించుకోలేరు. అప్పుడే ప్రవేశించిన నాలుగో ఉద్యోగి కూడా ఓ గేయం చదువుతాడు. రాజు లేచి ప్రేమగీతాలు రాసి వాగ్దాన భంగం చేసిన ఉద్యోగులను మందలిస్తాడు. బెరాన్ వచ్చి రాజు కూడా రాశాడని ప్రకటిస్తాడు.

మిత్రులు నిరాశ పర్చినందుకు బెరాన్ ఖిన్నుడవుతాడు. ఈలోగా రోసాలైన్‌ను ఉద్దేశించి రాసిన గేయం పట్టుకుని జాకెనెటా ప్రవేశిస్తుంది. బెరాన్ దాన్ని చించివేయ ప్రయత్నిస్తాడు. ఒక ఉద్యోగికి దానిమీద బెరాన్ పేరు కనిపిస్తుంది. చివరికి తనూ ప్రేమోపహతుణ్ణేనని అంగీకరించక తప్పదు. కాని వాగ్దానాన్ని ఉల్లంఘించలేదనే వాదిస్తాడు. సత్యాన్వేషణలో, శాస్త్రాధ్యయనంలో మూడు సంవత్సరాలు గడుపుదామన్నారు. నిజానికి యువకులందరూ పడతులను అధ్యయనం చెయ్యటంలో కాలం గడపాలి. అందువల్ల నలుగురు మిత్రులూ ఫ్రెంచి సుందరులను బాహాటంగా ప్రేమించి వాళ్ల వినోదం కోసం అనేక కార్యక్రమాలు ఏర్పాటు చేస్తారు.

ఈ ఆటపాటలన్నీ ఆర్మాడో ఆధ్వర్యంలో జరగాలి. రాకుమారి కోసం మధ్యాహ్నం కార్యక్రమం ఏర్పాటు చేస్తాడు. హోలోఫెర్నెస్ సహాయంతో 'నైన్ వర్దీస్' ప్రదర్శించాలని నిర్ణయిస్తారు. పాత్రల సంఖ్యకు సరిపడా మనుషుల్లేరు గనక, తను మూడు పాత్రలు పోషిస్తానంటాడు హోలోఫెర్నెస్.

ప్రేమికులు తమ ప్రియురాళ్లకు బహుమతులు పంపిస్తారు. పురుషులను ఆట పట్టించాలని యువతులు ముసుగులు తొడుక్కుంటారు. వాళ్లు పంపిన బహుమతులు కూడా మార్చుకుంటారు. ఫలితంగా రష్యన్ల వేషంలో వచ్చిన యువకులు వాళ్లను గుర్తుపట్టలేరు.

తదుపరి దృశ్యంలో రాజూ, అతడి ఉద్యోగులూ సహజ రూపాల్లో దర్శనమిస్తారు. రాకుమారిని రాజ ప్రాసాదంలోకి ఆహ్వానిస్తాడు రాజు. కాని వాగ్దాన భంగం చేయించటం తనకిష్టం లేదంటుంది ఆమె. ఒంటరిగా ఉంటే విసుగొస్తున్నదేమో అంటాడు రాజుగారు. కొందరు రష్యన్ మూర్ఖులు ఇప్పుడే తమకోసం వచ్చారని చురకంటిస్తారు యువతులు. రష్యాలాంటి దూరదేశం నుండి వచ్చిన ఆగంతుకులు అలసిపోయి ఉంటారు కాబోలు నంటుంది రోసాలైన్. ఎవరి ప్రియురాళ్లను వాళ్లు సరిగా గుర్తించలేకపోయామని అప్పటికిగాని అర్థంకాదు రాజుకూ, అతని అనుచరులకూ.

అంతేకాదు. ప్రేమ లేఖలు పద్యాలలో కన్నా, సులభ వచనంలోనే బాగుంటాయని కూడా తెలిసి వస్తుంది. కాని ప్రేమోన్మాదులకు కఠిన పదాలే తడుతుంటాయి.

నాటకానికి రంగం సిద్ధమైంది. తను నవ్వులపాలైనానని గ్రహిస్తాడు నవార్ రాజు. నాటక ప్రదర్శన ఇష్టం ఉండదు, ఇప్పటిదాకా జరిగిందంతా పెద్ద ప్రహసనమేగద.

ఔత్సాహిక నటుడు కాస్టార్డ్ మాత్రం ఎలాగైనా స్టేజి ఎక్కటానికి ఉవ్విళ్లూరుతుంటాడు. అయిగే డైలాగులు తప్పుగా పలుకుతాడు. 'పాంపే ది గ్రేట్'కు బదులు "పాంపే ది బిగ్" అంటాడు. రాకుమారికి ప్రదర్శన నచ్చుతుంది.

'నైన్ వర్దీస్'లో రెండవ పాత్ర అలెగ్జాండర్. నటుడు కొత్త కుర్రాడు. ప్రేక్షకుల పిల్లి కూతలకు భయపడిపోతాడు. అతణ్ణి పక్కకు తోసి మళ్లీ స్టేజెక్కుతాడు కాస్టార్డ్.

'వర్దీస్'లో తరువాతివాళ్లు జడాస్ మకాబియస్, హెర్క్యులిస్. స్కూలు టీచర్, మరొకరూ ఈ పాత్రలు వేస్తారు. హెర్క్యులిస్ పాత్రధారి అస్థిపంజరంలా ఉంటాడు - హెర్క్యులిస్ బాల్యంలో ఇలాగే ఉండేవాడని సమర్థించుకుంటారు ప్రదర్శకులు. 'జుడాస్' ఒక వాక్యం మాత్రమే వల్లించగలుగుతాడు. హెక్టార్ వేషంలో ఆర్మాడో ప్రవేశిస్తాడు. ప్రేక్షకులకు వీళ్లంతా విదూషకుల్లా కనిపిస్తారు.

చివరికి, కాస్టార్డ్, ఆర్మాడో, జాకెనెటాలు పోట్లాడుకోవటంతో నాటకం రసాభాసగా ముగుస్తుంది. ఫ్రాన్సు నుండి వార్తాహరుడు విషాద సమాచారం తీసుకొస్తాడు. ఫ్రెంచి రాజుగారు మరణించారు.

ఇటువంటి దుఃఖ సమయంలో తను వినోదంలో గడిపినందుకు రాకుమారి తనను తాను నిందించుకుంటుంది. తక్షణమే మాతృ దేశానికి తిరుగు ప్రయాణమవుతుంది. ఫ్రెంచి పడతుల ప్రియులు నలుగురూ వాగ్దానం చేస్తారు. రాజుగారి మరణం తర్వాతి శోక సంవత్సరమంతా వారు విందులు, వినోదాలకు దూరంగా ఉండాలి. ఆనందమే జీవిత లక్ష్యమన్న బెరాన్‌కు మరో అదనపు పరీక్ష పెట్టారు. ఆస్పత్రులకెళ్లి అక్కడా నవ్వగలడా? బెరాన్ ఈ ఛాలెంజి అంగీకరిస్తాడు.

శీతాకాలం వస్తుంది. ఔత్సాహిక నటీనటులు పక్షుల సంభాషణ రూపంలో నాటకం ప్రదర్శిస్తారు. షేక్స్‌పియర్ రాసిన చక్కటి పాటలతో ప్రదర్శన ముగుస్తుంది.





# 3. ది టేమింగ్ ఆఫ్ ద ష్రూ

కథలో మరో కథచెప్పే పద్ధతి ప్రాచీన కాలం నించీ ఉన్నది. షేక్స్‌పియర్‌కు ఇలాంటి ట్రిక్స్‌మీద పెద్దగా ఆసక్తి లేదు. ఒకసారి మాత్రం వాడి వదిలేశాడు.

కథా ప్రారంభంలో పాత గిన్నెలకు అతుకులు వేసేవాడొకడు చిత్తుగా తాగి నేలమీద పడి ఉంటాడు. అటుగా పోతున్న ఓ ధనికుడికి వాణ్ణి ఆట పట్టించాలనిపిస్తుంది. తీసికెళ్ళి, ఒక కోటలో పెట్టి రాచమర్యాదలన్నీ జరిపిస్తే! "మీరే మా యజమాని" అంటూ సేవకులు, పరిచారకులందరూ నమ్మబలికి, ఓ పని మనిషి వాడి భార్యగా కూడా నటిస్తే...!! మారిన పరిస్థితులను చూసి తను నిజంగా సంపన్నుడ్జేనని నమ్ముడా? "పేదవాడు అనుకోకుండా ఎదురైన విలాసాలకు ఎలా స్పందిస్తాడు" అన్న అంశం నవ్వు పుట్టిస్తుంది.

ఈ నయా ధనికుడి వినోదం కోసం ఒక నాటకం కూడా ప్రదర్శిస్తారు. ఒక గయ్యాళి యువతికి బుద్ధి చెప్పి, ఓ యువకుడు ఆమెను పెళ్లాడటం కథాంశం. నిజానికి రెండు కథలకూ సంబంధం లేదు. మొత్తంమీద ప్రేక్షకుల్ని కడుపుబ్బ నవ్వించటమనే ప్రయోజనం మాత్రం నెరవేరుతుంది.

ఇటలీలోని పదువా నగరంలో జరుగుతుంది గయ్యాళి కథ. ఒక ధనిక పర్యాటకుడు

లూసెన్షియో తన సేవకుడితో వస్తాడు. ఇంట్లో ఎవరో పోట్లాడుకుంటుంటారు. ఓ వర్తకుడికిద్దరు కూతుళ్లు - కాథరినా, బియాంకా. కాథరినాకు నోటి దురుసు. యువకులు ఆమెను పెళ్లాడటానికిష్టపడరు. అలాగే బియాంకాను ఇష్టపడని వాళ్లు ఉండరు. అంత మంచి పిల్ల. ఇద్దరు వ్యక్తులు ఆమె ప్రేమ కోసం ప్రయత్నిస్తున్నారు-ఒకడు యువకుడు. ఒకడు వృద్ధుడూ. పెద్ద కూతురి పెళ్లి చేసిందాకా బియాంకా గురించి ఆలోచించేది లేదంటాడు తండ్రి. కాథరినా సమస్యను పరిష్కరించాల్సిన భారం బియాంకాను ఆశిస్తున్న ఇద్దరికీ అప్పగిస్తారు. ఈలోగా లూసెన్షియో కూడా బియాంకాకు మనసిస్తాడు. వేషం మార్చుకుని ఆమెకు ట్యూషను మాస్టర్‌గా వెళ్లటానికి ప్రయత్నిస్తాడు.

మరో యువకుడు పెట్రూషియో ప్రవేశిస్తాడు. అతడి ఏకైక లక్ష్యం: డబ్బున్న పిల్లను పెళ్లి చేసుకోవటం. ఇతడు బియాంకాను ప్రేమిస్తున్న యువకుడి మిత్రుడు. కాథరినాను చేసుకోవటానికి ఇష్టపడుతున్నట్టుగా అతణ్ణి పరిచయం చేస్తారు. పెట్రూషియో తన సహచరుణ్ణి(లూసెన్షియో) సంగీతం టీచర్‌గా పరిచయం చేస్తాడు.

లూసెన్షియో సర్వెంట్ రూపంలో మరొకడు కూడా బియాంకా కోసం వస్తాడు. మొత్తంమీద ఈ గుంపులోని అందరిదీ ఒకే కోరిక: కాథరినా పెళ్లి.

కాథరినాకు తండ్రి మీద కోపం. చెల్లెలిపట్ల అసూయ. లోకమంతా తనకు వ్యతిరేకమని గట్టి నమ్మకం. పెట్రూషియోకు ఆమె స్వభావం తెలుసు. కాథరినాకు లూట్ (గిటార్ లాంటిది) నేర్పించటానికి వెళ్లిన మిత్రుడు (తలమీద) విరిగిన వాయిద్యంతో తిరిగి వచ్చాడు. ఆమె సరిగా వాయించలేదని చెప్పటమే అతడు చేసిన నేరం. అయితే పెట్రూషియోకు ఇలాంటి చిన్న చిన్న విషయాల గురించి దిగులు లేదు. ఆమె సంపన్నురాలు. దారికి తెచ్చుకుని పెళ్లాడటమే తన కర్తవ్యం.

కాథరినా ప్రవేశం. ఆమెకూ పెట్రూషియోకూ మధ్య వాగ్యుద్ధం జరుగుతుంది. ఇలాంటి దృశ్యాలు రంగస్థలం మీద బాగా రక్తికడతాయి. గెలుపెవరిది! అనే ఉత్కంఠ చివరిదాకా కొనసాగుతుంది. పెట్రూషియో ప్రతిచర్యా, ప్రతిమాటా కాథరినాకు మరింత కోపం తెప్పిస్తుంది. ఆమె అరుస్తుంది. కేకలేస్తుంది. "నీ స్వరం మధురాతి మధురం" నీ నడక నెమలి నాట్యం లాగుంద"ంటాడు పెట్రూషియో. "కాథరినా తనను గాఢంగా ప్రేమిస్తున్నద"ని అందరి సమక్షంలో ప్రకటిస్తాడు, "ఈ ఆదివారమే ముహూర్తం." ఆమెకు మాత్రం అతని మీద పట్టలేని కోపం. అక్క పెళ్లి నిశ్చయమైంది గనక, బియాంకా కోసం వస్తారు వరులు. లూసెన్షియో వేషంలో ఉన్న యువకుడూ, మరో వృద్ధుడూ ఆమె తండ్రికి డబ్బు ఎర చూపుతారు. టీచర్ల వేషంలో ఉన్న మరో ఇద్దరు ఆమెకు సంగీతం నేర్పిస్తామంటారు. ఈలోగా అక్క పెళ్లి పనుల్లో సాయం చెయ్యాలని బియాంకాకు కబురొస్తుంది.

పెళ్లి తంతు తమాషాగా ఉంటుంది. పెట్రూషియో పిచ్చివాడిలా వస్తాడు. (సేవకుడు

గ్రూమియో వేషమూ అదే) మొదట ప్రీస్టును చికాకు పెడతాడు. వస్తువులు అటూ ఇటూ విసిరేస్తాడు. పెళ్లికూతుర్ని గట్టిగా ముద్దు పెట్టుకుంటాడు. ఆ శబ్దం చర్చి ప్రాంగణమంతా ప్రతిధ్వనిస్తుంది. కాథరినా అతణ్ణి విందారగించి వెళ్లమని అడుగుతుంది. అతడు మాత్రం ఆమెను దొంగల్నుంచి రక్షిస్తున్నట్టుగా, భుజంమీద వేసుకుని పరిగెత్తుతాడు. "ప్రేయసీ, భయపడకు. నేనుండగా నీకు ఆపద రాదు."

పెట్రూషియో ఇంట్లో— కొత్త పెళ్లికూతురు గురించే అందరి ఊహాగానాలు. "అందంగా ఉంటుందా? కోపిష్టి అని విన్నాం. నిజమేనా?...."

చలికి గడ్డ కట్టుకుపోయిన నూతన వధూవరుల- పెట్రూషియో, కాథరినా - ప్రవేశం. విందు తినలేదు గనక, ఆకలితో నకనకలాడుతున్నారు. సేవకులు భోజనం వడ్డించబోతే, వాళ్లను తిట్టి పళ్లాలు గిరాటేస్తాడు పెట్రూషియో. (వండిందంతా నేలపాలైంది. కాథరినాకు ఆకలి దహించి వేస్తున్నది.) ఆ తర్వాత పడక గదిలో పరుపు బాగోలేదని గుడ్డలన్నీ చిందర వందర చేస్తాడు పెట్రూషియో. కాథరినాకు నిద్ర కూడా కరువవుతుంది. ఇల్లు పీకి పందిరేసే ఈ సీన్లో "నీ సుఖం కోసమే ఇదంతా." అంటూ భార్యనుద్దేశించి పాట కూడా పాడుతాడు. కాథరినా కోపానికి పట్టపగ్గాలుండవని మనకు తెలుసు. కాని పెట్రూషియో ప్రవర్తన ఆమెను కూడా హడలగొట్టింది.

ఈలోగా - పదువా నగరంలో -

సంగీతం టీచర్‌గా వచ్చిన లూసెన్షియోతో ప్రేమలో పడింది బియాంకా. ఈ ప్రేమ పోటీలో ఆమెను గెల్చుకోలేని మరో యువకుడు ఒక ధనిక విధవను పెళ్లాడాలని నిశ్చయించుకుంటాడు. మారువేషంలో ఉన్న లూసెన్షియో పరిచారకుడు దీనికీ అడ్డం పడతాడు. పెట్రూషియో ఇంట్లో - ఆకలికి తాళలేని కాథరినా, ఆహారం కావాలని గ్రూమియోను బతిమాలుతున్నది.

"ఆజ్ఞాపించటమే తప్ప అర్థించటం తెలియదు. తిండీ, నిద్రాలేక శోషవచ్చి పడిపోతాను.

నా సుఖం కోసమే ఇదంతా అంటాడు (పెట్రూషియో)."

గ్రూమియో జాలిపడి పిసరంత భోజనం నోటికందిస్తాడు.

పదువాలో పెట్రూషియో పెళ్లికూతురి కోసం కొత్త డ్రెస్సు ఆర్డర్ చేస్తాడు. ఒక టోపీ పట్టుకుని డ్రెస్ మేకర్ ప్రవేశిస్తాడు. అది చూసి కాథరినా ముచ్చటపడుతుంది. టోపీ ఛండాలంగా ఉందంటాడు పెట్రూషియో. కాథరినాకు కోపం వస్తుంది. "నువ్వు నన్ను ప్రేమించు. ప్రేమించకపో. నాకు మాత్రం ఈ కాప్ నచ్చింది. ఇస్తావా, ఇవ్వవా?"

"ఇవ్వను."

దర్జీ కొత్త గౌను తీసుకొస్తాడు. పెట్రూషియో దానికీ వంకలు పెడతాడు. నిజానికి దర్జీ పనిలో లోపం లేదు. కాని కాథరినా ముందర పెట్రూషియో ఈ నాటకం ఆడక

తప్పదు. ఆమె నోటి దురుసుకు మందు ఇదే. మొండిని లొంగదీసుకోవటం జగమొండికే సాధ్యం. పెట్రూషియో 'కోపం' ముందు తను నిలువలేనని గ్రహించింది కాథరినా.

— పదువాలో, లూసెన్షియో, బియాంకాల పెళ్లి పనులు కొనసాగుతున్నాయి. అన్నీ మారు వేషాలే. లూసెన్షియో "తండ్రి", బియాంకా తండ్రిని కలిసి "కొడుకు" పెళ్లికి అంగీకారం తెలుపుతాడు. ఈలోగా, లూసెన్షియో 'అసలు తండ్రి' కొడుకును చూడాలని పదువా చేరుకుంటాడు.

దార్లో కాథరినా, పెట్రూషియోలు కనిపిస్తారు. పెట్రూషియో వెన్నెలను వర్ణిస్తున్నాడు. విస్తుపోయిన కాథరినా "ఇది పట్టపగలని" ఏడ్చి మొత్తుకుంటుంది. తనతో వాదిస్తే, వదిలేసి ఇంటికి పోతానంటాడు పెట్రూషియో. మొండి మొగుడు. మూర్ఖుడు. ఆకాశంలో కనిపించేది చంద్రుడేనని అంగీకరిస్తుంది కాథరినా: పెట్రూషియో గుక్కతిప్పుకోకుండా, "చంద్రుడు కాదు సూర్యుడం"టాడు. కాథరినా దానికీ అవునంటుంది. కలిసి ఉండాలంటే, పెట్రూషియో చెప్పిన దానికల్లా తలూపటం తప్ప గత్యంతరం లేదు. అయితే ఏమాటకామాటే చెప్పుకోవాలి. కాథరినా ఏం చేసినా ఇష్టపూర్వకంగా చేస్తుంది. గయ్యాళిగా ఉన్నపుడెంత ఆనందించిందో, ఇప్పుడు భర్తచాటు భార్యగా అంత సుఖంగానూ ఉన్నది. పెట్రూషియో సమస్య తీరింది.

'లూసెన్షియో తండ్రి' పరిస్థితి అయోమయంగా ఉన్నది. కొడుకుకు బదులు మరెవడో వచ్చి "నాన్నా" అన్నాడు. పైగా అందరూ కలిసి తనకు పిచ్చెక్కిందన్నారు. అంతలో అసలు లూసెన్షియో, నవ వధువు బియాంకాతో ప్రవేశిస్తాడు.

ఇప్పటికిగాని కథ సుఖాంతం కాలేదు. కొత్త దంపతులు పెట్రూషియో-కాథరినా; లూసెన్షియో-బియాంకా, మరో యువకుడూ-ధనిక వితంతువు. విందు కోలాహలం ముగిసిన తర్వాత 'గయ్యాళి'ని చేసుకున్నందుకు అతిథులు పెట్రూషియో మీద జాలిపడతారు. కాథరినా చాలా "అనుకూలవతి" అని పందెం కాస్తాడు పెట్రూషియో.

మొదట, లూసెన్షియో తన భార్య బియాంకాను తక్షణమే రమ్మని ఆహ్వానిస్తాడు. "పనిలో ఉన్నాను. తర్వాత వస్తానని" కబురు పంపుతుంది ఆవిడ.

(ధనిక వితంతువు) భార్యను రమ్మంటాడు ఆమె భర్త. రానంటుందావిడ.

పెట్రూషియో కనుసైగ చేస్తే చాలు, పరిగెత్తుకుంటూ వచ్చింది కాథరినా.

అంతేకాదు, ఆమె, ఆ ఇద్దరు పడతులకు పతివ్రతా ధర్మాలు కూడా బోధిస్తుంది.

చివరికి, గయ్యాళి పాద దాసిగా మారింది.



# 4. ది టూ జెంటిల్మెన్ ఆఫ్ వెరోనా

రొమాంటిక్ కామెడీలు రాయటంలో ఇది షేక్స్పియర్ తొలి ప్రయత్నం. అప్పటికే నాటక రచనలో పట్టు సాధించాడని చెప్పలేం.

ప్రేమనూ ప్రేమికులనూ గురించిన ఒక అభూత కల్పన ఇది. అందరు యువతీ యువకుల్లాగే ప్రేమకు హేతుబద్ధత ఉండనవసరంలేదని రచయితా నమ్మాడు.

వాలెంటైన్, ప్రొటియస్‌లు యువకులు. మంచి మిత్రులు. ఒకర్ని విడిచి ఒకరుండలేరు. మొదటి సీనులో వీడ్కోలు చెప్పుకుంటున్నారు. పై చదువులకు వాలెంటైన్ మిలాన్ నగరం వెళ్లాలి. ప్రొటియస్ ఊళ్లోని సుందరి జూలియా ప్రేమలో పడ్డాడు. తన మిత్రుడి సేవకుడి (పేరు:స్పీడ్) ద్వారా ప్రియురాలికి ప్రేమలేఖ కూడా పంపించాడు. ఇంత గొప్ప పనిచేసినా 'టిప్' దొరకనందుకు స్పీడ్ కోపంగా ఉన్నాడు.

అయితే ఉత్తరం జూలియా చెలికత్తెకు చేరింది. ఇదే అదనుగా ఆపిల్ల యజమానురాల్ని ఆటపట్టిస్తుంది. జూలియాకు అతడంటే ఇష్టమేగాని పైకి చెప్పటం ఇష్టంలేదు. అందువల్ల

ఉత్తరం లాక్కుని చించి మళ్లీ ముక్కల్ని ఏరటానికి ప్రయత్నిస్తుంది. ఉద్వేగం ఆపుకోలేక మరి కాసే పటికి ప్రియుడికి జవాబు రాస్తుంది. ప్రొటియస్ అది చదువు కుంటూ ఉన్నప్పుడు తండ్రి కంట పడుతుంది. కొడుకును వాలెంటైన్‌తో పాటు చదువులకు మిలాన్ పంపాలని నిర్ణయించు కున్నాడతడు. తత్తరపాటు తో, తను చదువుతున్నది మిత్రుడి లేఖ అని అబద్ధ మాడతాడు ప్రొటియస్.

'మిలాన్‌లో అక్కడి డ్యూక్ కూతురు సిల్వియా ను ప్రేమిస్తాడు వాలెంటైన్. షేక్స్‌పియర్ నాటకాల్లో సేవకులకు యజమానులంటే భయం ఉండదు. స్పీడ్ తన యజమానికి ప్రేమ గురించి ఓ లెక్చరిస్తాడు. అప్పటికే ప్రేమికుల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు కొనసాగుతుంటాయి. వాలెంటైన్ లేఖలు తనకక్కర్లేదనీ, ఒక అనామక ప్రేమికుడికి తన తరఫున రాయటానికి వీటిని వాడుతున్నాననీ బుకాయిస్తుంది సిల్వియా. లోపల మాత్రం అతడంటేనే ప్రేమ.

ప్రొటియస్ మిలాన్ వెళ్లటానికి సిద్ధమవుతాడు. జూలియాకు వీడ్కోలు చెప్పక తప్పదు. అతడి సేవకుడు లాన్స్‌ది కూడా బలవంతపు ప్రయాణమే. తల్లీ, దండ్రీ, అక్కలు, చెల్లెళ్లు, ఇంటిల్లిపాదీ (పిల్లితో సహా) ఏడుస్తారు. కుక్కను మాత్రం వెంట తెచ్చుకుంటాడు. అందరూ ఎందుకింత రభస సృష్టించారో దాని కర్థం కాదు.

మిలాన్ వెళ్లాక తెలుస్తుంది. సిల్వియాకు మరో ప్రియుడున్నాడు. అతడి పేరు తూరియో. అతడి తండ్రి (డ్యూక్) కొడుకు ప్రేమను ఆమోదించాడు. ప్రొటియస్‌తో కలుపుకుని ఆమె ప్రేమికుల సంఖ్య మూడుకు చేరింది. అతడు కూడా జూలియాకు చేసిన వాగ్దానాలు మరిచి సిల్వియా మీద కోరిక పెంచుకుంటాడు. ఇది మిత్రద్రోహం. వాలెంటైన్ చాలాకాలంగా ఆమెను ప్రేమిస్తున్నాడని అతడికి బాగా తెలుసు. కాని ప్రొటియస్ అంటేనే "మార్పు. మారగలిగింది" అని అర్థం. సార్థక నామధేయం.

ప్రియుని వియోగాన్ని భరించలేక జూలియా, వెరోనా నుండి మిలాన్‌కు పయన మవుతుంది. స్త్రీలు ఒంటరిగా ప్రయాణం చెయ్యకూడదు. అందువల్ల పురుష వేషం వేసుకుంటుంది. వెంటవచ్చిన చెలికత్తె ఆమెతో పరాచికాలాడుతుంటుంది.

సిల్వియా, వాలెంటైన్‌లు కలిసి లేచిపోవాలనుకుంటున్నారని ప్రొటియస్‌కు తెలుస్తుంది. వాలెంటైన్ తాడుతో చేసిన నిచ్చెన తీసుకొస్తాడు. దాని సాయంతో ఆమె మేడ కిటికీలోంచి దిగుతుంది. ప్రొటియస్ ఈ రహస్యం సిల్వియా తండ్రికి చెబుతాడు. వాలెంటైన్ తన డ్రెస్సులో దాన్ని దాచుకున్నట్టుగా గ్రహిస్తాడు డ్యూక్ (సిల్వియా తండ్రి). అతడికి నగర బహిష్కరణ శిక్ష కూడా విధిస్తాడు. జాలిపడినట్టుగా నటిస్తూ, మిత్రుణ్ణి పొలిమేరలదాకా సాగనంపుతాడు ప్రొటియస్. స్పీడ్ కూడా యజమానిననుసరిస్తాడు.

ప్రేమ వ్యవహారంలో తూరియోకు సాయం చేసినట్టు నటిస్తాడు ప్రొటియస్. విషాద ప్రేమగీతాలు పాడితే ఆమె వలలో పడుతుందని సలహా ఇస్తాడు. అందుకోసం ఒక

కచేరీ కూడా ఏర్పాటు చేస్తాడు.

నగరం దాటి అడవిలోకి ప్రవేశిస్తాడు వాలెంటైన్. బందిపోట్లు తారసపడి అతణ్ణి తమ నాయకుడిగా ఉండమని అర్థిస్తారు. స్త్రీలకూ, నిరుపేదలకూ హానిచెయ్యని పక్షంలో అభ్యంతరం లేదంటాడు వాలెంటైన్.

సిల్వియా మేడ కిటికీ కింద పాటల కచేరీ ప్రారంభమవుతుంది. ప్రేక్షకుల్లో జూలియా కూడా ఉంది. ప్రొటియస్ ఇప్పుడు సిల్వియా కోసం వల వన్నుతున్నాడని తెలుసుకుంటుంది. తూరియోను ఉసిగొల్పుతాడు గాని, అతడు లేనప్పుడు తను స్వయంగా సిల్వియా పొందుకోసం ప్రయత్నిస్తాడు ప్రొటియస్. సిల్వియాకు అతడిమీద మోజు పోయింది. ఇప్పుడు అసహ్యం కూడా.

మరునాడు, తన సేవకుడు లాన్స్ ద్వారా ఒక మేలు జాతి కుక్కను సిల్వియాకు బహుమతిగా పంపిస్తాడు ప్రొటియస్. ఇంత చిన్న కుక్క(ఉడతంత ఉంది!)కు బదులు మరో పెద్ద బహుమతి ఇస్తే బాగుంటుందని ఊర కుక్కను తీసికెడతాడు లాన్స్. సిల్వియా దాన్ని అంగీకరించదు. తిరిగి వస్తున్న లాన్స్‌కు ప్రొటియస్ పక్కన మరో యువకుడు ఎదురు పడతాడు. ఆ 'యువకుడే' జూలియా. లాన్స్‌లాంటి మూర్ఖుడు రాయబారానికి పనికి రాడనుకుని జూలియాను ఒక ఉంగరం ఇచ్చిరమ్మని అడుగుతాడు.

జూలియా, సిల్వియాలు కలిసిన దృశ్యం ఆసక్తికరంగా ఉంటుంది. (ఇలాంటి సీన్‌నే 'ట్వెల్ఫ్త్ నైట్'లో మరింత ప్రతిభావంతంగా వాడాడు షేక్స్‌పియర్). ప్రొటియస్ ప్రేమించి మోసగించిన అభాగ్యురాలి గురించి సిల్వియాకు చెబుతుంది జూలియా. సిల్వియా బాధపడుతుంది. వాలెంటైన్‌ను ఎలాగైనా వెదికి పట్టుకుని అతడితో వెళ్లిపోవాలని నిర్ణయించుకుంటుంది సిల్వియా. చీకటి పడ్డాక నగరం దాటుతుంది.

సిల్వియా కోసం అడవిలోకి ప్రవేశిస్తాడు ప్రోటియస్– వెంట (మారువేషంలో) జూలియా కూడా ఉంది. సిల్వియా కనిపించగానే గాఢాలింగనం కోసం ప్రయత్నిస్తాడు వాలెంటైన్. ప్రోటియస్ తన దుష్ప్రవర్తనకు పశ్చాత్తాపపడతాడు. వాలెంటైన్‌లో మిత్ర ప్రేమ పొంగి పొర్లుతుంది. "నువ్వింతగా కోరుకున్నావు గనుక సిల్వియా నీదే" అంటాడు. ఈ పరిణామానికి జూలియా మూర్ఛపోతుంది. కాసేపటికి తేరుకుని తన వేషం తొలగిస్తుంది. ప్రోటియస్ తనకు జూలియా తప్ప మరెవరూ అక్కర్లేదంటాడు. వాలెంటైన్ సిల్వియాల వివాహానికి అడ్డు తొలగింది. డ్యూక్‌గారు హఠాత్తుగా రంగ ప్రవేశం చేసి బందిపోట్లతో సహా అందరికీ క్షమాభిక్ష ప్రసాదిస్తాడు.

కామెడీల్లో ఇంతకన్నా ఇంకేముంటుంది?



# 5. ఎ మిడ్ సమ్మర్ నైట్స్ డ్రీం

షేక్స్పియర్ నాటకాలన్నింటిలోకీ అత్యంత సుకుమారమైన, అందమైన, సమ్మోహనకరమైన నాటకమిది. పువ్వులూ, పడుచు జంటల ప్రేమకలాపాలూ, స్వప్నాలూ, ఎగిరివచ్చే అప్సరసలతో ఒక అద్భుత వాతావరణం సృష్టిస్తాడు కవి. కథాస్థలం ప్రాచీన ఏథెన్స్ నగరం. ఆరు బయట వెన్నెలలో జరుగుతుంది కథ. ఆ మసక వెలుగులోనే ఒక స్వాప్నికత ఉంటుందని అనుభవించిన వాళ్లందరికీ తెలుసు.

కలలలో హేతుబద్ధత ఉండదు. ఒక అదృశ్య మాంత్రికుడు తన మాయాజాలంతో లోకాన్ని పునర్నిర్మిస్తాడు. కాని ఇదంతా ప్రేక్షకులు అనుభవించారంటే దానికి కారణం షేక్స్పియర్ కవితా సౌరభం. పదలాలిత్యం. ఊహల జలతారు నేసిన రసమయ భావన. అతడి కవితాశక్తి విశ్వవిజేత థీసియస్‌కన్నా, అప్సరసల రాజు ఆబెరాన్‌కన్నా బలీయమైంది.

మొదటి దృశ్యం : థీసియస్ రాజప్రాసాదం. థీసియస్ యుద్ధం చేసి విజేతగా తిరిగి వచ్చాడు. అమెజాన్ రాణితో వివాహానికి నిరీక్షిస్తున్నాడు. పున్నమినాడు ముహూర్తం. విరహాగ్నితో రగిలిపోతున్నాడు థీసియస్.

రాజుగారి కూతురు (హెర్మియా) మాట వినటంలేదని విన్నవించుకుంటాడు రాజభటుడు. ఆమెను ఒక ఎథీనియన్ యువకుడు డెమెట్రియస్‌కిచ్చి పెళ్లి చెయ్యాలని నిశ్చయించారు. కాని ఆ పిల్ల మరో కుర్రాడు లైసాండర్‌ను ఇష్టపడింది. ప్రేమికులిద్దరూ రహస్యంగా లేచిపోయి ఏథెన్స్ సమీపంలోని అరణ్యంలో కలుసుకోవాలనుకుంటారు.

తన ప్లాను స్నేహితురాలు హెలెనాకు చెబుతుంది హెర్మియా. హెలెనా డెమెట్రియస్‌ను ప్రేమించింది. హెర్మియా అడ్డు తొలగితే అతడు తనవాడవుతాడు. కాని ఇంత ముఖ్యమైన విషయం తన ప్రియుడికి చెప్పకుండా ఎలా "అతడ (గీతడు!) డెమెట్రియస్ ప్రేమికులను వెంటాడితే, తను అతడి వెంట వెళ్లొచ్చు.

తన పెళ్లినాటి రాత్రి వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేశాడు థీసియస్. అతడి గౌరవార్థం ఒక నాటకం కూడా ప్రదర్శిస్తారు. నటీనటులందరూ దర్శక బాధ్యతలు చేపట్టిన పీటర్ క్విన్స్ (వృత్తిరీత్యా అతడు వడ్రంగి) ఇంట్లో సమావేశమవుతారు. మరో యువకుడు నిక్ బాటమ్ తనను తాను అసిస్టెంట్ డైరెక్టర్‌గా ప్రకటించుకుంటాడు. నాటకం పేరే ఒక అద్భుతం. "అతి విషాద ప్రహసనం: పిరామస్, థిస్బీల దారుణ హత్య." అందరూ ఔత్సాహికులే. కాని అన్నీ తెలుసనుకుంటారు. మూర్ఖుడు జీనియస్‌లా ప్రవర్తిస్తే అదే నవ్వులాట. హాస్యానికి తొలిమెట్టు. రచయిత ఈ వైరుధ్యాన్ని వాడి, మామూలు మనుషులను కూడా విదూషక పాత్రలుగా మలిచాడు.

దర్శక బాధ్యతలు చేపట్టినవాడికి సమస్యలకు కొదవేముంది! "మీరు కూర్చోండి. నేను చేసి చూపిస్తానుగా" అంటూ హామీ ఇస్తాడు బాటమ్. క్విన్స్ చెప్పినట్టు ఎవ్వరూ వినరు. పిరామస్ పాత్ర (హీరో) బాటమ్ వెయ్యాలంటాడు దర్శకుడు. కాని అసిస్టెంట్ డైరెక్టర్ తనను అంతకన్నా మంచి పాత్రలో ఊహించుకుని నాటకంలో లేని డైలాగులన్నీ చదువుతాడు. మరో యువకుడు ఫ్లూట్‌ను హీరోయిన్ థిస్బీ వేషం వెయ్యమంటాడు క్విన్స్. కాని వాడికి గడ్డం పెరిగింది. ఇదే అదునుగా తను హీరోయిన్ పాత్ర వేస్తానంటాడు బాటమ్.

మరో యువకుడు స్నగ్ సింహం వేషం వెయ్యాలి. కాని వాడు లైన్‌లు జ్ఞాపకం పెట్టుకోలేడు. "నీకు లైన్లు లేవురా బాబూ, గర్జిస్తే చాలు" అంటాడు డైరెక్టర్. తను బాగా గర్జించగలనని బాటమ్ విశ్వాసం. ఆ పాత్ర కూడా తనే వేస్తానంటాడు. "పిరామస్ పాత్ర బాటమ్ వెయ్యక తప్పదు" అంటాడు క్విన్స్. "పిరామస్ సజ్జనుడు. ధీరోదాత్తుడు." సీను సీనుకు గడ్డం సైజు, రూపం మార్చి వేషం రక్తి కట్టిస్తానంటాడు బాటమ్.

నటులందరూ తమ తమ డైలాగులు కంఠస్థం చేసుకుని తెల్లవారి రిహార్సల్స్‌కు రావాలని ఆదేశిస్తాడు క్విన్స్. ఊళ్లో అయితే జనం చూస్తారు. ఒక మైలు దూరంలో వెన్నెల రాత్రి ఏకాంత ప్రదేశంలో నాటకం ప్రాక్టీసు చెయ్యాలి. అయితే, ఆ సమయంలో అక్కడికి రెండు గ్రూపులు వచ్చి చేరతాయి– ప్రేమికులు, నటులు. ఆ అందమైన పూదోటకు అప్సరసలు కూడా క్రీడించటానికి చేరుకుంటారు. అప్సరసల రాజు, రాణి కూడా వస్తారు. కాని వాళ్లు పోట్లాడుకున్నారు గనక వినోదంలో పాల్గొనరు. రాణి టాటియానా వెంట అనుచరుడున్నాడు. వాడు తనక్కావాలని రాజు ఆబెరాన్ అడుగుతాడు. రాణి అంగీకరించదు.

ఆబెరాన్ సేవకుల్లో ఒకడి పేరు 'పక్' ఎప్పుడు చిలిపి పనులు చేస్తుంటాడు. ఎక్కడో ఒక పువ్వుంది. దాని రసం ఎవరి కనుబొమలమీదైనా చిలకరిస్తే వాళ్లు కళ్లు తెరవగానే కనిపించిన మనిషితో ప్రేమలో పడతారు. ఆ పువ్వు కోసం పక్ ప్రపంచమంతా గాలిస్తాడు.

తదుపరి దృశ్యం: ప్రేమికులను వెదుకుతూ డిమెట్రియాస్, హెలెనాలు ప్రవేశిస్తారు. అతడు హెలెనాను ప్రేమించటం లేదని ఆబెరాన్‌కు తెలుసు. ఆ పువ్వు రసం కాస్త డెమిట్రియాస్ కళ్లమీద చిలకరించమని పక్‌ను ఆదేశించి, టాటియానామీద అదే ప్రయోగం తనూ చెయ్యటానికి వెడతాడు. ఆమె పూశయ్యమీద నిదురిస్తున్నది. క్రూరమృగాలు దరిచేరకుండా పాటలు పాడుతున్నారు చెలికత్తెలు. వయొలెట్ పువ్వులమీద పవ్వళించిన ఆమె కనురెప్పలమీద రసం చిలకరిస్తాడు రాజు.

లేచిపోయి వచ్చిన ప్రేమికులు కూడా ప్రవేశిస్తారు. వాళ్లు దారి తప్పారు. రాత్రంతా అక్కడే గడిపి తెల్లారి వెళ్లిపోదామనుకుంటారు. లైసాండర్‌ను చూసి అతడే డెమిట్రియస్ అనుకుంటాడు పక్. మరి కాసేపటికి కళ్లు తెరచిన లైసాండర్‌కు కనిపించిన మొదటి వ్యక్తి అటుగా వచ్చిన హెలెనా– అప్పటికే డెమిట్రియస్ ఆమెను తిరస్కరించాడు. ప్రియుడు కనిపించని హెర్మియా దిగులు పడుతుంది.

అప్పుడే నాటకం గ్రూపు ప్రవేశిస్తుంది. క్విన్స్ రిహార్సల్ ప్రారంభిద్దామంటాడు. కాని అందులో కొన్ని మార్పులు జరగాలని బాటమ్ కోరిక. రంగస్థలంమీద పిరామస్ నెత్తురు చూసి స్త్రీ ప్రేక్షకులు భయపడరా? అందువల్ల పిరామస్ నిజంగా మరణించలేదని సూత్రధారుడు ప్రేక్షకులకు స్పష్టం చెయ్యాలి.

నాటకంలో కఠిన పదాలు చాలా ఉన్నాయి. థిస్బీ పాత్రధారి ఫ్లూట్‌కు ఉచ్చారణ స్పష్టత లేదు. మాటలు మింగేస్తుంటాడు. బాటమ్ ప్రవేశంతో గందరగోళం రెట్టింపవుతుంది. అప్పటిదాకా అతడు ఒక పొదలో దాక్కున్నాడు. పక్ వచ్చి గాడిద తలకాయ అతనిమీద పడేశాడు. అది చూసి అందరూ భయపడి పారిపోతారు. అంతేకాదు. మెలకువ వచ్చిన టాటియానా అతడే కావాలని వెంట పడుతుంది. "ప్రేమకూ, బుద్ధికీ జత కుదరదులే" అంటూ వేదాంతం కూడా వల్లిస్తాడు బాటమ్. మాయామృగాలూ, గాడిదా పలకరించుకుంటాయి. బాటమ్ చాకచక్యంగా వాటితో మాట కలుపుతాడు. టాటియానా వచ్చి అతణ్ణి పక్కకు లాక్కెళుతుంది.

హెర్మియాను వదలలేక డెమిట్రియస్ వెంట వస్తాడు. కాని ఆమె కళ్లు లైసాండర్ కోసం వెదుకుతున్నాయి. అసూయతో డెమిట్రియస్ అతణ్ణి చంపి ఉంటాడని ఆమె నమ్మకం. తన అమాయకత్వాన్ని నిరూపించుకోలేక డెమిట్రియస్ మరి కాసేపటికి పడుకుని నిద్రపోతాడు.

లైసాండర్‌మీద రసం పోసినందుకు పక్‌ను మందలిస్తాడు ఆబెరాన్. హెలెనాతో ప్రేమలో పడాల్సింది డెమిట్రియస్. ఆమెను వెదికి తీసుకురమ్మని పక్‌ను పంపి

లైసాండర్‌మీద రస ప్రయోగం చేస్తాడు ఆబెరాన్. ఫలితంగా ఇద్దరు ఎథీనియన్ యువకులూ హెలెనా ప్రేమలో పడ్డారు. ఇది చూసి పక్ నవ్వుకుంటాడు.

ఇద్దరూ ఒకేసారి తన వెంట పడటంతో హెలెనా బెదిరిపోతుంది. అసలు తనను ఆట పట్టిస్తున్నారని కోపం కూడా వస్తుంది. అటు, హెర్మియాకు ఒక్కరూ మిగలలేదు. ఇదంతా హెలెనా పన్నాగమేనని ఆమె అనుమానం. ఈ ఆపదలో తనను ఆదుకునేవారే లేరా అని విలపిస్తుంది.

డెమెట్రియస్, లైసాండర్‌లలో ఒకరు మాత్రమే హెలెనాను ప్రేమించగలరు. ఎవరు మిగులుతారో తేల్చుకుందామని కత్తి యుద్ధానికి సిద్ధమవుతారు.

ఇదంతా పక్ ఉద్దేశపూర్వకంగా సృష్టించిన గందరగోళమనుకుంటాడు ఆబెరాన్. వెళ్ళి, ఇకనైనా పరిస్థితిని చక్కదిద్దమని పంపిస్తాడు. తన మంత్ర శక్తితో పక్ ప్రేమికులను ఏకం చేస్తాడు.

బాటమ్‌లాంటి లావుపాటి మనిషి మాట వినాలంటే టాటియానా చెలికత్తెలకు సమస్యే. మాయా మృగాలు అతణ్ణి పువ్వులతో అలంకరిస్తాయి. కొంత గింజ ధాన్యం ఆహారంగా ఇస్తాయి. కాని అతడికావలసింది కాసిన్ని ఓట్స్ (oats). కంటినిండా నిద్ర.

భార్య కళ్ళమీద రసం ప్రభావాన్ని నిర్మూలిస్తాడు ఆబెరాన్. ఆమె తన అనుచరుణ్ణి భర్తకివ్వటానికి సిద్ధపడుతుంది.

అప్పటికి ఉషోదయమైంది. రాజు, రాణి కలిసి ఆనంద నాట్యం చేస్తారు. సూర్య కిరణాల రాకతో అప్సరసలు అదృశ్యమవుతారు.

థీసియస్ జాగిలాలతో అడవికి వేటకొస్తాడు. నిద్రలో ఉన్న నలుగురు ప్రేమికులు కన్పిస్తారు.

డెమిట్రియస్ తాను వచ్చిన కారణం చెబుతాడు. కాని ఇప్పుడు సమస్య పరిష్కారమైంది. తనకు హెలెనా చాలు. హెర్మియాను లైసాండర్ ప్రేమించడంపట్ల తనకు అభ్యంతరం లేదు.

రాజుతోపాటు మిగతా రెండు జంటలూ అదే రోజు పెళ్ళి చేసుకోవాలనుకుంటారు. బాటమ్ ఒక్కడే మిగిలాడు. అతడిక్కూడా గాడిద తలలేదిప్పుడు. అదంతా కలని తెలుస్తుంది. ఈ అనుభవాన్ని నాటకంలో భాగంగా గానం చెయ్యాలనుకుంటాడు.

పీటర్ క్విన్స్ ఇంటిలో నటులందరూ సమావేశమవుతారు. కాని ప్రధాన పాత్రధారి లేడు. మూడు పెళ్ళిళ్ళు ఒకేచోట జరుగుతున్నాయి, 'విషాద ప్రహసనాన్ని' ప్రదర్శించి దండిగా నజరానాలు అందుకొనే అవకాశం చేజారింది. తిరిగి బాటమ్ రాకతో అందరిలో ఉత్సాహం ఇనుమడిస్తుంది. ఆహార్యానికి కావలసిన దుస్తులు సమకూర్చుకోవటానికి బయల్దేరతారు.

థీసియస్ భార్య, అనుచరులకు నాటకం గ్రూపువాళ్ళతో కాలం వృధా చెయ్యటం

ఇష్టం లేదు. కాని రాజు ఆడినమాట తప్పడు. "ఊహతో జీవం పోసుకున్న వెలుగునీడల ఆట."

'పిరామస్ విషాదగాథ' ప్రదర్శిస్తారు. సూత్రధారిగా క్విన్స్ ఉపోద్ఘాతం చదువుతాడు. కాని మాటలు కలిసిపోవటంతో వ్యతిరేకార్థం ధ్వనిస్తుంది. అర్థంకాని జటిల సమాసాలతో నాటకం, పిరామస్ ఆత్మహత్య సీను వచ్చేసరికి ఎవరికీ అర్థం కాదు.

'గోడ'గా నటిస్తున్న యువకుడు స్నౌట్ ప్రేక్షకులకు కథ వివరిస్తాడు.

ప్రేమికులను విడదీసిన గోడ నెమ్మదిగా పక్కకు తొలుగుతుంది. పిరామస్‌కు అటువైపున తన ప్రియురాలు థిస్బీ కనిపించదు. గోడను నిందిస్తాడు పిరామస్. గోడ మళ్లీ తిట్టాలని థీసియస్ అభిప్రాయం.

"లేదు. ప్రియుడు తనను మోసం చేసాడని భ్రమించి 'థిస్బీ' పాత్ర తిరిగి నిందిస్తుంది" అని వివరిస్తాడు బాటమ్.

ప్రేక్షకులందరూ ఎవరికి తోచిన వ్యాఖ్యానాలు వాళ్లు చేస్తుంటారు. నైనస్ సమాధి వద్ద ప్రేమికుల సమాగమం జరుగుతుంది. కాని నటులందరూ "నిన్నీస్" అంటూ పలుకుతారు. సింహ గర్జనకు భయపడి థిస్బీ పారిపోతుంది. ఆమెను సింహం చంపేసి ఉంటుంది అనుకుంటాడు పిరామస్. అప్పుడతడు ఒక దీర్ఘ ఉపన్యాసమిచ్చి పొడుచుకోవాలి. కాని తొందరలో ముందే పొడుచుకుని ఉపన్యాసం తర్వాత తీరిగ్గా చేస్తాడు.

థిస్బీ తిరిగివచ్చి ప్రియుడిమీద పడి రోదిస్తుంది. ఏడుపు అందరికీ నవ్వు తెప్పిస్తుంది. చివరికి ఆమె కూడా ఆత్మహత్య చేసుకుంటుంది.

"భలే ముగింపులో ఇలా ఉండాలి. అందరూ చచ్చారు. ఎవర్నీ తప్పు పట్టటానికి లేదు." అంటాడు థీసియస్ ఆనందంగా.

నవ్వులపాలై, నవ్వించిన విషాద నాటకం అలా ముగిసింది. అప్పటికి అర్ధరాత్రి దాటింది. అంటే దేవతల కాలం వచ్చేసింది. నిద్రాదేవి అందర్నీ ఆహ్వానించింది.

పక్, అప్సరసలు నూతన వధూవరులను ఆశీర్వదిస్తారు. నడి వేసవి కల ముగిసింది

# 6. ది మర్చంట్ ఆఫ్ వెనిస్



దురాశ ఇతివృత్తంగా సాగిన నాటకమిది. కథా వస్తువు డబ్బు. క్లైమాక్సులో ఒక హత్యా ప్రయత్నం కూడా జరుగుతుంది. రకరకాల మలుపులతో ఈ రొమాంటిక్ కామెడీ ఆద్యంతం ఉత్కంఠ భరితంగా సాగుతుంది.

ఇలాంటి అసాధారణ రచన షేక్స్పియర్‌కే సాధ్యమంటారు పండితులు. రెండు ముఖ్య పాత్రలూ చక్రాల్లా గుక్క తిప్పుకోలేనంత వేగంగా ముందుకు పరిగెత్తిస్తాయి కథను. ఆస్తికి వారసురాలు పోర్షియా, వడ్డీ వ్యాపారి షైలాక్‌ల పాత్రలు నటీనటుల ప్రతిభకు గీటురాళ్ళు.

వ్యాపార కేంద్రం వెనిస్ నగరంలో కథ ప్రారంభమవుతుంది. 'డబ్బు సంపాదించడం ఎలా' అన్నదే అందరికీ చర్చనీయాంశం. ఆంటోనియో ఒక వర్తకుడు. అతడి మిత్రుడు బసానియోకు అత్యవసరంగా డబ్బు కావాలి. అతడు ఉన్నదంతా తగలేసి అప్పుల్లో కూరుకుపోయాడు. ఇప్పుడు పెద్ద ఆస్తికి వారసురాలిని ప్రేమించాడు. ఆమెను పెళ్లాడాలని కోరిక. కాని చేతిలో చిల్లిగవ్వ లేదు. తనకు నచ్చిన స్త్రీ బెల్మాంట్ నగరంలో ఉంటుంది. అక్కడికి వెళ్లి, ఇతర యువకులతో పోటీపడి తన గొప్పదనం నిరూపించుకోవాలంటే డబ్బు కావద్దూ! ఆంటోనియో ఇవ్వగలిగేవాడే. కాని అతడి వాణిజ్య నౌకలు సరుకులతో ప్రయాణిస్తున్నాయి. అవి తిరిగి వచ్చినప్పుడే చేతికి డబ్బు వస్తుంది. కాని మిత్రుడంటే ప్రాణం. ఎక్కడైనా అప్పుచేసి బసానియోను ఆదుకోవాలి.

తదుపరి దృశ్యం: బెల్మాంట్‌లో అద్భుత సౌందర్యవతి పోర్షియా నివాసం. ఎంత ఆస్తి ఉంటేనేం, తగిన వరుడు దొరకనప్పుడు. వచ్చిన వాళ్లెవరూ నచ్చలేదు. నేపుల్స్

రాజకుమారుడు ఫరవాలేదు. కాని అతడి జ్ఞానమంతా గుర్రాలకే పరిమితం. ఫ్రెంచివాడు అస్సలు పనికిరాడు (దేవుడలా చేశాడు. బతకనీ పాపం!) ఇంగ్లీషు వరుడు ఇటాలియన్ భాష నేర్చుకోవటానికి నిరాకరించాడు. స్కాట్లండు మనిషికి పోట్లాటలంటే ఇష్టం. జర్మన్లు తాగుబోతులు. "ఎవరూ నచ్చలేదా?" అంటే ఏం చెబుతుంది పోర్షియా. తండ్రి బతికున్న రోజుల్లో బసానియో అనబడే యువకుడు తన నాకర్షించాడు. అతడు మళ్లీ కనిపిస్తే ఎంత బాగుండును!

వెనిస్‌లో డబ్బుల కోసం నానా యిక్కట్లు పడుతుంటాడు బసానియో. బెల్మాంట్ వెళ్లాలంటే మూడు వేల డుకాట్లు కావాలి. మూడు నెలల కోసం అంత డబ్బు ఇవ్వటానికి వడ్డీ వ్యాపారి షైలాక్ అంగీకరిస్తాడు. బసానియో తిరిగి చెల్లించలేకపోతే, మధ్యవర్తిగా ఉన్న ఆంటోనియో బాధ్యత వహించక తప్పదు. అతడి సమక్షంలో ఇదంతా జరగాలి గనక, షైలాక్‌ను విందుకాహ్వానిస్తాడు బసానియో.

షైలాక్ నిరాకరిస్తాడు. దానికో కారణముంది. అతడు యూదు జాతీయుడు. వెనిస్‌లో యూదులను అస్పృశ్యులుగా, వెలేసినట్టు చూస్తారు. ఊరి చివర ఎక్కడో ఉంటాయి వాళ్ల ఇళ్లు. వాళ్ల దుస్తులు కూడా వేరు. క్రిస్టియన్లకూ, యూదులకూ మధ్య అంత అఖాతముంది. వాళ్లు చేపట్టగలిగిన ఒకే ఒక వృత్తి వడ్డీ వ్యాపారం.

షేక్స్‌పియర్‌కు యూదులు పరిచయముండే అవకాశం లేదు. అతడి కాలంనాటికే వాళ్లను ఇంగ్లండు నుండి పంపించివేశారు. కాని మానవ స్వభావాన్ని అర్థం చేసుకోలేదా ఆ జీనియస్. వివక్షకు, అవమానాలకు గురైన మనుషులు లోపల ఎలా రగిలి పోతుంటారో, ఎలాగ ప్రచ్ఛన్న అగ్నిపర్వతాల్లాగ బతుకుతుంటారో అతడికి తెలుసు (యూదులది అత్యంత ప్రాచీనమైన జాతి). షైలాక్‌కు క్రిస్టియన్లంటే ద్వేషం. ఆంటోనియో పొడ కూడా గిట్టదు. వ్యాపారం తప్ప మరే లావాదేవీలూ అక్కర్లేదు ఇలాంటి వాళ్లతో. "మీతో కలిసి భోజనం చెయ్యటం నాకు నిషిద్ధం." ఆంటోనియోకు కూడా షైలాక్ అంటే జుగుప్స.

**"నేను అవిశ్వాసిని. గుంటనక్కను.**
**మామీద ఉమ్మేస్తారు మీరు.**
**ఇప్పుడు నా సాయం కావాలి నీకు.**
**నీ ముందర తల వంచను.**
**అవమానాలకు ప్రతిగా అప్పిస్తున్నాను నేను."**

అది షైలాక్ నిజ రూపం. కాని లోక వ్యవహారాల్లో మర్యాద ముసుగు ధరించక తప్పదు. తన వ్యాపారం సాగాలంటే వాళ్ల ముందు వంగి సలాములు చెయ్యక తప్పదు. శత్రువుమీద చావుదెబ్బ తియ్యటానికి ఆయుధం పదును పెట్టుకున్నాడు. పైకి మాత్రం

"ఇదంతా ఒక జోక్. కేవలం పరిహాసం కోసం మాత్రమే" అన్నాడు. మొత్తంమీద అగ్రిమెంటుమీద ఆంటోనియో సంతకం చెయ్యక తప్పలేదు. గడువులోగా డబ్బు తిరిగి ఇవ్వకపోతే ఆంటోనియో శరీరం నుండి ఒక పౌండు మాంసం కోసుకునే హక్కు సంతరిస్తుంది షైలాక్‌కు. అదీ ఒప్పందం. ఆంటోనియోకు మాట తప్పుతాననే భయం లేదు. నెలలోగా షిప్పులు తిరిగి వస్తాయి. చేతినిండా డబ్బే.

షైలాక్‌కో సేవకుడున్నాడు. వాడి పేరు లాన్సలాట్ గోబో. షైలాక్ అతణ్ణి బసానియో వెంట పంపిస్తాడు. బసానియో మిత్రుణ్ణి ప్రేమిస్తుంది షైలాక్ కూతురు జెస్సికా. తండ్రి భద్రంగా దాచిపెట్టిన బంగారం, నగలు తీసుకుని ఒక రాత్రి అతడితో లేచిపోతుంది. ఈ సంఘటనతో షైలాక్‌కు క్రిస్టియన్ల పట్ల ద్వేషం మరింత పెరిగింది.

ఇక, బెల్మాంట్‌లో పోర్షియా కోసం కొత్త యువకులు వచ్చి అభ్యర్థిస్తూనే ఉన్నారు. అందులో మొరాకో రాకుమారుడొకడు. తనకు నచ్చిన వరుణ్ణి ఎంచుకోవటం పోర్షియాకు కష్టసాధ్యమైన పని అన్న విషయం తెలిసి, వాళ్ళకో పరీక్షపెట్టి, అందులో నెగ్గినవాణ్ణి స్వీకరించాలని సూచించాడు ఆమె తండ్రి(మరణించేముందు). మూడు కలశాలు-బంగారం, వెండి, సీసం-వాళ్ళముందుంచాలి. ఒక దానిలో మాత్రమే పోర్షియా చిత్రపటముంటుంది. సరైన కలశం ఎంచుకొన్నవాడే ఆమెకు తగిన వరుడు.

బంగారం అత్యంత విలువైన లోహం గనుక, మొరాకో రాకుమారుడు ఆ కలశాన్ని పట్టుకుంటాడు. కాని అందులో ఒక పుర్రె దర్శనమిస్తుంది. పై పై ఆకర్షణలకు భ్రమపడవద్దని ఒక హెచ్చరిక కూడా ఉంటుంది. ఆరగాన్ రాకుమారుడు వెండి కలశం ఇష్టపడతాడు. అందులో ఒక ఇడియట్ బొమ్మా, మరో హెచ్చరికా ఉంటాయి. మూడో అభ్యర్థిని ప్రవేశపెట్టటానికి సన్నాహాలు జరుగుతాయి. అతడు తన యజమానురాలు ప్రేమిస్తున్న బసానియో కావాలని కోరుకుంటుంది పోర్షియా చెలికత్తె.

మళ్ళీ వెనిస్ నగర దృశ్యం. వీధిలో పచారు చేస్తున్నాడు షైలాక్. గేలిచేస్తూ ఆటపట్టిస్తున్నారు పిల్లలు. కూతురూ, దాచుకున్న నగలూ పోయాయి. తీర్చుకోవలసిన ప్రతీకారం తప్ప మరేమీ మిగల్లేదు. పగ సాధించటంలో కూడా ఒక ఆనందముంటుంది. తనను నాశనం చేసిన శత్రువులను మట్టి కరిపించాలి– "నేను యూదును. యూదులకు కళ్ళూ, కాళ్ళూ, చేతులూ, ప్రేమలూ, ఆపేక్షలూ, బాధలూ, కోపాలూ ఉండవా? మేమూ అందరిలాగే తిండి తినడం లేదా? తిడితే, కొడితే, అవమానిస్తే గాయపడమా? అందరిలాగే మాకూ జబ్బులు వస్తాయి. డాక్టర్లు చేసే చికిత్స అందరికీ ఒకటే. క్రిస్టియన్లలాగే మాకూ ఎండలో ఉక్క పోస్తుంది. చలిలో చలేస్తుంది. గాటుపెడితే మాకూ నెత్తురు కారుతుంది. చక్కిలిగిలి పెడితే నవ్వొస్తుంది. విషం తాగితే మేం కూడా చచ్చిపోతాం. అన్యాయం జరిగితే మేం ప్రతీకారం తీర్చుకోమా? దెబ్బకు దెబ్బ తియ్యటంలో మేమూ మీలాంటి వాళ్ళమే."

ఎలా పగ సాధించాలో తెలియక గిజగిజ లాడుతున్న షైలాక్‌కో శుభవార్త చెవిన పడుతుంది. ఆంటోనియో షిప్పులు మునిగిపోయాయి. ఆనందం పట్టలేక ఎగిరి గంతేస్తాడు. చివరికి ఒక క్రిస్టియన్ తన చేతికి చిక్కాడు. ఇక తడాఖా చూపించాలి.

బసానియోకు పరీక్ష పెట్టటానికి జంకింది పోర్షియా. అతడు సరైన కలశం ఎంచుకోలేకపోతే! కాని బసానియో క్షణం కూడా ఆగలేదు. ఇంగ్లీషులో లెడ్(సీసం)కు ప్రాసగా ఉన్న బ్రెడ్, హెడ్ పదాలతో ఒక పాట పాడుతుంది. ప్రియుడికి ఇంతకన్నా మరేం సాయం చెయ్యగలదు.

కాని బసానియోకు స్వభావరీత్యా బంగారు, వెండి తళుకులు గిట్టవు. పోర్షియో బొమ్మ ఉన్న మూడవ కలశమే ఎంచుకుంటాడు. పరీక్ష సుఖాంతమైంది. బసానియో అనుచరుడు పోర్షియా చెలికత్తెను ఇష్టపడతాడు. షైలాక్ కూతురు జెస్సికా కూడా తన భర్తతో బెల్మాంట్ చేరుకుంటుంది. అయితే ఆంటోనియో వాళ్ల వెంట పంపిన లేఖ మాత్రం అందర్నీ విషాదంలో ముంచేస్తుంది. షైలాక్‌కు తన శరీరంలోని మాంసం కావాలి. అంటే చావక తప్పదు. డబ్బు తను చెల్లిస్తానని చెప్పటానికి బసానియోను వెనిస్ పంపిస్తుంది పోర్షియా. కాని గడువులోగా చెల్లించలేదు గనుక షైలాక్‌కు మాంసమే కావాలి. "మమ్మల్ని కుక్కలన్నావుగదూ. కండలు పీక్కుతింటాయి కుక్కలు." భర్త తిరిగి వచ్చిందాకా తను సన్యాసం స్వీకరిస్తానంటుంది పోర్షియా. కాని నవ్వుతూ, తుళ్లుతూ ఉండే ఆమె స్వభావానికి సరిపడిన ప్రకటన కాదిది. మారువేషంలో లాయర్‌గా వెనిస్‌కెళ్లి ఆంటోనియో కేసు వాదించటానికి ప్లాన్ వేసింది. లాయర్ల దుస్తులు అరువివ్వటానికీ, సరైన న్యాయ సలహా చెప్పటానికీ ఆమె కజిన్ ఒకడున్నాడు. అలాగ, తనూ, లాయర్ గుమాస్తా వేషంలో ఆమె చెలికత్తె ప్రయాణమవుతారు.

డ్యూక్ ఆఫ్ వెనిస్, ఇతర పెద్దలూ కలిసి షైలాక్ మనసు మార్చటానికి ప్రయత్నిస్తున్నారు. అప్పటికి అక్కడ అమలులో ఉన్న చట్టాల ప్రకారం అతడి డిమాండ్ సబబే. ఎవరెంత అర్థించినా షైలాక్ చలించడు. ఇన్నాళ్లు తమను నానా అవమానాలపాలుచేసిన వాళ్లకు, తమను కుక్కలనీ, చీడ పురుగులనీ అసహ్యించుకున్నవాళ్లకు తనను క్షమించమని చెప్పే హక్కు లేదు. కులీనవర్గాల వాళ్లు నీతులు చెబుతారు గాని అందరి వద్దా బానిసలున్నారు. తమలో తమకెన్ని భేదాలున్నా, బానిసల విషయంలో మాత్రం అందరూ ఒకటే (బానిసలు వాళ్ల స్వంత ఆస్తి). అదే విధంగా ఆంటోనియో మాంసం మీదా షైలాక్‌కు హక్కుంది.

"నేను న్యాయం కోరుతున్నాను. జాలి గురించి ఉపన్యాసాలు వద్దు."

ఆంటోనియో తరపు వాళ్లు కోపంతో ఎంత అరిస్తే షైలాక్‌కు అంత ఆనందం. నిస్సహాయస్థితిలోనే అందరూ పెడబొబ్బలు పెడతారు. కోర్టులో గందరగోళం. షైలాక్ కత్తికి పదును పెడుతూ ఉంటాడు. ఆంటోనియో తల దించుకుని నిలుచుంటాడు. అప్పుడు ప్లీడర్‌గుమాస్తా "ప్రవేశిస్తాడు." ఒక ప్రముఖ లాయరు తను స్వయంగా

రాలేకపోతున్నందుకు చింతిస్తూ, తన తరఫున మరో ముసలాయన్ను పంపుతున్నానని పంపిన వర్తమానం వస్తుంది.

నల్లటి దుస్తుల్లో పోర్షియా ప్రవేశం. ఎదురుగా ప్రత్యర్థి షైలాక్. "క్షమించమని అడిగే హక్కు ఎవరికీ లేదు. అది స్వచ్ఛందంగా చెయ్యవలసిన పని.

"జాలి, దయాగుణాలు అడగకుండా కురిసే స్వచ్ఛమైన వర్షంలాంటివి. దయకోసం మోకరిల్ల వలసింది దేవుని ముందు. మనిషితో మొర పెట్టుకుని ప్రయోజనమేమిటి?"

చట్టం తనకనుకూలంగా ఉంది గనక గర్వంగా నవ్వుతాడు షైలాక్. "అతడి కోరిక న్యాయ సమ్మతమే" అంటూ ప్రారంభిస్తుంది పోర్షియా. లాయరు కూడా తనను సమర్థించినందుకు సంతోషంతో ఉబ్బితబ్బిబ్బవుతాడు షైలాక్. "ఒక పౌండు మాంసం మీద షైలాక్‌కు హక్కుంది. కాని అది తప్ప మరేం తీసుకోగూడదు. ఆ క్రమంలో ఒక్క చుక్క నెత్తురు కారినా చట్టాన్ని ఉల్లంఘించినట్టే. ఎందుకంటే నెత్తుటి గురించి అగ్రిమెంటులో లేదు. అందువల్ల నెత్తురు కారితే చట్టసమ్మతంగానే అతడి ఆస్తంతా కోర్టుపరమవుతుంది."

"అలా రాసుందా లా పుస్తకాల్లో?" అంటూ ఖంగు తింటాడు షైలాక్. అతడికి కాస్త ఆలస్యంగా జ్ఞానోదయమైంది. తనకు న్యాయం చెయ్యని చట్టంతో తనకేం పని! ఆంటోనియోతో రాజీ పడడానికి సిద్ధపడతాడు. కాని పోర్షియా అంగీకరించదు. చట్ట ప్రకారమే అంతా జరగనీ. ఈ దశలో రాజీ ఎందుకు? చివరికి తను ద్వేషించిన వ్యక్తిని క్షమించమని కాళ్లా వేళ్లాపడే స్థితి వస్తుంది షైలాక్‌కు.

ఆంటోనియో, అతడి మిత్రుడు బసానియో 'లాయరుగారి రుణం తీర్చుకోలేమ'ని కృతజ్ఞతలు చెప్పుకుంటారు. ఇదే అదనుగా పోర్షియా భర్తను సరదాగా ఏడిపిస్తుంది. అంతక్రితమే, 'నా యావదాస్తిని, నా భార్యను కూడా మీకర్పిస్తా'నంటూ లాయర్ను ప్రాధేయపడ్డాడు బసానియో. "కాని నీ భార్య నిన్ను క్షమించదు," అంటుంది పోర్షియా.

నిజంగా భార్య అక్కర్లేకపోతే, చేతికున్న ఉంగరం (వివాహచిహ్నం) ఇచ్చెయ్యమంటుంది పోర్షియా. బసానియో చిక్కులో పడతాడు. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆ ఉంగరం వేలినుండి తియ్యనని భార్యకు వాగ్దానం చేశాడు. చివరికి తప్పనిసరి కావడంతో ఇచ్చేస్తానంటాడు.

చివరి సీను బెల్మాంట్‌లో. అందరూ ఆనందంగా కబుర్లు చెప్పుకుంటుంటారు. ఉంగరం ప్రస్తావన వస్తుంది. ప్రాణం పోయినాసరే ఉంగరం తన వేలికే ఉంటుందన్నాడు బసానియో. భర్తను మరికాసేపు ఏడ్పించి అసలు విషయం చెప్పేస్తుంది పోర్షియా.



# 7. ది మెర్రీ వైవ్స్ ఆఫ్ విండ్సర్

మధ్య తరగతి మనుషుల గురించి షేక్స్‌పియర్ రాసిన ఒకే ఒక నాటకమిది- ఒక ఘరానా మనిషి మీద ఇద్దరు ఇల్లాళ్లు సాధించిన విజయగాథ. పెద్ద కథ. కాని సరదాగా సాగుతుంది.

విండ్సర్ కోట పక్కన విండ్సర్ గ్రామమున్నది. అప్పుడప్పుడూ రాజ దర్బారుకు సంబంధించిన వార్తలు అక్కడికి చేరుతుంటాయి. ఊరి వాతావరణం షేక్స్‌పియర్‌కు సుపరిచితం. పీస్కాడ్ వీధి దగ్గరున్న గార్టర్ ఇన్ (inn), థేమ్స్ నదీ తీరంలో స్త్రీలు బట్టలుతకటం వాస్తవికంగా ఉంటాయి. (మామూలుగా షేక్స్‌పియర్‌కు వాస్తవికత నచ్చదు. కాని ఇందులో మాత్రం చూసింది చూసినట్టుగా రాసాడనిపిస్తుంది.)

ఘరానా మనిషి పేరు సర్ జాన్ ఫాల్స్టాఫ్. (ఇది ఒక చారిత్రక నాటకంలో షేక్స్‌పియర్ సృష్టించిన పాత్ర.) లావుగా ఉంటాడు. మనిషి సీరియస్‌గా ఉన్నా ప్రేక్షకులకు మాత్రం నవ్వు తెప్పిస్తాడు. ఇందులో స్త్రీలందరూ తెలివైనవాళ్లు. పురుషులు మూర్ఖులు. వాళ్లలో

ఫాల్స్టాఫ్ ఒకడు.

మొదటి సీను: ఎవరో పోట్లాడుకుంటున్నారు. ఒక ప్రీస్టు సర్ది చెబుతున్నాడు. ఫాల్స్టాఫ్ తన ఆకతాయి మిత్రులతో వచ్చి గార్టర్ ఇన్‌లో దిగాడు. ఇతర అతిథులు వాళ్ళ న్యూసెన్స్ భరించలేక పోతున్నారు. ఫాల్స్టాఫ్ వద్ద డబ్బుల్లేవు. దొంగతనాలు కూడా ప్రారంభించారు మిత్రులు. లోకల్ మేజిస్ట్రేట్ జస్టిస్ షాలో వచ్చి పై అధికారులకు ఫిర్యాదు చేస్తానని బెదిరిస్తాడు. ఫాల్స్టాఫ్‌కు అభిమానం ఏమాత్రం లేదు. తన నేరాలన్నీ వెంటనే అంగీకరిస్తాడు. ఈ సమస్యను పరిష్కరించడానికి మరికొంతమంది పెద్దమనుషులను పిలిచి పంచాయితీ పెడతారు. జార్జి పేజ్ అందులో ఒకడు.

జార్జి పేజ్ కూతురు ఆన్ అందమైన ఆడపిల్ల. ఆన్‌ను జడ్జిగారి కజిన్ అబ్రహాం స్లెండర్‌కిచ్చి పెళ్లిచెయ్యాలని ప్రీస్టు ప్లాను వేస్తాడు. స్లెండర్ వట్టి ఫూల్. దగ్గిర ఎప్పుడూ ఒక పొడుపు కథల పుస్తకముంటుంది. (ప్రస్తుతమది ఆలిస్ షార్ట్‌కేక్‌కు అరువిచ్చాడు.) వీడ్ని చేసుకోడానికి ఆన్ ఇష్టపడదని కూడా ప్రీస్ట్‌కు తెలుసు.

ఊళ్లో ఒక ఫ్రెంచి డాక్టరుగారింట్లోని ఆయా పేరు మిసెస్ క్విక్లీ. ఆన్‌ను ఆమె ఒప్పించగలదని ప్రీస్టు నమ్మకం. అందుకోసం స్లెండర్ పనిమనిషిని ఆమె వద్దకు రాయబారం పంపిస్తాడు. ఫాల్స్టాఫ్‌కు పశ్చాత్తాపం లేదు. డబ్బుకోసం మరెన్ని జిత్తులు వేయాలా అని ఆలోచిస్తుంటాడు. పేజ్ ధనవంతుడు. అందువలన మిసెస్ పేజ్‌ను వలలో వేసుకుంటే ఆమె భర్త డబ్బు తనకు కొంతన్నా దక్కకపోదు. పేజ్ మిత్రుడి పేరు ఫ్రాంక్ ఫోర్డ్. అతడి భార్య మీద కూడా తన ప్లాను పారవచ్చు. ఇద్దరికీ ఒకేసారి గాలం వేసి లాగాలి. మిసెస్ పేజ్, మిసెస్ ఫోర్డ్‌లే "మెర్రీ వైవ్స్."

డబ్బుకోసం మిసెస్ క్విక్లీ ఏమైనా చెయ్యగలదు. ఆన్‌ను ఒప్పించటానికి ప్రయత్నిస్తానంటుంది. ఫెన్టన్ అనబడే యువకుణ్ణి ప్రేమిస్తున్నానని చెబుతుంది ఆన్. అయినా స్లెండర్‌కు ఇంకా ఆన్ మీద ఆశ చావదు. ఫ్రెంచి డాక్టరుకు ఆన్ అంటే యిష్టం. మరొకరికి సంబంధం చూస్తున్నాడని తెలిసి ప్రీస్టును కత్తి యుద్ధానికి ఛాలెంజి చేస్తాడు.

ఫాల్స్టాఫ్ ప్రేమ లేఖలు మిసెస్ పేజ్‌కు చేరుతాయి. ఎదిగిన కూతురున్న తనకు ఎవరో యిలాంటి ఉత్తరాలు రాయటం కోపం తెప్పిస్తుంది. ఇలాంటి నీచమైన ఉత్తరాలు రాయకుండా పురుషులకు వ్యతిరేకంగా చట్టం చేయాలంటుంది. "పార్లమెంటులో ఒక బిల్లు ప్రవేశపెడతాను." ఆలిస్ ఫోర్డుకు కూడా సరిగ్గా అలాంటి ఉత్తరమే వస్తుంది - ఒక్క పేరు మార్పు తప్ప. "వాడి దగ్గర ఇలాంటి లేఖలు వేలాదిగా ఉండుంటాయి. పేరు మార్చి అందరికీ రాస్తుంటాడు కాబోలు." "వీడికి బుద్ధి చెప్పాలి" అనుకుంటారిద్దరూ. అంటే తాము వాణ్ణి తమ వలలోకి లాగాలి.

మిసెస్ ఫోర్డ్‌కు యిది కాస్త ప్రమాదమే. ఆమె భర్త అసూయాపరుడు. పైగా ఫాల్స్టాఫ్

అనుచరుడొకడు ఫోర్డ్‌కు చెబుతాడు, "మా యజమాని నీ భార్యను ప్రేమిస్తున్నాడు." ఫోర్డ్ ఆ మాటలు నమ్ముతాడు. పేజ్ మాత్రం ఇవన్నీ గాలి కబుర్లని కొట్టి పారేస్తాడు. వాళ్ల నిజాయితీ పట్ల అతడికి గాఢమైన నమ్మకముంది. డాక్టరుకూ ప్రీస్టుకూ జరిగే కత్తి యుద్ధం కోసం ఆసక్తిగా ఎదురు చూస్తాడు.

ఇద్దరు భార్యలు, మిసెస్ క్విక్లీ ద్వారా ఫాల్స్టాఫ్‌కు తమ జవాబులు పంపిస్తారు. మిసెస్ పేజ్ యిప్పట్లో కలయిక వీలుపడదంటుంది. మిసెస్ ఫోర్డ్ ఉదయం పది - పదకొండు మధ్య భర్త లేనప్పుడు రమ్మంటుంది.

మిసెస్ ఫోర్డ్ ప్రేమికుణ్ణంటూ ఒక వ్యక్తి ఫాల్స్టాఫ్ వద్దకు వస్తాడు. అతడు మారు వేషంలో ఉన్న ఫోర్డ్. "మీరామెను ఎలా వశపరచుకున్నారో చెబితే మీక్కావలసినంత డబ్బిస్తా"నంటాడు. తను చేసిన ఘన కార్యం వివరించి "పదీ పదకొండు మధ్య ఆమెను కలుస్తాను. అప్పుడు ఆ వెధవ ఇంట్లో ఉండడు" అంటూ గర్వంగా మీసం మెలేసుకుంటాడు. ఫోర్డ్ అది నిజమేనని నమ్ముతాడు. ఫాల్స్టాఫ్‌లాగ అతడూ మూర్ఖుడు. ఎన్నాళ్లు కాపురం చేసినా భార్య మంచితనం గుర్తించలేదు.

మరోపక్క కత్తి ఝుళిపిస్తూ నాట్యం చేస్తున్నాడు డాక్టర్. కాస్త దూరంగా ప్రీస్టుకూడా యుద్ధానికి రెడీ అవుతున్నాడు. గార్టర్ ఇన్ యజమాని కావాలనే ఇద్దరినీ వేర్వేరు ప్రదేశాల్లో



ఉండమని చెప్పాడు. నిరీక్షించి, విసిగి వేసారిన శత్రువులు చివరికి కలిసి ఇన్ యజమాని మీది కోపంతో మిత్రులవుతారు.

ఉదయం పది. ఫాల్స్టాఫ్ మిసెస్ ఫోర్డ్‌ను కలవాల్సిన సమయం. కలిసి వేసుకున్న ప్లాను ప్రకారం, మిసెస్ పేజ్ కూడా అక్కడికే ప్రయాణమవుతుంది. దారిలో ఫోర్డ్ కలుస్తాడు. వీళ్లిద్దరూ ఎందుకింత గాఢ స్నేహితులో అర్థం కాదతడికి. "మీ భర్తలు చచ్చిపోతే మీరిద్దరు పెళ్ళి చేసుకుంటారు కాబోలు." అయితే పేజ్‌కు వాళ్ల పట్ల ఉన్న నమ్మకం అతడికి నిజంగా కోపం తెప్పిస్తుంది. ఫాల్స్టాఫ్ వెళ్లే సమయానికే తనూ ఇంటికి వెళ్లాలి. భార్యను రెడ్‌హాండెడ్‌గా పట్టుకోవటానికి మిత్రులను కూడా ఆహ్వానిస్తాడు.

ఈలోగా మిసెస్ ఫోర్డ్‌కూడా ఫాల్స్టాఫ్ రాకకోసం సన్నాహాలు ప్రారంభించింది. మురికి బట్టలుతకడానికి ఒక పెద్ద టబ్బు సిద్ధం చెయ్యమని పురమాయించింది పని మనుషులకు. అవి తీసుకెళ్ళి విండ్సర్ పార్క్‌కూ థేమ్స్‌నదికీ మధ్య ప్రదేశంలో ఉతకాలి. ఊరివాళ్లంతా అక్కడికే వస్తారు. వీలయితే బట్టలతోపాటు ఫాల్స్టాఫ్‌ను కూడా ఉతికి ఆరెయ్యొచ్చు.

ఫాల్స్టాఫ్ వచ్చి తన ప్రియురాల్ని ఆలింగనం చేసుకోబోతాడు. అప్పుడే మిసెస్ పేజ్ తలుపుతడుతుంది. మిసెస్ ఫోర్డ్ భయం నటించి ఫాల్స్టాఫ్‌ను ఎక్కడైనా నక్కమని అర్థిస్తుంది. ఫోర్డ్ తన మిత్ర బృందంతో ఇంటికి వస్తున్నాడని చెబుతుంది మిసెస్ పేజ్. ఆమె గుసగుసగానే మాట్లాడుతుందిగాని ఫాల్స్టాఫ్ వినగలగాలి. అతడు క్షేమంగా బయటకు వెళ్లాలంటే బట్టల టబ్‌లో దాక్కోవటమొక్కటే మార్గం. కాని భారీ శరీరం. అతి కష్టం మీద టబ్‌లో ముడుచుకుని పడుకుంటాడు. అతణ్ణి థేమ్స్‌లో పారెయ్యటానికి తీసుకెడతారు పనిమనుషులు.

ఫోర్డ్ ప్రవేశం. ఫాల్స్టాఫ్ ఇంట్లోనే ఎక్కడో ఉన్నాడని గట్టి నమ్మకం. మిత్రులని ఇల్లంతా గాలించమంటాడు. "అటు ఫాల్స్టాఫ్, ఇటు నా భర్త — ఎవరు భ్రమపడ్డారని సంతోషించను!" అంటుంది మిసెస్ ఫోర్డ్ నవ్వుతూ.

మరోపక్క తండ్రికి తమ పెళ్లి ఇష్టం లేదని ఫెంటన్‌కు చెబుతుంది ఆన్. స్లెండర్‌ను ఆమె తప్పక చేసుకుంటుందని ప్రీస్ట్ నమ్మకం. మిసెస్ క్విక్లీ ముగ్గురికీ (స్లెండర్, పెంటన్, డాక్టర్) ఆన్ తమనే చేసుకుంటుందని నమ్మకం కలిగించింది.

నదిలో పడిన తర్వాత కూడా ఫాల్స్టాఫ్‌కు బుద్ధి రాదు. మరోసారి ప్రయత్నించాలనుకుంటాడు. ఈసారి ఎనిమిది–తొమ్మిది మధ్యన వెళ్లాలి. మారు వేషంలో ఉన్న ఫోర్డ్‌కు మళ్లీ తన ప్లాను చెబుతాడు ఫాల్స్టాఫ్. పిల్లాణ్ణి స్కూల్లో దిగబెట్టి వచ్చిన మిసెస్ పేజ్, ఫోర్డ్ కోపంగా ఇంటికి వస్తున్నాడని స్నేహితురాలికి చెబుతుంది. ఈసారి మిసెస్ ఫోర్డ్ ఫాల్స్టాఫ్‌ను "నా పని మనిషి మేనత్త. లావుపాటి మనిషి బ్రెయిన్ ఫోర్డ్‌నుంచి వచ్చింది" అంటూ పరిచయం చేస్తుంది. ఫోర్డ్‌కు కోపం వస్తుంది. బడిత పూజ చేసి

ఇంట్లోంచి గెంటేస్తాడు. ఫాల్స్టాఫ్ ఒళ్లు హూనమైంది. అయినా ఆశ చావలేదు.

బట్టల టబ్‌లో తన శత్రువుకోసం వెదుకుతాడు ఫోర్డ్. "సిగ్గులేదూ, బట్టల్లో ఎవరున్నారని చూస్తున్నావు?" అని చీవాట్లేస్తుంది భార్య. కాని భర్త పరిస్థితిని చూసి జాలిపడి జరిగిందంతా చెబుతుంది. ఫోర్డ్ క్షమించమంటాడు. కాని పేజ్‌కు మాత్రం ఆ బొండాంగాడికి మరోసారి బుద్ధి చెప్పాలనిపిస్తుంది. ఫాల్స్టాఫ్‌ని అర్ధరాత్రి విండ్సర్ పార్క్‌కు రమ్మంటారు.

షేక్స్‌పియర్ కాలంలో విండ్సర్ పార్క్‌లో ఫుట్ పాత్ దగ్గర ఒక పెద్ద ఓక్ చెట్టుండేది. దానిమీద హెర్న్ అనే పార్కు కాపరి దయ్యముండేదని అందరి నమ్మకం. ఫాల్స్టాఫ్‌ను హెర్న్ వేషం వేసుకుని రమ్మంటారు. (అలావస్తే క్షేమం. ఎవరూ గుర్తు పట్టరు.) చెట్టు సమీపంలో ఒక పెద్ద గుంత ఉంది. అక్కడ అందరూ దాగవచ్చు. అర్ధరాత్రి అంటే దయ్యాలు సంచరించే సమయం గనక పేజ్ సంతానం, యితర పిల్లలూ దయ్యాల్లాగే వేషాలు వేసుకుని వస్తారు. వాళ్లనుచూసి ఫాల్స్టాఫ్ జడుసుకుని చావాలి.

ఆన్ పేజ్, ఆ మూకకు రాణి. ఆమె స్లెండర్‌ని చేసుకోవాలని తండ్రీ, ఫ్రెంచి డాక్టర్‌ని పెండ్లాడాలని తల్లీ కోరుకుంటారు. ఆమెను తీసుకుని వెళ్ళి చర్చిలో వివాహం చేసుకోవాలనుకుంటాడు ఫెంటన్. ఆన్ తెల్ల డ్రెస్ వేసుకుంటుందని స్లెండర్‌కు చెబుతాడు తండ్రి. ఆన్ ఆకుపచ్చ డ్రెస్ వేసుకుంటుందని డాక్టరుకు చెబుతుంది తల్లి. అందువల్ల ఒక కుర్రాడికి తెల్ల డ్రెస్సూ, మరొకడికి ఆకుపచ్చ డ్రెస్సు తొడుగుతాడు ఫెంటన్. అందరూ ముసుగులు తొడుక్కున్నారు గనక ముఖం చూసి పోల్చుకోవటం వీలుపడదు.

అర్ధరాత్రికి ఫాల్స్టాఫ్ చెట్టు దగ్గరకొస్తాడు. తన ప్రియురాళ్ళ కోసం చేతులు చాచిన క్షణాన పిల్లలందరూ ఒక్కసారిగా మీదపడి రక్కుతారు.

ఇదే అతడికి శిక్ష. ఇక్కడితో ముగించటం మంచిదంటుంది మిసెస్ పేజ్. ఫాల్స్టాఫ్ తన మూర్ఖత్వానికి పశ్చాత్తాపపడతాడు. ఆన్, ఫెంటన్‌లు పెళ్లి చేసుకున్నారని తెలిసి తల్లిదండ్రులు సంతోషిస్తారు. అల్లుణ్ణీ, ఫాల్స్టాఫ్‌నూ సాదరంగా ఇంటికి ఆహ్వానిస్తుంది మిసెస్ పేజ్.



# 8. యాజ్ యూ లైకిట్

గ్రామీణ నేపథ్యంలో జరిగిన కథ ఇది. నగరాలకన్నా పల్లెలే స్వర్గతుల్యమని చెప్పే సంప్రదాయమొకటుంది. అయితే అటువంటి కథల్లోని గ్రామసీమలు కేవలం ఊహాజనితం. వాస్తవానికి అంత సుఖమేమీ ఉండదక్కడ. కపటమెరుగని పల్లెవాసులు, ప్రకృతి కన్యల్లాంటి పడతులు వగైరా కవిగారి కల్పన మాత్రమే.

వాతావరణం ఏదైనా షేక్స్పియర్ తను చెప్పదలుచుకున్న కథలో మాత్రం మార్పులు చెయ్యడు. ఆర్డెన్ అరణ్యంలో తాటిచెట్లూ, సింహాలూ ఉన్నాయన్నాడు. లోపాలెన్ని ఉన్నా ఆయన కవితా మహిమతో అవన్నీ మరుగున పడతాయిగదా! ఇది సంగీత ప్రధానమైన నాటకం. మాటలకన్న పాటలే ఎక్కువ.

ఆర్లాండో యువకుడు. నలుగుర్లో మంచి పేరుంది. అన్నకు తనంటే పడదు. అసూయ. చంపటానికి కుట్రచేస్తున్నాడని తెలిసింది. ఒక పహిల్వానుకు డబ్బులిచ్చి తన మెడ విరిచేయమని చెప్పాడట.

రాజ భవనంలో కూడా పరిస్థితి ఇంచుమించు ఇలాగే ఉంది. అక్కడ తమ్ముడు అన్నను రాజ్య భ్రష్టుణ్ణి చేశాడు. అన్న ఆర్డెన్ అరణ్యంలో తలదాచుకున్నాడు. ఆర్లాండో

లాగే అతడికీ ప్రజామోదం ఉంది. కూతురు రోసాలిండ్ మాత్రం ఇంకా అంతఃపురంలోనే ఉంది. తమ్ముడి కూతురు సీలియా ఆమెను గాఢంగా ప్రేమిస్తుంది. ఒక్క క్షణమైనా విడిచి ఉండలేదు.

రాజ ప్రాసాదం ముందరి ప్రాంగణం. విదూషకుడు సీలియా, రోసాలిండ్‌లను జోకులతో నవ్విస్తున్నాడు. మల్ల యుద్ధం అక్కడే జరగబోతున్నది. ఆ యోధునితో పోటీకి ఒక అందమైన యువకుడు వస్తున్నాడు. అది సమయుద్ధం కాదు. పోటీ నివారించటానికి ప్రయత్నిస్తారు. రోసాలిండ్ యువకుడితో ప్రేమలో పడింది. ఆర్లాండో యుద్ధానికి సిద్ధమంటాడు. అతడికీ రోసాలిండ్ అంటే ప్రేమ. ఈ అమ్మాయికి కూడా ప్రజల మద్దతున్నదని రాజుగారికి తెలుసు. అందువల్ల ఆమెనూ రాజ్యంనుండి బహిష్కరించాలనుకుంటాడు. కానీ సీలియా అడ్డుపడుతుంది.

ఇద్దరు యువతులూ ఆర్డెన్ అడవికి పోవాలనుకుంటారు. రోసాలిండ్ పొడగరి. అందువల్ల ఆమె యువకుడి వేషం వేసుకుని, సీలియా చెల్లెలిగానూ వారి ప్రయాణమవుతారు. అయితే వెళ్లాలంటే ధైర్యం చాలదు. విదూషకుణ్ణి వెంట రమ్మంటారు— విదూషకుడి పేరు టచ్‌స్టోన్.



రాజ్య బహిష్కరణకు గురైన అన్న, రాజ భవనంలోని కృత్రిమ జీవితంకన్న, ప్రకృతిలో భాగంగా గడిపే ఈ వనవాసమే మేలు అనుకుంటాడు. ("స్వీట్ ఆర్ ద యూజెస్ ఆఫ్ అడ్వర్సిటీ" అనబడే పద్య చరణం ఇక్కడే వస్తుంది.)

పాత్రలందరూ అడవికి చేరుకోవటానికి ప్రయత్నిస్తుంటారు. పారిపోయిన అక్కాచెల్లెళ్ళను వెదకడానికి మనుషులను పంపుతాడు రాజు. అన్న చేస్తున్న హత్యా ప్రయత్నం నుండి తప్పించుకోవటానికి, ఒక నమ్మిన బంటుతో అడవికి చేరుతాడు ఆర్లాండో. వెంట నగలు తెచ్చుకున్నారు గనక, రాకుమార్తెలు ఉండటానికి వేటగాళ్ల కాటేజ్ కొనుక్కుంటారు. చుట్టూ ఆలివ్ చెట్లూ, గొర్రెలు. తోచిన చోటల్లా తిరగటం

తప్పు చెయ్యగలిగిందేమీ లేదు. రోసాలిండ్ ప్రేమతత్వాన్ని గురించి లెక్చర్లిస్తుంది.

పిల్లలను వెదుకుతూ జాక్వెస్ అనే అనుచరుడితో రాజు కూడా అడవికి చేరుకున్నాడు. జాక్వెస్‌కు లోకమంతా విషాదమయంగా కనిపిస్తుంది. టచ్‌స్టోన్ తారసపడతాడు. జాక్వెస్ ప్రకారం "మూర్ఖులే నిజంగా తెలివైనవాళ్ళు." అవును మరి తెలివైనవాళ్ళు ఇంత మూర్ఖ ప్రపంచంలో ఎలా బ్రతకగలరు? మనుషుల్లో ఒకడిగా గాక, మరో జీవి మానవ జాతి గురించి వ్యాఖ్యానించినట్టుగా ఉంటాయి అతడి భావాలు. "ఆల్ ద- వరల్డ్ ఈజ్ ఎ స్టేజ్...." అనేది అతడి డైలాగే.

జాక్వెస్ తాత్వికోపన్యాసాలు వింటూ విందారగిస్తుంటాడు రాజు. కత్తి ఝళిపిస్తూ పరిగెత్తుకొస్తాడు ఆర్లాండో. అతడి అనుచరుడు ఆకలికి మాడుతున్నాడు. యుద్ధంచేసయినా సరే, భోజనం సంపాదించాలి.  మరణించిన తన తండ్రికి రాజుగారు మిత్రుడని తెలుస్తుంది. అందరూ విందు వినోదాల్లో మునుగుతారు.

ఆర్లాండో మనసు అలజడిగా ఉంటుంది. ఒక్కసారే చూసాడుగానీ రోసాలిండ్‌ను మరవలేదు. ప్రతి చెట్టుకు ఒక ప్రేమ సందేశం కడుతూ తిరుగుతాడు. చెట్ల బెరడుమీద తన ప్రియురాలి పేరు చెక్కుతాడు. (ఇది ఆదిమ కాలంనుండి ఉన్న అలవాటు.) తన పేరూ, సీలియా పేరూ ప్రతి చెట్టు మీదా ఉందని రోసాలిండ్‌ను ఏడిపిస్తాడు టచ్‌స్టోన్. అయితే ఈ అదృశ్య ప్రేమికుడెవరో సీలియాకు తెలుసు. మరి కాసేపటికే ఆర్లాండో దర్శనమిస్తాడు."అతడి స్నేహాన్ని ఇద్దరం ఆనందిద్దాం" అంటుంది రోసాలిండ్.

జాక్వెస్ విషాద దృక్పథానికి ప్రేమ వ్యవహారాలు సరిపడవు. ప్రేమగీతాలతో చెట్లు పాడైపోతున్నాయంటాడు. అతడికి రోసాలిండ్ పేరు కూడా నచ్చదు. "ఆమెకా పేరు పెట్టినప్పుడు నీ ఆమోదం కావాలనుకోలేదెవ్వరూ" అంటూ నచ్చజెప్తాడు ఆర్లాండో. "లోకంలో మూర్ఖత్వం ఉంది. అన్ని మూర్ఖత్వాలకూ పరాకాష్ఠ ప్రేమ" అన్నది జాక్వెస్ తాత్వికత.

జాక్వెస్ నిష్క్రమిస్తాడు. పురుష వేషం బాగానే వుందనుకొంటుంది రోసాలిండ్. "ప్రేమలో పడవద్దని పెద్దలు నాకు బోధించారు" అంటుంది ఆర్లాండోతో. "ప్రేమ జబ్బు తగ్గడానికి మందిస్తాను. స్త్రీలు ఎలా మోసం చేస్తారో నాకు బాగా తెలుసు. ఆలీవ్ చెట్ల మధ్య ఉన్న కాటేజీకి వస్తే 'ప్రేమలో పడకుండా ఉండడమెలా?' అని పాఠాలు చెబుతాను" అని కూడా సలహా ఇస్తుంది.

మరో వైపు టచ్‌స్టోన్‌కు కూడా ప్రేమ జబ్బు పట్టుకుంది. ఆడ్రీ అనే అమ్మాయి అతడి మనసు దోచుకుంది. కానీ ఆడ్రీ ఇది పట్టించుకోదు. "పాపం, కుర్రాడికేం తక్కువ" అని మందలిస్తుంది రోసాలిండ్. ఆడ్రీ వెంటనే (పురుష వేషంలో ఉన్న) రోసాలిండ్‌ను ఇష్టపడుతుంది.

కాటేజ్‌కు గంట ఆలస్యంగా వస్తాడు ఆర్లాండో. "ఎక్కడికెళ్లావు? ఎందుకింత ఆలస్యం?

ఇంత శ్రద్ధ లేనివాడివి రావొద్దు" అంటూ టీచర్‌లాగే కోప్పడుతుంది రోసాలిండ్. మరుక్షణం శిష్యుడిని క్షమించి పాఠం ప్రారంభిస్తుంది. తన ప్రేమను నిరాకరిస్తూ పాఠాలు చెప్పిన పద్ధతిలో రోసాలిండ్ పాత్ర బాగా రాణిస్తుంది. "ప్రేమించకపోతే మరణమే శరణ్యం" అంటాడు ఆర్లాండో. "ఈ ప్రపంచం వయసు ఆరువేల సంవత్సరాలు. ప్రేమ కోసం ఎవరూ చచ్చిపోయినట్టుగా ఇంతవరకూ వినలేదు. మనుషులు మరణించి కీటకాలకు ఆహారంకాక తప్పదు. కాని చావుకు కారణం ప్రేమ మాత్రం కాదు" అంటూ బోధిస్తుంది రోసాలిండ్. ప్రేమరాహిత్య పాఠం చాలాసేపు కొనసాగుతుంది. భోజనానికి వెళ్లి వస్తానంటాడు ఆర్లాండో.

"రెండింటికి రావాలి."

ఆర్లాండో నిష్క్రమించగానే ఆమెలో విరహం పెరుగుతుంది. ప్రియుడితో సమాగమం కోసం మనసు తల్లడిల్లుతుంది. రెండవుతుంది. ఆర్లాండో జాడ లేదు. గొర్రెల కాపరి ఒకడు ప్రేమలేఖ తీసుకుని వస్తాడు. తనను పురుషుడని నమ్మి ఆడ్రీ రాసిన ఉత్తరం. ఆర్లాండో తమ్ముడు వచ్చి మరో దుర్వార్త చెబుతాడు. సింహం నుండి తనను రక్షించబోతూ అతడు గాయపడ్డాడని. పురుష వేషాన్ని ఇక ధరించలేదు రోసాలిండ్. అంతలోనే తేరుకుని "నేను చెప్పిన పాఠాలు నిజం కాదు. అదో జోక్. ఈ విషయం మీ అన్నయ్యకు చెప్పండి" అంటుంది.

చేతికి కట్టు కట్టుకుంటాడు ఆర్లాండో. తమ్ముడు సీలియాతో ప్రేమలో పడ్డాడని తెలుస్తుంది. మరుసటి రోజే పెళ్లి జరగాలట. ఆర్లాండోకు కూడా అదే మంచి ముహూర్తం అనుకుంటుంది రోసాలిండ్. ఒక మాంత్రికుడు తనకు మనుషులను ప్రత్యక్షంచేసే విద్య నేర్పించాడనీ, కావాలంటే రోసాలిండ్‌ను రప్పిస్తానని ఆర్లాండోకు చెబుతుంది. టచ్‌స్టోన్, ఆడ్రీలు కూడా ఒకరినొకరు ఇష్టపడతారు.

పెళ్ళిరోజు వివాహ దేవత హైమన్‌ను ప్రార్థిస్తుంది రోసాలిండ్. నాలుగు జంటల పెళ్లి ఒకేసారి జరుగుతుంది.

ఆర్లాండో సోదరుడొకడు మంచి వార్త వినిపిస్తాడు. ఒక రుషి రాజ్యం అపహరించిన రాజు మనసు మార్చేశాడు. అన్నకు రాజ్యమిచ్చి తను వనవాసం వెళ్లటానికి సిద్ధపడతాడు రాజు. అతడి వెంట వెళతానంటాడు జాక్వెస్. రాజ పట్టాభిషేకం జరుగుతుంది. ఆర్డెన్ అరణ్యంలో మళ్లీ విందూ, వినోదం.

# 9. మచ్ అడో ఎబౌట్ నథింగ్



ప్రేమా, పెళ్ళి ఇతివృత్తంగా సాగిన మరో నాటకమిది. సిసిలీలోని మెసీనా నగరంలో జరుగుతుంది కథ.

అక్కడి గవర్నర్ అరగాన్ రాకుమారుడి ఆగమనం కోసం సన్నాహాలు చేస్తుంటాడు. యుద్ధాలనుండి విజేతగా తిరిగి వస్తున్నాడు రాకుమారుడు. ఇద్దరు యువకులు క్లాడియో, బెనెడిక్‌లు అతని అంతరంగికులు. మెసీనాలో బెనెడిక్ గురించి అందరికీ తెలుసు. అతడు, గవర్నర్ మేనకోడలు బీట్రిస్ అస్తమానం పోట్లాడుకుంటారు. ఇది చూసి గవర్నర్ ముసి ముసి నవ్వులు నవ్వుకుంటాడు.

బీట్రిస్‌కు పురుష జాతి అంటేనే చులకన. అందువల్ల బెనెడిక్‌ను ఎంతైనా ఏడిపించ వచ్చు. కాని బెనెడిక్ చురుకైన కుర్రాడు. మాటకు మాట జవాబిస్తునే ఉంటాడు. యుద్ధానికి బయల్దేరినప్పుడు బీట్రిస్ ఒక ఛాలెంజి చేసింది. "నువ్వెవర్నయినా చంప గలిగితే వాణ్ణి నేను భోంచేస్తాను."

ఇద్దరు సైనికులు ప్రవేశిస్తారు. గవర్నర్ వాళ్లనాహ్వానిస్తాడు. బెనెడిక్ నోరు విప్పాడో లేదో బీట్రిస్ అద్భుతగులుతుంది. "ఎందుకు మాట్లాడతావు? నిన్ను వినేవాళ్లెవరూ లేరిక్కడ." బెనెడిక్ కూడా తక్కువ తినలేదు. గవర్నర్ అందరినీ ఒక నెల రోజులపాటు తన అతిథులుగా ఉండమని అర్థిస్తాడు.

క్లాడియో గవర్నర్ కూతురు(హెరో)తో ప్రేమలో పడతాడు. బెనెడిక్‌కు తన మిత్రుడి సెలక్షన్ నచ్చదు. బీట్రిస్‌లాంటి అందమైన అమ్మాయి ఉండగా హెరోనెందుకు ఎంచుకోవటం? ప్రేమ ఫర్వాలేదుగానీ పెళ్లి మాత్రం మగవాడి జీవితాన్ని నరకం చేస్తుంది. తను మాత్రం పెళ్లి చేసుకోడుగాక చేసుకోడు. ఒక స్త్రీ తనను కన్నది, పెంచింది. అందుకు తల్లికి కృతజ్ఞతలు. కాని స్త్రీతో సంబంధం అక్కడితో ముగుసింది.

క్లాడియో మాత్రం హెరోని పెళ్లాడటానికే నిశ్చయించుకుంటాడు. అరగాన్ రాకుమారుడు ఈ విషయంలో క్లాడియోకు సహాయం చేస్తానంటాడు. ఆ రాత్రి నాట్యానికి అందరూ ముసుగులు ధరించి రావాలి. తను క్లాడియో పేరుతో హెరోను కలిసి పెళ్లికి ఆమె తండ్రి అనుమతి సంపాదిస్తాడు.

రాకుమారుడికో తమ్ముడున్నాడు. పేరు డాన్ జాన్. దుష్టబుద్ధి. సంతోషంగా ఉండడు. చూసి ఓర్వలేడు. అన్న వేస్తున్న ప్లాను తెలిసి ఎలాగైనా దానికి అడ్డుపడాలనుకుంటాడు.

క్లాడియోతో తన కూతురి వివాహానికి గవర్నర్ అంగీకరిస్తాడు. మేనకోడలికి కూడా సంబంధం కుదిరితే బాగుంటుందని కోరిక. బీట్రిస్, బెనెడిక్‌లు ఎంత పోట్లాడుకున్నా పెళ్లి విషయంలో మాత్రం ఇద్దరిదీ ఒకే అభిప్రాయం. ఆమెది నిఖార్సయిన పురుష ద్వేషం.

రాత్రికి అతిథులందరూ గవర్నర్ బంగ్లాకు చేరుకుంటారు. నాట్యం ప్రారంభమవుతుంది. ఒక్కొక్క స్త్రీ ఒక్కొక్క ముసుగు పురుషునితో కలసి పోతుంది. (ముసుగులో ఉన్న) బెనెడిక్ బీట్రిస్‌ను ఏడిపించాలని ఆ పిల్లకు స్వంత తెలివితేటలు లేవనీ, అంతా పుస్తక జ్ఞానమనీ అంటాడు. బీట్రిస్ ఊరుకుంటుందా! బెనెడిక్ గురించి తన అభిప్రాయాన్ని కుండ బద్దలుకొట్టినట్టు చెబుతుంది. "అతడు ఒట్టి బఫూన్."

రాకుమారుడు స్వయంగా హెరో గురించి వల పన్నుతున్నాడని క్లాడియోను నమ్మిస్తాడు డాన్ జాన్. క్లాడియో అమాయకుడు. ఎవరేం చెప్పినా నమ్ముతాడు. బెనెడిక్ తన హాస్యోక్తులతో అతణ్ణి ఉత్సాహపరచగలిగేవాడేగాని, బీట్రిస్ ఘాటైన విమర్శ లోతుగా గుచ్చుకుంది.

రాకుమారుడు వచ్చి పెళ్లికి ఇష్టపడిన హెరోను క్లాడియోకు పరిచయం చేస్తాడు. అతడి మొహం విచ్చుకుంటుంది. హెరో పెళ్లి నిశ్చయమైనందుకు బీట్రిస్ సంతోషిస్తుంది. రాకుమారుడు ఆమె ప్రేమను అర్థిస్తాడు. బీట్రిస్ సున్నితంగా తిరస్కరిస్తుంది. కనీసం బెనెడిక్‌నన్నా ఇష్టపడుతుందేమోనని ఆశిస్తాడు రాకుమారుడు. వీళ్లిద్దరికీ పెళ్లి జరగాలని అందరి కోరిక. రాకుమారుడు అందుకో ప్లాను చెబుతానంటాడు.

అయితే ఒక దుర్మార్గమైన ప్లాటు డాన్ జాన్ కూడా తయారు చేస్తున్నాడు. హెరో శీలవతి కాదని క్లాడియోను నమ్మించాలి. హెరో పనిమనిషి ఒకావిడ ఆమె బెడ్‌రూం బయట నిల్చున్నప్పుడు డాన్ జాన్ సేవకుడు ఆ పనిమనిషితో ప్రేమాయణం నటిస్తాడు. క్లాడియోను నమ్మించటానికి ఇంతకన్నా మంచి రుజువేం కావాలి!

బీట్రిస్, బెనెడిక్‌ల శ్రేయోభిలాషులు మొదట అతణ్ణి ఒప్పించటానికి ప్రయత్నిస్తారు. బెనెడిక్ ఒక తోటలో పచారు చేస్తూ ప్రేమ మూర్ఖత్వాన్ని గురించి ఆలోచిస్తున్నాడు. గవర్నర్, రాకుమారుడు, క్లాడియో ప్రవేశిస్తారు. బెనెడిక్ ఒక చెట్టు వెనుక నక్కుతాడు.

బీట్రిస్ అతణ్ణి గాఢంగా ప్రేమిస్తున్నదంటూ చెప్పుకుంటున్నారు వాళ్లు. "ఆమె రాత్రంతా

అతని ధ్యానంలోనే గడుపుతుంది. ఉత్తరాలు రాస్తుంది. చించేస్తుంది. మళ్లీ రాస్తుంది." అని వాళ్లలో వాళ్లు బెనెడిక్ వినేలా చెప్పుకుంటారు.

బెనెడిక్‌కు కూడా బీట్రిస్‌మీద ప్రేమ పొంగుతుంది. ఎందుకీ అనవసర బ్రహ్మచర్యం? మనుషులు అభిప్రాయాలు మార్చుకున్నపుడు సాకులు వెదుక్కుంటారు. "ఆడా మగా పెళ్లి చేసుకోకపోతే లోకమెలా కొనసాగుతుంది?" •

బీట్రిస్‌మీద కూడా మిత్రులు ఇదే ప్రయోగం చేస్తారు...

తన గురించి జనం మాట్లాడుకుంటున్నారని సందేశం పంపుతుంది హెరో...

బీట్రిస్ ఒక పూపొద వెనక నక్కి బెనెడిక్ ప్రేమకలాపాలు వింటుంది. అయితే ఆమెతో చెప్పాలంటే భయం – పుల్ల విరుపుగా మాట్లాడి అవమానిస్తుందని. బెనెడిక్‌లాగ బీట్రిస్‌కూడా ప్రేమలో కరిగిపోతుంది. తిరిగి ప్రేమించటమే ఎదటి వ్యక్తి ప్రేమకు నిజమైన కానుక.

క్లాడియోకు మాత్రం చిక్కులు తప్పవు. హెరో కిటికీ దగ్గర నిలబడి చూడమని సలహా ఇస్తాడు డాన్ జాన్. క్లాడియోను నమ్మించవలసిన అవసరం కూడా లేదు. అతడు ఎవరేం చెప్పినా నమ్ముతాడు. హెరో మీద అప్పుడే అనుమానం మొదలైంది.

తెల్లారితే గవర్నర్ ఇంట్లో పెళ్లి వేడుక. జనం బాగా వస్తారు. డాగ్‌బెరీ, వెర్జెస్ అనబడే ఇద్దరు కానిస్టేబుల్సు ట్రాఫిక్ నియంత్రణ కోసం వచ్చారు. వెర్జెస్ బాగా వృద్ధుడు. అందువలన పని భారమంతా డాగ్ బెరీ పైన పడింది. డ్యూటీని చాలా సీరియస్‌గా తీసుకుంటాడు డాగ్ బెరీ – అది ఇంగ్లీషువాళ్ల ప్రత్యేకత. అంతా చట్టబద్ధంగా, రూల్స్ ప్రకారమే జరగాలి. అతడు అమలు పరిస్తే అవి మరింత కఠినంగా కనిపిస్తాయి. అక్కడ కాపలా ఉన్న వాచ్‌మెన్‌కు లేనిపోని నిబంధనలన్నీ చెప్పి అదరగొడతాడు.

కానిస్టేబుల్‌గారి ఆజ్ఞ ప్రకారం రాత్రి రెండింటిదాకా చర్చి బెంచి మీద కూర్చుని ఆ తర్వాతే నిద్రపోవాలి. వాచ్‌మెన్ ధ్యాన ముద్రలో కూర్చున్నప్పుడు జాన్ డాన్ సేవకులు తమ కుట్ర గురించి మాట్లాడుకోవడం చెవిన పడుతుంది. వెంటనే వాళ్లను అరెస్టుచేసి డాగ్ బెరీకి కబురుపెడతాడు.

హెరో పెళ్లికి ముస్తాబవుతున్నది. అరెస్టు విషయం నివేదించటానికి వెర్జెస్, డాగ్ బెరీలు గవర్నర్ ఇంటికొస్తారు. ఖైదీలను చూసే తీరిక లేదాయనకు. వాళ్లను ప్రశ్నించి విషయం రాబట్టమని కానిస్టేబుల్స్‌ని ఆదేశిస్తాడు. ఇది గురుతర బాధ్యత. రూల్స్ ప్రకారం జైల్లోనే వాళ్లను ప్రశ్నించాలి.

చర్చిలో వివాహ సంరంభం ప్రారంభమవుతుంది. అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తుతూ క్లాడియో తన అయిష్టత వ్యక్తం చేస్తాడు. వధువు కిటికీ దగ్గర చూసిన విషయం చెబుతాడు. రాకుమారుడు కూడా దీనికి సాక్షి. ఆమె హెరో పరిచారిక కాదు, హెరోనే అని నమ్ముతారు ప్రత్యక్ష సాక్షులు. చివరికి ఆమె తండ్రికూడా ఈ కథనం విశ్వసిస్తాడు.

పెళ్లి ఆగిపోతుంది.

వివాహం చేస్తున్న ప్రీస్టు, బెనెడిక్, బీట్రిస్‌లకు మాత్రమే హెరో అమాయకురాలని గట్టి నమ్మకం. కూతుర్ని దోషిగా ప్రకటించి గవర్నర్ తప్పు చేశాడనుకుంటారు. ఈ నింద వినగానే హెరో మూర్ఛ పోయింది.

ప్రీస్టు ఒక సలహా ఇస్తాడు. హెరో మరణించిందని చెబితే క్లాడియో బహుశా ఆమె అమాయకత్వాన్ని అంగీకరించవచ్చు.

బెనెడిక్ విరహంలో కాలిపోతున్నాడు. ప్రేయసిని విడిచి క్షణమైనా ఉండలేడు. "నన్ను సంతోషపెట్టాలంటే క్లాడియోను చంప"మంటుంది బీట్రిస్.

తన మిత్రుడితో కత్తి (ద్వంద్వ) యుద్ధానికి బెనెడిక్ సిద్ధంగా లేడు.

"నేను స్త్రీని. కాకపోతే నేనే చంపేదాన్ని" అంటుంది బీట్రిస్. "వాడిని సంహరించి, చీల్చి, అందరూ చూస్తుండగా వాడి గుండె కాయ తింటాను."

ఆమెను శాంతింపజేయడం అసాధ్యం. కోపంతో అరుస్తుంది. ఒక్కమాట కూడా అర్థం కాదు. చివరికి బెనెడిక్ అంగీకరిస్తాడు.

జైలు. సెల్‌లో డాగ్‌బెరీ ఖైదీలను ప్రశ్నిస్తున్నాడు. అతడు కాస్త అతిగా చేస్తున్నాడని మరో ఉద్యోగి అభిప్రాయం. మొత్తం మీద చివరికి ఖైదీలు నేరం ఒప్పుకుంటారు.

కూతురు అమాయకురాలని గవర్నర్‌కు తెలుస్తుంది. క్లాడియోను కత్తి యుద్ధంలో ఛాలెంజి చేస్తానంటాడు. ఆపదలో మిత్రుణ్ణి ఆశ్రయిస్తాడు క్లాడియో. కాని బెనెడిక్ కూడా కత్తి దూస్తాడు. కాన్‌స్టేబుల్స్ ప్రవేశిస్తారు. సంకెళ్లలో ఉన్న ఖైదీలు జరిగింది చెబుతారు. క్లాడియోకు తన పొరపాటు, తొందరపాటు తెలిసి వస్తుంది. కాని ఇప్పుడు చెయ్యగలిగిందేమీ లేదు. ఆమె దూర లోకాలకు వెళ్లి పోయింది.

హెరోలాంటి మరో అమ్మాయిని చేసుకోమంటాడు గవర్నర్.

తను కత్తి యుద్ధానికి సిద్ధమవుతున్నానని బీట్రిస్‌తో చెబుతాడు బెనెడిక్. కొత్తగా రాసిన ప్రేమ గీతాలు వినిపిస్తాడు. పోట్లాడు కోవటమే తప్ప 'మధుర ప్రేమ' అసాధ్యమని ఇద్దరూ నవ్వుకుంటారు.

నేరం ఒప్పుకున్నారు కనుక ఇప్పుడిక ద్వంద్వ యుద్ధం అవసరంలేదు.

చివరి సీను గవర్నరు బంగళాలో. క్లాడియో, హెరోల పెళ్లి. బెనెడిక్, బీట్రిస్‌లకు కూడా అదే సమయానికి వివాహం జరుగుతుంది. క్లాడియో ఆశ్చర్యానికి అంతులేదు. వధువు మరెవరో కాదు. తన హెరో! తాము కూడా జంట కాబోతున్నామని తెలుస్తుంది బెనెడిక్, బీట్రిస్‌లకు. పెళ్లివలన కలిగే లాభాలగురించి బెనెడిక్ గానంచేసి "ప్రిన్స్, మీరు కూడా ఒక వధువును చూసుకోండి త్వరగా" అంటూ సలహా ఇస్తాడు.



# 10. ట్వెల్త్ నైట్

ఇదొక అందమైన రొమాంటిక్ కామెడీ. అడ్రియాటిక్ సముద్ర తీరంలోని ఇలీరియాలో జరుగుతుంది కథ. నాటకం పేరే "ఉత్సవ రాత్రి" - క్రిస్మస్ శలవుల చివరి (పన్నెండవ) రోజు. వినోదాలకు క్లయిమాక్స్‌గా జరుపుకునే పండగ. నాటకంనిండా నవ్వులే. పరిహాసాలే. నవ్వును నిరసించిన ఒకే ఒక్క పాత్ర మాల్వోలియో. ప్రేక్షకులకు అతడే ఒక జోక్.

కథా స్థలం- డ్యూక్ ఆఫ్ ఇలీరియా రాజ మందిరం. అందరి మనసు దోచిన సుందరి ఆలీవియా తన సోదరుని మృతికి విలపిస్తున్నది. ఎవ్వరూ ఆమెను పలకరించకూడదు.

ఇలీరియా సముద్రతీరంలో తుఫాను వచ్చింది. నౌక మునిగి వయొలా అనే సుందరి ఒడ్డుకు కొట్టుకొస్తుంది. ఆమె కూడా తన సోదరుని మృతికి సంతాపంలో ఉంది. డ్యూక్ ప్రశస్తి విని అతని అనుచరుడిగా చేరాలనుకున్నది.

అలీవియాతో కలిసి వుంటున్న మరోవ్యక్తి ఆమె అంకుల్ సర్ టాబీ బెల్చ్. సరదా మనిషి. లావుగా ఉంటాడు. తన మేనకోడలి కోసం సర్ ఆండ్రూ అగూచీక్ అనే ఒక వరుణ్ణి చూసి పెట్టాడు. సర్ ఆండ్రూ కుంటివాడు. పెద్దగా తెలివితేటలు లేవు. కాని మంచివాడు. సర్ టాబీ అతడు కలిసి ఉదయం నుండి తాగుతున్నారు. ఇకనైనా ఆపమని చెప్పటానికి ఆలీవియా తన పనిమనిషి మారియాను పంపిస్తుంది. "అబ్బే, లాంఛనంగా ఒక చుక్క వేసుకున్నామంతే" అంటాడు సర్ టాబీ. నాట్యంలో తమకెంత ప్రవేశముందో చర్చించుకుంటారు ఇద్దరూ. సర్ అండ్రూకు స్వోత్కర్ష ఇష్టముండదు. కానీ ఇలీరియాలో అందరికన్నా బాగా నాట్యం చేయగలనని తెలుసు. అయితే అలీవియా తనను నిజంగా ఇష్టపడుతుందా అని ఒక సందేహం.

సర్ ఆండ్రూను ఒప్పించటానికి డ్యూక్ తన అనుచరుణ్ణి (పురుష వేషంలో ఉన్న వయొలా) పంపిస్తాడు. "ప్రయత్నిస్తాను" అంటుంది వయొలా. ఆమె ఇంకా డ్యూక్‌తో ప్రేమలో పడలేదు.

అలీవియా ఇల్లంతా చిందర వందరగా ఉంది. ఆమె విదూషకుడు (ఫెస్ట్) చెప్పకుండా శలవు పెట్టేసాడు. "యజమానురాలు నిన్ను చంపేస్తుంది, చూడు" అంటుంది మారియా. ఇష్టంలేని పెళ్లి కన్నా చావే మేలంటాడు ఫెస్ట్. అలీవియా మనసు వెన్న అని అతడికి తెలుసు.

ఆ ఇంటి మేనేజర్ మాల్వోలియో అహంకారి. సొంత డబ్బా కొట్టుకుంటాడు. ఫెస్ట్‌లాంటి విదూషకుడు ఇంట్లో ఉండటం అతడికి ఇష్టంలేదు. ఒకరు జోక్ వేయటమేమిటి మరొకరు నవ్వటమేమిటి. నాన్సెన్స్. ఇదీ అతని తత్వం.

అలీవియా అతన్ని చాలా సార్లు మందలిస్తుంది. "ఎందుకలా మూతి ముడుచుకుని కూర్చోవటం. ప్రపంచ బాధ్యతంతా నీ భుజాల మీదే ఉన్నట్టుగా ప్రవర్తిస్తావెందుకు? లోపల కల్మషం లేకుండా హాయిగా నవ్వగలిగితే చాలదా? హాస్యంతో ఎంతటి కష్టాలైనా కాగితప్పడవల్లా తేలిపోతాయి." కానీ మాల్వోలియో దేన్నీ తేలికగా తీసుకోలేడు. ఆత్మాభిమానం అడ్డొస్తుంది. ఎవరో ఒకరు తన అధికారాన్ని అంగీకరించి సలాము చేస్తే తప్ప తృప్తి కలగదు.

సర్ టాబీ తాగుతూ వస్తాడు. "తాగటం వల్ల కాదు, భోజనం బాగో లేక పోవటమే మూడ్ పాడు చేసింది." గేటువద్ద ఎవరో కుర్రవాడు నిరీక్షిస్తున్నాడని చెబుతాడు. వెళ్లి రెస్ట్ తీసుకోమని పంపిస్తుంది అలీవియా. కుర్రవాడు లోపలికి వచ్చేస్తాడు. మాల్వోలియో కూడా అతణ్ణాపలేదు. డ్యూక్ కోసం సందేశం తెచ్చానంటాడు. అతడే వయొలా.

ఇంట్లో అందరూ గంభీరమైన మొహాలతో దర్శనమిస్తారు. అలీవియా శోకంలో ఉంది. వయొలా డ్యూక్ గురించి దీర్ఘోపన్యాసమిస్తుంది. అది విని అలీవియా ముగ్ధురాలౌతుంది. చివరన, వచ్చిన డ్యూక్ అనుచరుడితో ప్రేమలో పడుతుంది. వయొలా నిష్క్రమించగానే, మాల్వోలియోకు తన ఉంగరమిచ్చి ఆ అనుచరుడికి తన ప్రేమ గురించి చెప్పమని పంపిస్తుంది.

సముద్రంలో మునిగి మరణించాడనుకున్న వయొలా సోదరుడు (సెబాస్టియన్), తనను రక్షించిన మనిషిని వెంట పెట్టుకుని తిరిగి వస్తాడు. అన్నా చెల్లెళ్ళిద్దరు కవలలు. అందువల్ల అతడు సరిగ్గా వయొలాలాగే ఉంటాడు.

అలీవియా ఇంట్లో– అర్ధ రాత్రి దాటింది. సర్ టాబీ మద్యంలో మునిగి తేలుతున్నాడు. అతడి కబుర్లతో, నవ్వులతో ఇల్లు మారుమోగుతున్నది. ఫెస్ట్, సర్ ఆంద్రూ అతణ్ణి మరింత ఎగదోస్తున్నారు. మొహం ముటముటలాడిస్తూ మాల్వోలియో ప్రవేశిస్తాడు. ఆ గోలలో అతడి మాటలు వినిపించవు. "పొరపాట్లెప్పుడూ ఇతర్లే చేస్తారు. తనెప్పుడూ సబబే" అన్నది మాల్వోలియో సిద్ధాంతం. "నువ్వు తాగటం లేదు గనక మేం కూడా తాగొద్దా" అని అడుగుతాడు సర్ టాబీ. తాగిన వాళ్లను చూసి కాస్త భయపడినా చివరికి మారియా కూడా వాళ్ళ పక్షం తీసుకుని మాల్వోలియోను చీవాట్లేసి పంపిస్తుంది.

అతడి అసలు రంగు తెలుసుకోడానికి మారియా ఒక ప్లాన్ వేస్తుంది. తన దస్తూరి అలీవియా దస్తూరిలాగే ఉంటుంది. అలీవియా పేరుతో మాల్వోలియోకు ఒక ప్రేమ లేఖ రాస్తుంది. మారియాకు తెలుసు. అతడు తప్పక నమ్ముతాడు. తనవంటి సకల సద్గుణ రాశిని ఆమె ప్రేమించటం సహజమే అని అనుకుంటాడు.

మరోవంక, డ్యూక్ ప్రేమ గీతాలు వింటూ వాటి అర్థం తన అనుచరుడికి (వయొలా) వివరిస్తుంటాడు. వయొలాకు ప్రేమగురించి అంతకన్నా ఎక్కువ తెలుసు. కాని ఆమెది నిశ్శబ్ద ప్రేమ.

రాసిన ఉత్తరాన్ని సీల్‌చేసి తోటకు వెళ్ళే దారిలో జారవిడుస్తుంది అలీవియా. సర్ టాబీ, సర్ ఆంద్రూ, మరో వ్యక్తి ఫేబియన్ చాటున దాగి ఇదంతా చూస్తారు. మాల్వోలియో కలలో తేలిపోతున్నాడు. అలీవియా తనకు భార్య అయిపోయినట్టుగానే ఊహించుకుంటున్నాడు. సర్ టాబీకి విసుగొచ్చింది. వాణ్ణి చెడామడా తిట్టాలనుకున్నాడు. కానీ అంతలోనే మాల్వోలియో వంగి ఆ ఉత్తరం తీసుకున్నాడు.

నేను నీకన్నా సంపన్నురాలిని. మాది గొప్ప వంశం. కానీ "సమ్ ఆర్ బార్న్ గ్రేట్, సమ్ అచీవ్ గ్రేట్‌నెస్ అండ్ సమ్ హేవ్ గ్రేట్‌నెస్ థ్రస్ట్ అపాన్ దెమ్" అంటూ ఒక చిన్న సలహా కూడా ఉంటుందందులో. "మీకు నవ్వటం ఇష్టముండదు. అయినా కనీసం నా ముందర నవ్వండి— నా సంతోషం కోసం."

తన పసుపు పచ్చ డ్రెస్సు చూసి ఎవరూ ఇష్టపడరు. కాని అతనికి ఆ సందేహం

కూడా రాదు. పెళ్లి జరిగిపోయిందనుకుంటున్నాడు. వెంటనే వెళ్ళి భార్యను చూడాలి. మరో పక్కన దాగిన మారియాకు తెలుసు, అలీవియాకు పసుపు పచ్చ రంగంటే అసహ్యం.

డ్యూక్ మరోసారి వయొలాను అలీవియా వద్దకు పంపిస్తాడు. ఆమె డ్యూక్ అనుచరుడితో ప్రేమలో పడిందని ఇంటిల్లిపాదికి తెలుసు. సర్ ఆంద్రూకది నచ్చదు. ఆమెను చేసుకునే ఆశతోనే సర్ టాబీకి అడిగినంత అప్పిస్తున్నాడు. "నువ్వు కాల యాపన చేస్తున్నావు. అలీవియా ఆ డ్యూక్ అనుచరుడిని ఇష్టపడిందని తెలియగానే నువ్వు వాణ్ణి చావదన్ని నీ ప్రియురాల్ని రక్షించుకోవాల్సింది. ఇంక ఒకే దారి మిగిలింది. ఆ అనుచరుడితో ద్వంద్వ యుద్ధం (డ్యూయెల్) చేసి గెలవటమే" అంటాడు సర్ టాబీ. సర్ ఆంద్రూ పిరికివాడు. కత్తి పట్టుకోవటం అసాధ్యం.

వయొలా సోదరుడు ఒంటరిగా ఇలీరియాలో పర్యాటకుడిగా తిరుగుతున్నాడు. తన రక్షకుడు సముద్రపు దొంగ అని ప్రతీతి. అందువల్ల అతడు వెంట రాలేదు. కాని సెబాస్టియన్‌కు చేతి ఖర్చుకు కొంత డబ్బిచ్చాడు.

అలీవియా దిగులుగా కూర్చుంది. డ్యూక్ అనుచరుడు తన ప్రేమకు స్పందించలేదు. మాల్వోలియో లాంటి 'సీరియస్' వ్యక్తి రాయబారం నడిపితే ఫలించవచ్చు అనుకుంటుంది. అతడికోసం కబురుపెడుతుంది. మరుక్షణం మాల్వోలియో వచ్చి ముందర వాలుతాడు. ఉత్తరం రాసిన ప్రేయసిని "స్వీట్ హార్ట్" అంటూ సంబోధిస్తాడు. ఉత్సాహంగా నాట్యం చేస్తాడు. అతడికి పిచ్చెక్కిందనుకుంటుంది అలీవియా. సర్ టాబీని పిలిచి "కాస్త అదుపులో పెట్ట"మని చెబుతుంది. "ఉన్మాదులూ, పసి పిల్లలూ ఒక్కటే. జాగ్రత్తగా చూడాలి" అంటాడు సర్ టాబీ.

గత్యంతరం లేక సర్ ఆంద్రూ డ్యూయెల్ చేయటానికి నిశ్చయించుకుంటాడు. వయొలాకు తెలుస్తుందీ విషయం. తన పురుష వేషం మీద విరక్తి కలుగుతుంది. తను యుద్ధం చెయ్యటమా? కత్తి ఎటువైపు పట్టుకోవాలో కూడా తెలియదు. సర్ ఆంద్రూ కూడా లోపల గజ గజ వణికిపోతున్నాడు. "ఎలాగైనా రాజీ చేసుకొంటే బాగుండును. కావాలంటే తన గుర్రం వదులుకుంటాడు." కాని డ్యూయెల్ ప్రకటించిన తర్వాత ప్రత్యర్థులు రంగంలోకి దిగక తప్పదు. ఇద్దరి చేతులూ వణుకుతుంటాయి.

అప్పుడే సెబాస్టియన్ మిత్రుడు వస్తాడు. వయొలాను చూసి తన మిత్రుడే అనుకుంటాడు. డ్యూయెల్ ఆపబోతాడు. డ్యూక్ సైనికులు అతణ్ణి సముద్రపు దొంగగా అరెస్టు చేస్తారు. తనిచ్చిన డబ్బు వాపసు చేయమని వయొలాను అడుగుతాడు సెబాస్టియన్ మిత్రుడు. కాని ఆమెకా విషయమే తెలియదు. అయితే అప్పుడు అనుమానం వస్తుంది – తన సోదరుడు బతికే ఉన్నాడని.

ప్రత్యర్థి పిరికివాడని తెలిసి సర్ ఆంద్రూకి ధైర్యం వస్తుంది. కాని ఆ క్షణాన సెబాస్టియన్ వస్తాడు. అతడి యుద్ధ ప్రావీణ్యం, ప్రవర్తన చూసి సర్ ఆంద్రూ కాళ్ళు వణుకుతాయి.

అలీవియాకు బయట గొడవ జరుగుతున్నదని తెలుస్తుంది. సెబాస్టియనే తన అనుచరుడనుకొని "పెళ్లి చేసుకుందాం రమ్మ"ంటుంది. అతడు ఆశ్చర్యపోతాడు. కాని అంగీకరిస్తాడు. మాల్వోలియోను ఉన్మాది అని నిర్ధారించి, చీకటి గదిలో నిర్బంధించారు. ఫెస్ట్ ప్రీస్టు వేషం వేసుకుని భూత వైద్యుడిలా నటిస్తాడు. ఫెస్ట్‌కు డబ్బు కావాలి. మాల్వోలియో అతడికి లంచమిచ్చి అలీవియాకు ఉత్తరం రాయటానికి కాగితం, కలం ఇవ్వమంటాడు.



వయోలా చిక్కులో పడింది. సెబాస్టియన్ మిత్రుడు డబ్బు వాపసు చేయమంటున్నాడు. అలీవియా తనను పెళ్లి చేసుకున్నానంటుంది. సర్ ఆండ్రూ తనను గాయపరచినందుకు ఆమెను నిందిస్తున్నాడు.

అందరూ ఆమెను సెబాస్టియన్ అనే అనుకుంటున్నారు. అసలు సెబాస్టియన్ ప్రవేశంతో సమస్య పరిష్కారమవుతుంది. సోదరుడి ఆగమనంతో వయోలా ఆనందం మిన్నంటుతుంది. తను వయొలాను ప్రేమిస్తున్నట్టుగా తెలుసుకుంటాడు డ్యూక్.

అందరూ సంతోషంగా నవ్వుకుంటారు — ఒక్క మాల్వోలియో తప్ప. తను మోసపోయానని అప్పటికిగాని అతడికి అర్థం కాదు. ఇదంతా జోక్‌గా తీసుకొమ్మం"టాడు ఫేబియన్. "ప్రతీకారం తీర్చుకుంటా"నంటూ హాస్యానికి శత్రువు మాల్వోలియా నిష్క్రమిస్తాడు. అతణ్ణి శాంతింపజేయటానికి మరో సేవకుణ్ణి పంపిస్తాడు డ్యూక్.

ఇలీరియాలో అందరూ ఎప్పుడూ నవ్వుతూనే ఉండాలి. కోపానికి, దుఃఖానికి అక్కడ తావులేదు.



# 11. ఆల్ ఈజ్ వెల్ దట్ ఎండ్స్ వెల్

ఫ్రాన్స్, ఇటలీ, స్పెయిన్ సరిహద్దులో ఉన్న మరో ఫ్రెంచి నగరం రోసిలియన్‌లో జరుగుతుంది కథ.. ఇటాలియన్ మూల కథను ఇంగ్లీషు అనువాదంలో చదివాడు షేక్స్‌పియర్. ఇది కామెడీయే(సుఖాంతం)గానీ హాస్యం తక్కువగా ఉంటుంది.

మొదటి దృశ్యం: కౌంటెస్ ఆఫ్ రోసిలియన్ భవనం.

ఫ్రెంచి రాజ దర్బారుకు పయనమవుతున్న కొడుక్కు వీడ్కోలు చెబుతున్నది కౌంటెస్. ఫ్రెంచి రాజు మరణ శయ్యపై ఉన్నాడని వార్త మోసుకొచ్చాడు అక్కడి లార్డ్ లాఫూ.

కొడుకు పేరు బెర్ట్రాం. అనాథగా కౌంటెస్ ఆశ్రయం పొందిన హెలెనా కూడా వీడ్కోలు చెబుతున్నది. కౌంటెస్ ఆ పిల్లను కూడా తన స్వంత కూతురిలాగే పెంచింది. బెర్ట్రామంటే హెలెనాకు ప్రేమ. కానీ తను అనాథ గనుక అతణ్ణి పెళ్లి చేసుకోలేదు. తన స్థితిలో ఆమెకు పారోల్స్‌లాంటి సైనికులు మాత్రమే దొరుకుతారు. అతడు వదరుబోతు. బెర్ట్రాం వెంట వెడుతున్నాడు. తన ప్రేమను నిరాకరించినందుకు హెలెనాను దూషిస్తాడు. ఆమెకూడా తిడుతుంది.

ఫ్రెంచి రాజును కలుస్తాడు బెర్ట్రాం. రాజుగారికి బెర్ట్రాం తండ్రి మంచి మిత్రుడు. హెలెనా తండ్రి - ప్రముఖ వైద్యుడు కూడా బాగా పరిచయమే. "అతడుంటే నా జబ్బు నయం చేసేవాడు." కానీ రాజుకు వైద్యులమీద విసుగొచ్చింది. మరణం తప్పదని తెలుసు.

తన కొడుకుతో హెలెనా ప్రేమలో పడ్డదని కౌంటెస్‌కు తెలుస్తుంది. పిలిచి అడుగుతుంది. హెలెనా అంగీకరిస్తుంది. కౌంటెస్‌కు కోపంరాదు. "తన కూతుర్లాంటిది." పారిస్ వెళ్లి తన తండ్రి వాడిన మందులతో రాజుకు వైద్యం చేస్తానంటుంది హెలెనా. కౌంటెస్ ఆశీర్వాదంతో ప్రయాణమవుతుంది.

యుద్ధ వాతావరణంతో కోలాహలంగా ఉంది రాజ దర్బారు. యువ సైనికులు అనేకులు యుద్ధాలకు ఇటలీ వెళ్లారు. బెర్ట్రాం కూడా బయల్దేరాలంటాడు పారోల్స్. ఇంకా పసివాడు. ఇప్పుడే ఎందుకని రాజు అభిప్రాయం.

హెలెనా వైద్యం నిరాకరిస్తాడు రాజు. ఒక్క అవకాశం ఇవ్వమని ప్రార్థిస్తుంది హెలెనా. తన జబ్బు నయం చేస్తే తన దర్బారులో నచ్చిన యువకుణ్ణి పెళ్లి చేసుకోవచ్చునని వాగ్దానం చేస్తాడు రాజు.

హెలెనా వైద్యం ఫలిస్తుంది. ఫ్రెంచి లార్డ్ లాఫూ ఈ విషయం బెర్ట్రాంకు చేరవేస్తాడు. లాఫూ జ్ఞాని. దృశ్య ప్రపంచాన్ని కొన్ని అదృశ్య శక్తులు నడిపిస్తున్నాయని అతడి నమ్మకం. "మిరకిల్స్ లేవంటారు ఆధునికులు. కానీ అతీంద్రియ శక్తులున్నాయని గ్రహించగలరు తాత్వికులు. మన జ్ఞానానికి మించిన జ్ఞానం ఉంది." ఈ అతీంద్రియ శక్తుల ప్రమేయంతోనే మానవ జీవితాలలో విషాద ఛాయలు అలుముకుంటాయి." ఈ నాటకంలో హాస్యం కన్నా గంభీర సన్నివేశాలే ఎక్కువ.

బెర్ట్రాంను తన వరునిగా ఎంచుకుంటుంది హెలెనా. "ఆమె అనాథ, ఒక వైద్యుని కూతురు, తనతో సరితూగద"ని రాజ దర్బారులో ప్రకటిస్తాడు బెర్ట్రాం. రాజు నచ్చ చెప్పటానికి ప్రయత్నిస్తాడు. ఆమెకు ఆస్తి, హోదా కల్పిస్తానంటాడు. అయినా బెర్ట్రాం వినడు. "అసలు నేనామెను ప్రేమించటం లేదు." రాజుగారి వాగ్దానం వలన సంక్రమించిన

హక్కును కోల్పోవటానికే ఇష్టపడుతుంది హెలెనా.

రాజుకు కోపం వస్తుంది. "పెళ్లి జరిగి తీరుతుంది - ఈ రాత్రికే" అంటూ ఆజ్ఞాపిస్తాడు.

పారోల్స్ ఒక్కడే తననర్థం చేసుకోగలడనుకుంటడు బెర్ట్రాం. లాఫూకు తెలుసు "పారోల్స్ వట్టి కుండ."

ఈ చిక్కునుంచి బయటపడాలంటే యుద్ధానికి వెళ్లటమొక్కటే మార్గం" అని బెర్ట్రాంకు సలహా ఇస్తాడు పారోల్స్. పెళ్లి తంతు ముగిసిన మరుక్షణమే బెర్ట్రాం వెళ్లి పోతాడు. "ఆమె ఎప్పటికీ నా భార్య కాలేదు."

తన దురదృష్టానికి చింతిస్తూ తల్లికో లేఖ కూడా రాస్తాడు. కానీ కౌంటెస్‌కు కొడుకు చేసిన పని నచ్చదు. కొత్త కోడలిపైన ప్రేమ పొంగుతుంది.

భార్యకు కూడా కోపంతో ఓ ఉత్తరం రాస్తాడు బెర్ట్రాం. "నా వల్ల నీకు సంతానం కలిగినప్పుడే నేను నీ భర్తనని అంగీకరిస్తాను. కానీ అది అసంభవం."

భద్రత ఉన్న రాజ దర్బారునుండి ప్రాణహాని ఉన్న యుద్ధానికి భర్తను పంపానని హెలెనా బాధ. తను రోసిలియన్‌ను వీడితే అతను తిరిగి ఇంటికి వచ్చే అవకాశముంది. సెయింట్ జాక్వెస్ (పుణ్య క్షేత్రం) యాత్రకు బయల్దేరుతుంది. కొడుకూ, కోడలూ కాపురం చేసేదెప్పుడని కౌంటెస్ మనసు క్షోభిస్తుంది.

హెలెనా ఇల్లు వదిలి వెళ్లి పోయిందని కొడుక్కు సమాచారం పంపుతుంది.

ఇటాలియన్ నగరం ఫ్లొరెన్స్. తిరిగి వస్తున్న సైనికులను జయ జయ ధ్వానాలతో ఆహ్వానిస్తున్నారు స్త్రీలు. బెర్ట్రాం సాహసం వాళ్లకు నచ్చింది. కానీ అతడు ఒక ఫ్లొరెన్స్ యువతి డయానాను ప్రేమించమని బలవంతం చేస్తున్నాడు. ఇందుకు పారోల్స్‌ను మధ్యవర్తిగా వాడుకుంటున్నాడు. ఇదే వాళ్లకు కోపం తెప్పించింది.

పారోల్స్ నిజస్వరూపం బెర్ట్రాంకు తెలపాలని కొందరు మిత్రులు ప్రయత్నిస్తున్నారు. సరిహద్దువద్ద అతణ్ణి (పారోల్స్) బంధించి కళ్ళకు గంతలుగట్టి ప్రశ్నిస్తే అసలు విషయం కక్కేస్తాడు. ప్రాణభీతి ఉన్నపుడు ఎవరికైనా ద్రోహం చేయటానికి వెనుకాడడతడు.

బెర్ట్రాం ఉత్తరం ప్రకారమే అతణ్ణి తన భర్తను చేసుకోవాలనుకుంటుంది హెలెనా. డయానా తల్లికి తన కథంతా చెబుతుంది. బెర్ట్రాం ప్రేమను అంగీకరించినట్టుగా నటిస్తుంది డయానా. పెళ్లినాటి ఉంగరమిస్తే అతడి భార్యనవుతానంటుంది.

సరిహద్దు దగ్గర సంచరిస్తున్నపుడు పారోల్స్‌ను బంధిస్తారు బెర్ట్రాం మిత్రులు. "అంతా చెప్పేస్తాను. ప్రాణాలతో వదలండ"ని ప్రార్థిస్తాడు పారోల్స్.

అర్థరాత్రి తన గదికి రానివ్వమని డయానాను అర్థిస్తాడు బెర్ట్రాం. ఉంగరమిస్తేనే రానిస్తానంటుంది డయానా. ఉంగరం వంశ గౌరవానికి సంబంధించినది. అదివ్వడం వీలుపడదు. "అంటే నా గౌరవం మంటగలుపుతావన్న మాట" అని నిష్ఠూరంగా మాట్లాడుతుంది డయానా. అతడి ఉంగరానికి బదులుగా తన ఉంగరాన్ని ఇస్తానని

వాగ్దానం చేస్తుంది డయానా. అలా ఆ రాత్రి చీకట్లో డయానా అనుకుని హెలెనాతో గడుపుతాడు బెర్ట్రాం.

యాత్రలో హెలెనా మరణించిదని తల్లి రాసిన ఉత్తరం చేరుతుంది. యుద్ధం ముగిసింది. ఇక ఫ్లారెన్స్‌లో పని లేదు. గంతలు కట్టిన తర్వాత ప్రాణ భయంతో పారోల్స్ సైనిక రహస్యాలన్నీ వెల్లడిస్తాడు. తన మిత్రుల గురించి అనేక అబద్ధాలు కూడా కల్పించి చెబుతాడు.

రోసిలియన్‌కు తిరిగి వస్తాడు బెర్ట్రాం. కోడలు మరణించిన శోకంతో ఉంటుంది తల్లి. బెర్ట్రాం కూడా బాధపడతాడు. రాజుగారు వచ్చి బెర్ట్రాం వేలికి హెలెనా తొడిగిన ఉంగరం చూస్తాడు. డయానాతో సంబంధం పెట్టుకున్నందుకు చీవాట్లు వేయాలనుకున్న రాజుకు ఇది అర్థం కాదు.

హెలెనా ప్రవేశించి జరిగింది చెబుతుంది. బెర్ట్రాం ఉత్తరంలో పెట్టిన షరతుల ప్రకారం అతడు ఇప్పుడు ఆమెను భార్యగా అంగీకరించక తప్పదు. కౌంటెస్ కోడల్ని ఆలింగనం చేసుకుంటుంది. అడిగినంత కట్నమిచ్చి డయానాకు నచ్చిన వరుడితో పెళ్లి జరిపిస్తానంటాడు రాజు.

విషాదం తర్వాత ఆనందం రెట్టింపవుతుంది.





# 12. మెజర్ ఫర్ మెజర్

ఇందులో హాస్యంకన్నా వ్యగ్యం ఎక్కువ. నవ్వులో హేళన ఉంటుంది.

కథా స్థలం వియన్నా. డ్యూక్ ఆఫ్ వియన్నా ఎక్కడికో ప్రయాణమవుతున్నాడు. తన నమ్మిన బంటు ఎస్కాలస్, మరో యువకుడు ఏంజిలోలకు ప్రభుత్వ బాధ్యతలను అప్పగించాడు.

నగరం అన్ని రకాల దుర్వ్యసనాలకు రాజధానిగా మారింది. తన హయాంలో అన్నీ చక్కబెట్టగలనని ఏంజిలో ధీమా. వ్యసనాలను నిషేధిస్తూ చాలా చట్టాలున్నాయి. కానీ జనం వాటిని నిత్యం ఉల్లంఘిస్తున్నారు. అమలు పరచవలసిన అధికారులు లంచ గొండులుగా, స్వయంగా వ్యసనపరులుగా మారారు. నిబంధనలను తు చ తప్పకుండా పాటిస్తే పరిస్థితి దానంతటదే చక్కబడుతుంది.

ఈ క్షాళన కార్యక్రమంలో మొదట దొరికిన నేరస్తుడు క్లాడియో. అతడికి ఒక పిల్లతో

పెళ్లి నిశ్చయమైంది. కట్న సమస్యతో వాయిదా పడింది. అయినా క్లాడియో ఆ పిల్లతో సంబంధం పెట్టుకున్నాడు. ఇప్పుడామె గర్భవతి. వియెన్నాలో అమలులో వున్న చట్టాల ప్రకారం ఇది పెద్ద నేరం. అతడికి మరణ శిక్ష విధించాలి. కానీ ఇలాంటి చిన్న చిన్న నేరాలు రోజూ అందరూ చేస్తూనే ఉన్నారు. ఎవ్వరికీ శిక్షలు వెయ్యకపోతే వ్యవస్థ ఎలా బాగు పడుతుంది మరి! మూడు రోజుల్లో అతడు చావక తప్పదు.

క్లాడియో ప్రకారం, ఆ పిల్ల తన భార్య. పెళ్లి కుదిరిన తర్వాత కలుసుకోవడం పెద్ద నేరం కాదు. మహా అయితే పై అధికారులకు ఒక అర్జీ పెట్టుకోవాలి. ఇందుకు తన సోదరి ఇసాబెల్లా సహాయం కోరాలి. ఇసాబెల్లా ఒక ఆశ్రమంలో చేరాలనుకున్నది. కానీ తన సోదరుడికి ముంచుకొచ్చిన ప్రమాదం తెలిస్తే ఆమె తప్పక ఏంజిలో వద్ద తన కేసు వాదిస్తుంది.

నిజానికి డ్యూక్ నగరం వదలడు. మారు వేషంలో అక్కడే ఉంటాడు. తన పద్నాలుగు సంవత్సరాల పాలనలో నగరంలోని నైతిక జీవితం ఎంతో పతనమైంది. ఏంజిలో చట్టాన్ని కాస్త కఠినంగా అమలు చేస్తే మళ్లీ పూర్వ వైభవమొస్తుంది. కానీ ఏంజిలో కరుణ, ప్రేమాభిమానాలున్న వ్యక్తి కాదు. అలాంటివాడు ప్రజలతో ఎంత అమానుషంగా ఉంటాడో!

ఆశ్రమంలో ఉన్న ఇసాబెల్లా వద్దకు క్లాడియో సందేశం తీసుకుని ఒక మిత్రుడు వస్తాడు. లోకాన్ని త్యజించిన ఇసాబెల్లాకు తన సోదరుడు చేసింది పాప కార్యంగానే తోస్తుంది. "అందరూ ఇలాగే ఉన్నారుగదా" అన్నంతమాత్రాన అతడు చేసింది నేరం కాకపోదు.

అయితే పెళ్లి కుదరడమంటే పెళ్లి జరిగినట్లే. కాబోయే భార్యా భర్తలు కలుసుకోవటం సర్వ సాధారణమైన విషయమని డ్యూక్ కూడా విశ్వసిస్తాడు. అతడి ఉద్దేశంలో అది తప్పు కాదు. కానీ ఇసాబెల్లాకు "తప్పు ఎవరు చేసినా తప్పే." సోదరుడంటే ప్రేమలేదని కాదు. ఏంజిలో వద్దకెళ్లి ప్రాణ భిక్ష కోరగలదేగానీ తప్పుకాదని మాత్రం అంగీకరించదు.

ఏంజిలోలో దయాగుణం లేదు. న్యాయమూర్తిలో ఉండవలసిన లక్షణం కాదది. డ్యూక్ ఉద్యోగం నిర్వహిస్తున్న ఉన్నతోద్యోగిగా పౌరుల మానప్రాణాలు అతడి అధీనంలో ఉన్నాయి. ఇతర ఉద్యోగులు ఈసారికి క్షమించి వదలమంటారు. కాని మరణ శిక్ష భయం లేకపోతే జనం మాట వినరు. నేరం చేసినవాడి పట్ల కరుణ ఎందుకు?

నీతి బాహ్యమైన, సమాజ వ్యతిరేక కార్యపలాపాలు చేసేవాళ్లతో లుకలుకలాడుతున్నది వియన్నా చీకటి లోకం. ఉక్కు పాదంతో దాన్ని అణచివేయడానికి ఏంజిలో కంకణం కట్టుకున్నాడు. పని భారం పెరిగి కొంతమంది నేరస్తులను ప్రశ్నించే బాధ్యతను వృద్ధ ఎస్కాలస్‌కు అప్పగిస్తాడు. ఒక రకంగా ఏంజిలోకి అధికారం తలకెక్కింది. న్యాయమూర్తులకు తెలుసు ప్రతి ఉల్లంఘనా శిక్షార్హం కాదని. కానీ ఎదట నిలిచిన

ముద్దాయిలందరికీ కఠినాతి కఠినమైన శిక్ష వెయ్యటమే లక్ష్యంగా పెట్టుకున్నాడు ఏంజిలో. ఇలాంటి వాళ్లు అధికారానికి అనర్హులు.

తన సోదరుణ్ణి క్షమించమని ప్రార్థించటానికి వచ్చింది ఇసాబెల్లా. ఒకరి ముందర చేయి చాచే స్వభావం కాదామెది. పైగా అతడు చేసింది నేరమేనని కూడా నమ్ముతుందామె. వేడుకోటానికి బదులుగా "నిరంకుశంగా ప్రవర్తించినవాళ్ళు తమ అల్పత్వాన్ని ప్రదర్శించు కుంటారు," అంటుంది.

ఏంజిలోలో చలనం వస్తుంది– ఇసాబెల్లా మీద జాలితో కాదు. రాయిలాంటి మనిషి ఆమెతో ప్రేమలో పడ్డాడు. మరుసటి రోజు మళ్లీ రమ్మన్నాడు. వివాహేతర సంబంధానికి మరణ శిక్ష విధించిన జడ్జిగారు స్వయంగా అదే నేరం చెయ్యబోతున్నారు. పైగా అతనిది నీచమైన ఆలోచన. ఒక రాత్రికి ఆమె తనను తాను అర్పించుకుంటే క్లాడియోను క్షమిస్తాడు.

ఇసాబెల్లా నిరాకరిస్తుంది. ప్రాణం కన్నా తన శీలం ఎక్కువని క్లాడియో కూడా అర్థం చేసుకోగలడని జైలుకు వెళ్లి అతడితో ఈ విషయం చెబుతుంది. "వద్దు. అంతకంటే మరణానికే నేను సిద్ధం" అంటాడు క్లాడియో. కాని క్రమేణా మృత్యు భయం పెరుగుతుంది. "నన్నెలాగైనా బతికించు" అంటూ ఇసాబెల్లాను వేడుకుంటాడు. క్లాడియో ఎందుకింత దిగజారాడో ఆమెకు అర్థం కాదు. కాని తనకోసంగాని, మరొకరి కోసంగానీ తెలిసి తెలిసి పాపం చెయ్యదు. పైగా తను చెయ్యాల్సింది క్లాడియో చేసినదానికన్న పెద్ద నేరం.

క్రీస్తు వేషంలో ఉన్న డ్యూక్ క్లాడియో, ఇసాబెల్లాల సంభాషణ వింటాడు. ఇసాబెల్లా పట్ల అతడికి గౌరవం పెరుగుతుంది. ఓ మార్గాంతరం సూచిస్తాడు.

ఏంజిలోకు మారియానా అనే యువతితో పెళ్లి కుదిరింది. కానీ మారియానా తన కట్నం డబ్బు పెళ్లికి ముందే ఖర్చు పెట్టింది. ఏంజిలో పెళ్లికి నిరాకరించాడు. ఆమెకు అతడంటే ఇంకా ప్రేమ. ఇసాబెల్లాకు బదులు ఆమెను పంపవచ్చు. ఇసాబెల్లాకు ఈ ప్లాను నచ్చుతుంది. రాత్రికి చీకటిలో కలుసుకుంటానని ఏంజిలోకు చెబుతుంది.

మారు వేషంలో డ్యూక్ నగరమంతా తిరిగి చూస్తాడు. వియన్నా పాపకూపంలాగ తయారైంది. "దుర్వ్యసనాలు మనిషికి సహజం" అంటాడు ఏంజిలో సలహాదారుడొకడు. డ్యూక్ స్వయంగా వ్యసనపరుడు గనుక నగరానికి ఈ పరిస్థితి వచ్చిందని కొందరి అభిప్రాయం. ఈ పుకారు విని అతడు బాధపడతాడు.

డ్యూక్ వెళ్ళి మారియానాకు విషయమంతా వివరిస్తాడు. ఏంజిలో తన ఉద్యానవన ద్వారం తాళం చెవులు ఇసాబెల్లాకిస్తాడు. మారియానా ఎలాంటి అభ్యంతరం చెప్పదు. పెళ్ళి నిశ్చయమైంది. గనక, కాబోయే భర్తతో కలిస్తే తప్పులేదు.

క్రీస్తు వేషంలోవున్న డ్యూక్ క్షమాభిక్ష కోసం క్లాడియో సెల్ వద్ద నిరీక్షిస్తుంటాడు. వదిలేస్తే క్లాడియో తనమీద ప్రతీకారం తీర్చుకుంటాడని భయపడి వెంటనే అతడికి

శిరచ్ఛేదం చెయ్యమని ఆదేశిస్తాడు ఏంజిలో. రుజువుగా జైలు అధికారులు క్లాడియో తల తనకు పంపాలి.

జైల్లో మరో కరడుగట్టిన నేరస్తుడుంటాడు. ఏంజిలోకు అతడి తల పంపించమని అధికారులకు సలహా యిస్తాడు డ్యూక్. కాని ఆ నేరస్తుడు సహకరించడు. "నాకు శిక్షపడలేదు.ఈ రోజు నేను చావను." అదృష్టవశాత్తూ, ఆ ఉదయమే ఒక సముద్రపు దొంగ జైల్లో మరణించాడు. అతడి తల పంపించవచ్చు.

డ్యూక్ తాను వియన్నా పొలిమేరలకు చేరుకున్నాననీ, జనం కరతాళ ధ్వానాల మధ్య నగర ప్రవేశం చేస్తానని ఏంజిలోకు శ్రీముఖం పంపిస్తాడు. అందరి సమక్షంలో ఏంజిలో తలదించుకునేట్టు చేయాలి. అమాయకురాలు ఇసాబెల్లాను బలిపెట్టకూడదు. ఆ ఉద్దేశంతో ఆమె సోదరుడికి మరణ శిక్ష అమలు జరిగిందని కబురుపెడతాడు.

అప్పటికే ఇసాబెల్లా చెయ్యవలసిన పని నిర్ణయించారు. జనం మధ్య డ్యూక్‌కు ఇసాబెల్లా ఒక అర్జీ సమర్పించుకోవాలి– ఏంజిలో దుష్ప్రవర్తన అందులోని ప్రధానాంశం. మారియానా పేరు మాత్రం మార్చి మిగతాదంతా పూసగుచ్చినట్టు చెబుతుంది ఇసాబెల్లా. అత్యంత నీతి వర్తనుడైన ఏంజిలో పట్ల ఈ అభియోగం నమ్మలేనంటాడు డ్యూక్. విజయగర్వంతో ఏంజిలో చిరునవ్వు నవ్వుతాడు. మారియానా వచ్చి మిగతా కథ చెబుతుంది. ఇదంతా ఒక వల, ఈ ఇద్దరు స్త్రీలు శత్రు రాజు ఏజంట్లంటాడు ఏంజిలో. తన హోదా ఎక్కడ? ఇసాబెల్లా లాంటి సాధారణ స్త్రీ ఎక్కడ?

నీలాపనిందలు వేసినందుకు స్త్రీలను శిక్షించాలని ఆజ్ఞాపించి, ప్రీస్టు వేషంలో తిరిగి వచ్చి వాళ్ల తరఫున వాదిస్తాడు డ్యూక్. రాజ ద్రోహిగా ప్రీస్టును అరెస్టు చెయ్యాలంటాడు ఏంజెలో. అప్పుడు డ్యూక్ తన ముసుగు తీసేస్తాడు.

పరిస్థితి చేయి జారిపోయిందని గ్రహిస్తాడు ఏంజిలో. తక్షణ మరణమే తనకు శరణ్యమంటాడు.

"మొదట మారియానాతో వివాహం ఆ తర్వాత శిరచ్ఛేదం" అంటాడు డ్యూక్. మారియానా భర్తకు ప్రాణ భిక్ష పెట్టమని ప్రార్థిస్తుంది. తన సోదరుణ్ణి చంపాడని తెలిసీ, ఇసాబెల్లా ఏంజిలోను క్షమించమంటుంది.

చట్టం తనపట్ల నిర్దాక్షిణ్యంగా వ్యవహరించాలంటాడు ఏంజిలో.

కాని క్లాడియో మరణించ లేదు. అందువల్ల ఏంజిలోకు మరణశిక్ష అవసరం లేదు. మారియానా కోసం ఏంజిలోను క్షమిస్తాడు. న్యాయబద్ధమైన పాలనకు సహకరించిన పౌరులను అభినందిస్తాడు డ్యూక్. ఆ తర్వాత ఇసాబెల్లాను తనకు భార్య కావాలని కోరతాడు.

నవ్వుల మధ్య పరివారమంతా రాజమందిరానికి తిరిగి వస్తారు.



# 13. ది వింటర్స్ టేల్

ఒక అద్భుత ప్రపంచంలో జరుగుతుందీ కథ. దుర్మార్గులైన ప్రభువులు, స్వేచ్ఛగా సంచరించే ఎలుగుబంట్లు ప్రేక్షకుల్ని స్వప్నలోకంలోకి ఆహ్వానిస్తాయి. బాల్యంలో, షేక్స్‌పియర్ ఈ కథ విన్నాడట. అసహజమైన కథే అయినా కవిత్వమహిమతో సాహిత్య శిఖరాల నధిరోహించింది. శీతకాలంలో కరుకు ఖడ్గంలా, వసంత కాలంలో మలయమారుతంలా స్పృశించే భావాలను తన పంక్తులలో అనుభవింప చేస్తాడు కవి.

సిసిలియా రాజు లియోంటెస్ తన బాల్యమిత్రుడు బొహిమియా రాజు కోసం వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేశాడు. ఆ ఏర్పాట్లు చూసి ఆనందిస్తారు అనుచరగణం.

రాజమందిరంలో - బొహిమియా రాజు, మరునాడు తను వీడ్కోలు తీసుకోక

తప్పదంటాడు. లియొంటెస్ మరి కొంతకాలం ఉండమని మిత్రుణ్ణి ఒప్పించటానికి ప్రయత్నిస్తాడు.

లియొంటెస్ భార్య హెర్మియోన్ సుందరి. అతిధికి తన భర్త చిన్ననాటి కబుర్లు చెప్పి ఉల్లాస పరచాలని కుతూహలం. బొహీమియా రాజు కూడా ఆసక్తి ప్రదర్శిస్తాడు. మరికొంతకాలం ఉండటానికి అభ్యంతరం లేదంటాడు.

భార్య, అతిధితో ప్రవర్తించిన పద్ధతి లియొంటెస్‌కు కోపం తెప్పిస్తుంది. అతడిలో అసూయ ప్రవేశించింది. ఆమె తన మిత్రుడితో ప్రేమలో పడి ఉంటుంది. తనలో రగిలిన జ్వాలను దాచుకునే ప్రయత్నం కూడా చేయడు. కొడుకు చిన్న పిల్లవాడు. భార్యకు మొదటినుండీ పర పురుషుడితో సంబంధం ఉండే ఉంటుంది. 'వీడు తన సంతానం కాదు' అనుకుంటాడు. భార్య, మిత్రుడి మీది ద్వేషం తారస్థాయికి చేరుతుంది. బొహీమియా రాజును హత్య చెయ్యమని తన అంతరంగికుడు కామిలోను ఆదేశిస్తాడు. కామిలోకు ఇంగితం తెలుసు. లియొంటెస్ అసూయ అర్ధరహితమని అతడికి విశ్వాసం. రాణీతో (లియొంటెస్ భార్య) కలసి బొహీమియా వెళ్లటం శ్రేయస్కరమని అతిధికి సూచిస్తాడు. ఇలా చెయ్యటం వల్ల, ప్రేమికులిద్దరూ లేచిపోయారని లియొంటెస్‌కు నమ్మకం కుదురుతుంది.

హెర్మియోన్ గర్భవతి. పాలబుగ్గల పసివాణ్ణి వదిలి వెళ్లటానికి మనస్కరించదు. కొడుకును పిలిచి తనకో కథ చెప్పమంటుంది. దయ్యాల కథ చెప్పటం ప్రారంభిస్తాడు వాడు. అయితే అసలు దయ్యం లియొంటెస్ అప్పుడు ప్రవేశిస్తాడు. తక్షణమే భార్యను ఖైదు చేస్తాడు. ఉద్యోగులందరూ ఇది అనుచితమని ప్రార్థిస్తారు. కాని ఎవరి మాటా వినే స్థితిలో లేడతడు. అయితే వాళ్ల కోరిక ప్రకారం ఒక డెల్ఫిక్ ప్రీస్ట్‌తో సోది చెప్పించి హెర్మియోన్ పవిత్రతను నిర్ధారిస్తానంటాడు.

ఒక ఉన్నతోద్యోగి భార్య పాలినా జైలు దర్శించి రాణీ ఆడపిల్లను ప్రసవించినట్లుగా తెలుసుకుంటుంది. పసిగుడ్డును చూసైనా రాజు సంతోషిస్తాడని ఆమె ఆశ. కాని అతడి ద్వేషం మరింత పెరిగింది. శిశువును దూరంగా ఉన్న ఒక ఎడారిలో వదిలిపెట్టమని పాలినా భర్తను ఆదేశిస్తాడు.

చట్టప్రకారం రాణీ మీద విచారణ జరపాలి. కాని తీర్పు ఏముండబోతుందో లియొంటెస్ అప్పుడే నిర్ధారించాడు. సభలో రాణి తాను అమాయకురాలినని ప్రమాణం చేస్తుంది. డెల్ఫోస్ వద్ద ఉన్న అపోలో ప్రీస్ట్ కూడా ఆమె చెప్పింది నిజమంటాడు. కాని అసూయా ద్వేషాలతో దహించుకుపోతున్న లియొంటెస్ సోదిని నమ్మడు. విచారణ ఇంకా జరగాల్సిందేనంటాడు.

అప్పుడొక విషాద వార్త సభికులందర్నీ కలచి వేస్తుంది. తల్లి మీద బెంగ పెట్టుకున్న రాకుమారుడు మరణించాడు. భార్యపట్ల ఎంత అసూయ ఉన్నా, కొడుకంటే లియొంటెస్‌కు

ప్రాణం. క్రీస్ట్‌ను ధిక్కరించినందుకు విధి తనమీద ప్రతీకారం తీర్చుకొందని పశ్చాత్తాప పడతాడు. హెర్మియోన్ మూర్ఛ పోతుంది. రాణికి తగిన ఉపచారాలు చెయ్యమని చెలికత్తెలను కోరతాడు లియొంటెస్. ఆమె త్వరలో కోలుకుంటుందని అతడి నమ్మకం. కాని రాణి మరణించిందని మరో దుర్వార్త తీసుకొస్తుంది పాలినా. తన అసూయా జ్వాలలకు కుటుంబమంతా ఆహుతైంది. జీవితాంతం ఇక శోకమే మిగిలింది.

బొహిమియాలోని ఒక ఎడారికి శిశువును కొనిపోతాడు పాలినా భర్త. అది రాజాజ్ఞ. అక్కడ ఒక ఎలుగుబంటి అతణ్ణి చంపేస్తుంది. ఈ విషయం ఒక గొర్రెలకాపరి తన తండ్రికి చేరవేస్తాడు. అల్లకల్లోలంగా ఉన్న సముద్రంలో నావ మునిగి అనేకమంది జలసమాధి అవుతారు. బంగారు బొమ్మలాంటి ఒక చక్కటి ఆడశిశువు తనకు దొరికిందని మురిసిపోతాడు తండ్రి.

పదహారేళ్లు గడుస్తాయి. బొహిమియా రాజదర్బారు! అప్పుడు రాజు ప్రాణం రక్షించిన కామిలో సిసిలియా వెళ్లిపోతానంటాడు. కాని రాజుగారు అతణ్ణి వదిలి ఉండలేరు. అతడిప్పుడు తనకు సలహాదారు కూడా. ముఖ్యంగా కుమారుడు ఫ్లోరైజెల్ శిక్షణలో అతడి అవసరం ఎంతైనా ఉంది. ఒక గొర్రెలకాపరి ఇంట్లో ఎక్కువ కాలం గడుపుతున్నాడు ఫ్లోరైజెల్. శిశువు దొరకడంతో బాగా సంపద కలసి వచ్చింది గొర్రెలకాపరికి. ఆ పిల్ల ఇప్పుడు పదహారేళ్ల సౌందర్యరాశి. రాజు, కామిలో మారువేషంలో వెళ్లి ఫ్లోరైజెల్ అక్కడ ఏం చేస్తున్నాడో పరిశీలించాలనుకుంటారు.

గొర్రెలకు బొచ్చు కత్తిరించే సమయమది. గొర్రెలకాపరి అందరికీ విందు ఏర్పాటు చేశాడు. పెంపుడు కూతురి పేరు పెర్డిటా. బొచ్చు కత్తిరించే వాళ్లకోసం రెండు డజన్ల మాస్కులు తయారుచేసిందామె. ఆరోజంతా పాటలు, నాట్యాలతో గడుస్తుంది. తన సోదరుణ్ణి (గొర్రెలకాపరి కుమారుడు) విందుకోసం భోజన పదార్థాలు కొనుక్కురమ్మని పంపింది. ఏడు జాజికాయలు తెమ్మని ప్రత్యేకంగా చెప్పింది. కాని దార్లో ఒక సరదా జేబుదొంగ (పేరు.. ఆటోలికస్) అతడి డబ్బు దొంగిలిస్తాడు. ఆ తర్వాత మిగతా వాళ్లతో కలిసి బొచ్చు కత్తిరించటానికి బయల్దేరతాడు.

గొర్రెలకాపరి పాక ముందర పెర్డిటా, ఫ్లోరైజెల్ బొచ్చు కత్తిరించే వాళ్లకోసం నిరీక్షిస్తుంటారు. అతడు రాకుమారుడు. తను సామాన్యురాలినని ఆమెకు తెలుసు. ఆమె పెంపుడు తండ్రి ఇరుగు పొరుగులతో ప్రవేశిస్తాడు. ఆహూతుల్లో కామిలో(మారువేషంలో) కూడా ఉన్నాడు. వసంత కన్యలాగ ఆమె అందరికీ స్వాగతం పలుకుతుంది.

దొంగ గడ్డంతో ఆటోలికస్ ప్రవేశిస్తాడు– కొన్ని వస్తువులను సంచిలో వేసుకుని అమ్మకానికి తెస్తాడు. అతడు మంచి గాయకుడు. "ఒక వడ్డీ వ్యాపారి ఇరవై డబ్బు మూటల్ని ప్రసవించిందంటూ హాస్యగీతాలు పాడతాడు. శ్రోతలు అది నమ్మరు." నిజం. ప్రసవాన్ని నిర్వహించిన మంత్రసాని పేరు మిసెస్ టేల్‌పోర్టర్. మరో అయిదారుగురు

స్త్రీలు కూడా సాక్ష్యం."

ఫ్లోరైజెల్ అతడి వద్ద ఏమీ కొనడు. మారువేషంలో ఉన్న అతడి తండ్రి ఎందుకు కొనటంలేదని ప్రశ్నిస్తాడు. "పెర్డిటాకు నేనివ్వగలిగిన బహుమతి ఒక్కటే. నా హృదయం. అదెప్పుడో ఇచ్చేశాను" అంటాడు ఫ్లోరైజెల్. రాజుకు కోపం వచ్చి వేషం తొలగిస్తాడు. ఒక రైతు కన్యతో వివాహం అసంభవం అంటాడు. "అవసరమైతే ఆ పిల్లను చంపుతాను. కాని పెళ్లి మాత్రం జరగనివ్వను" అంటూ హెచ్చరిక జారీ చేస్తాడు.

పెర్డిటా హతాశురాలవుతుంది. ఫ్లోరైజెల్ చెయ్యగలిగిందొక్కటే. ఇద్దరూ కలిసి రహస్యంగా పారిపోవాలనుకుంటారు. సిసిలియా (రాజ్యం) వెళ్లమని సలహా ఇస్తాడు కామిలో. రాజు వాళ్లను వెంబడిస్తాడు. తను కనీసం అలాగైనా స్వదేశానికి వెళ్లొచ్చు.

ఆటోలికస్ తను తెచ్చిన రిబ్బన్లు, బ్రేస్‌లెట్లు అమ్ముకుంటాడు. ఫ్లోరైజెల్‌తో డ్రెస్సు మార్చుకుని అతడు రహస్యంగా ప్రయాణించటానికి సాయపడతానంటాడు. పెర్డిటా కూడా అదే నావలో ప్రియుడిని అనుసరించవచ్చు. ఈ హఠాత్పరిణామానికి బెదిరిన గొర్రెలకాపరి పెర్డిటా తనకు పుట్టిన పిల్లకాదని ప్రకటిస్తాడు. మంచి దుస్తుల్లో ఉన్న ఆటోలికస్ తను రాజబంధువుననీ, సమస్యను పరిష్కరిస్తాననీ నమ్మబలికి అందర్నీ రాకుమారుడితోపాటు సిసిలియా వెళ్లే నావలో ఎక్కిస్తాడు.

పదహారేళ్లుగా లియొంటెస్ శోకంలో, పశ్చాత్తాపంలో గడిపాడు. పాలినా స్వయంగా వధువును ఎంపిక చేస్తే తప్ప తనకై తాను ఎవర్నీ చేసుకోనని వాగ్దానం చేస్తాడు. బొహీమియా రాజు పంపగా వచ్చామని ఫ్లోరైజెల్, పెర్డిటా దర్బారులో ప్రవేశిస్తారు. కాని తన కన్నుగప్పి వచ్చారని ఆ రాజు వర్తమానం పంపిస్తాడు. ముద్దొచ్చే ఇద్దరు పిల్లల్ని చూసి లియొంటెస్ మురిసిపోతాడు. వాళ్ల తప్పిదాన్ని క్షమించి, సహాయం చేస్తానంటాడు.

గొర్రెలకాపరి పెర్డిటా జన్మరహస్యం ఫ్లోరైజెల్ కూడా చెప్పలేదు – ప్రయాణంలో తుఫాను వచ్చింది. మాట్లాడుకోవటానికి వీలు చిక్కలేదు – పరిస్థితులిప్పుడు చక్కబడ్డాయి గనక, ఇద్దరు రాజులకూ అసలు విషయం విశదం చేస్తారు. ఆనాటి కొన్ని గుర్తులు, రాజలాంఛనాలు కూడా చూపి రుజువు చేస్తారు. సమస్య పరిష్కారమైనందుకు అందరూ సంతోషిస్తారు-భార్యా వియోగంతో ఇంకా బాధపడుతున్న లియొంటెస్ తప్ప. పాలినా అతణ్ణి తన ఇంటికి తీసికెళ్లి హెర్మియోన్ విగ్రహం చూపిస్తానంటుంది. కాని నిజానికి ఆమె బతికే ఉంది. తల్లీ కూతుళ్లు ఆనందంగా కౌగలించుకుంటారు.

అలా ముగుస్తుంది "వింటర్స్ టేల్". నాటక ప్రారంభంలో "చలికాలంలో విషాద కథలు ఆకర్షిస్తాయి" అంటూ ఒక చరణం ఉంటుంది. నిజమే. కథ మొదటి భాగం విషాదమే గద. అందరి నవ్వులతో చివరి సీను ముగుస్తుంది.



# 14. ది టెంపెస్ట్

మంత్రాలు, మాయలతో నిండిన ఇంద్రజాలికుడి కనికట్టు ఈ నాటకం. నడిసంద్రాన ఒక దీవిలో జరుగుతుంది కథ. మూడు గంటలపాటు ఊపిరి సలపనివ్వని ఉత్కంఠతో జరిగిన సంఘటనలు, సంఘర్షణలు ప్రేక్షకులను కట్టిపడేస్తాయి. ఈ నాటకాన్ని చూడటమంటే ఒక అద్భుత లోకంలోకి ప్రవేశించటమే. షేక్స్పియర్ రాసిన మరే నాటకమూ ఇంత విచిత్రంగా ఉండదు.

'తుఫాను' అన్న పేరే ప్రేక్షకులలో ఆసక్తి రేకెత్తిస్తుంది. ట్యూనిస్‌లో కూతురి వివాహం జరిపించి తిరిగి వస్తున్నాడు నేపుల్స్ రాజు. అతడి నావ తుఫానులో చిక్కుకుంది. రాజుగారి అధికారాన్నీ, ఆజ్ఞల్నీ ప్రకృతి ఖాతరు చెయ్యదు గద. సరంగు కూడా చెయ్యగలిగిందంతా

చేశాడు. కాని మహోద్ధృతంగా వీచిన గాలికి నావ రెండు ముక్కలైంది. భగవదేచ్ఛ ముందు మానవ ప్రయత్నానికీ, ప్రార్థనలకూ విలువ లేదు.

అయితే ఇది సహజంగా వచ్చిన తుఫాను కాదు. పక్క దీవిలో ఉంటున్న మాంత్రికుడు ప్రాస్పెరో దీన్ని సృష్టించాడు. అతడి కూతురి పేరు మిరాండా. పదిహేనేళ్ల సుందరి. ఆమెది జాలిగుండె. నౌక మునిగి పోవటం చూసి బాధపడింది. ఆమె తండ్రి కూడా మంచివాడే. ఎవరికీ హాని తలపెట్టడు. అందువల్ల నౌక మునిగినా, ప్రయాణీకులు మాత్రం మరణించలేదు. అందరూ ద్వీపం చేరుకుంటారు. ప్రాస్పెరోకు వాళ్లతో అవసరం వుంది.

పన్నెండేళ్ల క్రితం అతడు డ్యూక్ ఆఫ్ మిలాన్. సోదరుడు, దుష్టబుద్ధి ఆంటోనియో, నేపుల్స్ రాజు సహాయంతో అతణ్ణి రాజ్యభ్రష్టుణ్ణి చేశాడు. ప్రాస్పెరో, కూతురూ సముద్రంలో చావాలని ఒక చిన్న పడవలో వదిలేశారు. కాని ఒక అనుచరుడు పడవమీద సరిపడినంత భోజనం, ప్రాస్పెరోకు ప్రాణప్రదమైన ఇంద్రజాల గ్రంథాలు సమకూర్చాడు. చివరకు అనేక రోజుల ప్రయాణం తర్వాత తండ్రీ కూతుళ్లు ఈ ద్వీపానికి చేరుకున్నారు. ఇప్పుడు, పన్నెండేళ్ల తర్వాత, నేపుల్స్‌రాజు, డ్యూక్ ఆఫ్ మిలాన్ మళ్లీ అదే ద్వీపానికి చేరుకున్నారు.

ప్రాస్పెరోకో సేవకుడున్నాడు. పేరు ఏరియల్. అతడు ఒక అశరీరజీవి. పైన్ వృక్షంమీద వేళ్లాడుతుండేవాడు. తన మాట విననందుకు కోపగించిన ఒక మంత్రగత్తె అతణ్ణిక్కడ బంధించింది. ప్రాస్పెరో వచ్చి ముక్తి ప్రసాదించాడు. ఆ ద్వీపంమీది మరొకజీవి, మంత్రగత్తె కొడుకు జంతురూపంలో ఉన్న కాలిబాన్. ప్రాస్పెరో ఎంత ప్రయత్నించినా అతడికి మనిషి ఆకారం రాలేదు. కాలిబాన్‌కు భాష నేర్పించి తమతోనే ఉండనిచ్చాడు ప్రాస్పెరో.

కాలిబాన్ కృతఘ్నుడు. మిరాండాకు ఒకసారి కీడు తలపెట్టాడు. ప్రాస్పెరో మంత్ర ప్రభావంతో వాణ్ణి బానిసగా మార్చి తన అధీనంలో వుంచుకున్నాడు. ప్రతీకారవాంఛతో రగిలి పోతున్నాడు కాలిబాన్. వీడెంత దుర్మార్గుడో, ఏరియల్ అంత సౌమ్యుడు. స్నేహశీలి. తన ఆజ్ఞలు పాటిస్తే త్వరలో స్వేచ్ఛను ప్రసాదిస్తానని ప్రాస్పెరో వాగ్దానం చేశాడు.

ప్రమాదంలో చిక్కుకున్న వాళ్లందర్నీ క్షేమంగా ఒడ్డుకు చేరవేశాడు ఏరియల్. నౌక కూడా క్షేమంగానే ఉంది. నావికులు నిద్రలో ఉన్నారు. ప్రయాణీకులు ద్వీపం మీద తిరుగుతున్నారు. రాజుగారి కుమారుడు ఫెర్డినాండ్ తనొక్కడే బతికి బయట పడ్డాననుకుని దుఃఖిస్తున్నాడు. అతణ్ణి తీసుకురమ్మని ఏరియల్‌ను పంపిస్తాడు ప్రాస్పెరో.

మంత్ర ప్రభావంతో మిరాండా నిద్రపోతుంది. కట్టెలు కొట్టుకురమ్మని కాలిబాన్‌ను ఆజ్ఞాపిస్తాడు ప్రాస్పెరో. యజమానినీ, అతడి కూతుర్నీ తిట్టుకుంటూ కదుల్తాడు కాలిబాన్. ప్రాస్పెరో రాకముందు తానే ఈ ద్వీపానికి రాజు. ఇప్పుడు బానిస. "మిరాండాకు అపకారం తలపెట్టకపోతే నిన్ను కూడా బాగానే చూసేవాణ్ణి" అంటాడు ప్రాస్పెరో. "మళ్లీ అవకాశం

రాకపోదు." అని సణుక్కుంటాడు కాలిబాన్. కాని— స్వేచ్ఛ లభించినప్పుడు కదా!

గానం చేస్తూ ఏరియల్ ప్రవేశిస్తాడు. ఆ గానానికి ముగ్ధుడై ఫెర్డినాండ్ అనుసరిస్తాడు. సముద్రపుటలల గురించీ, ఆ తర్వాత మరణించిన ఒక రాజు గురించీ పాడతాడు ఏరియల్.

కూతురికి మెలకువ తెప్పిస్తాడు ప్రాస్పెరో. తన తండ్రిని కాక, మరో పురుషుణ్ణి చూడడం ఈ పన్నెండేళ్లలో అదే ప్రథమం. అంత సమ్మోహన రూపాన్ని ఎప్పుడూ చూడలేదనుకుంటుంది. ఆమె సౌందర్యానికి ముగ్ధుడవుతాడు ఫెర్డినాండ్. 'నువ్వు గూఢచారివి' అని బంధించినట్టు నటిస్తాడు ప్రాస్పెరో. ఆకులలములు, సముద్రపు ఉప్పునీరు మాత్రమే ఆహారంగా ఇస్తూంటాడు. తన తండ్రి నిజానికి అంత క్రూరంగా ఉండదంటుంది మిరాండా. పిల్లలిద్దరూ ప్రేమలో పడ్డారని గ్రహిస్తాడు ప్రాస్పెరో. ఏరియల్‌కు ఏదో పని అప్పగిస్తాడు.

ద్వీపంలో, మరోచోట, కొడుకు మరణించినందుకు దుఃఖిస్తున్నాడు నేపుల్స్‌రాజు. ఆంతరంగికుడు గోంజాలో కూడా యజమానిని ఓదార్చలేడు. ఒకప్పుడు అతడు ప్రాస్పెరోను కూడా రక్షించాడు. ద్వీపంలో తాము సుఖంగానే గడపగలమని అతడి విశ్వాసం.

అశరీరుడైన ఏరియల్ సృష్టించిన సంగీత ధ్వనులతో అందరికీ నిద్ర ముంచుకు వస్తుంది. నేపుల్స్ రాజ సోదరుడూ, (ఆంటోనియో) ప్రాస్పెరో సోదరుడు-ఇద్దరు దుష్టులు-కుట్రలు చేస్తుంటారు. సోదరుణ్ణి హత్యచేస్తే తానే నేపుల్స్‌కు రాజు కావచ్చునని కలలుగంటాడు ఆంటోనియో. గొంజాలోను కూడా చంపాలి. అప్పుడిక తనకెదురుండదు.

ఇద్దరు సైనికులు కత్తులు దూసి చంపటానికి సిద్ధమవుతారు. అంతలోనే వాళ్లకు సింహగర్జనలు వినిపిస్తాయి. రాజూ, గొంజాలో నిద్రలేస్తారు. (ఏరియల్ వాళ్లను లేపుతాడు).

మరోవైపు కాలిబాన్‌కు ప్రాస్పెరో మీద ద్వేషం రగిలి పోతున్నది. అతడు ద్వీపం మీదికి ఎవరెవర్నో తీసుకొచ్చి తనను హింసిస్తున్నాడు. అటుగా వచ్చిన రాజుగారి విదూషకుడు ట్రింకూలోను చూసి రక్షించమంటూ కాళ్లావేళ్లా పడతాడు. వాడి ఆకారం చూసి విదూషకుడికి నవ్వొస్తుంది. ఇలాంటి జీవిని ఇంగ్లండుకు తీసికెడితే ప్రదర్శనలో పెట్టొచ్చు. అయితే అదంతా తిరిగి వెళ్లినప్పటిమాట. ప్రస్తుతం ఈ కీకారణ్యంలో వర్షం తన బతుకు దుర్భరం చేసేట్టుంది. వెళ్లి కాలిబాన్ దుస్తుల్లో దాక్కుంటాడు.

ఈలోగా అతడి మిత్రుడు ఒకనాటి రాజ సేవకుడు స్టెఫానో వస్తాడు. అతడు సారా పీపాను పట్టుకుని ఒడ్డుకు చేరుకున్నాడు. ప్రస్తుతం పీకలదాకా తాగున్నాడు. ఈ నాలుగు కాళ్ల వింత జంతువును చూసి ఆశ్చర్య పడతాడు. దగ్గరకెళ్లి తట్టి చూస్తే తెలుస్తుంది-అందులో సగం తన మిత్రుడు ట్రింకూలో. ఇద్దరూ కలసి నాట్యం చేస్తారు. కాలిబాన్‌కు కూడా కాస్త సారా తాగిస్తారు. మద్యం తాగిన కాలిబాన్ తన కొత్త యజమాని

కాళ్ళ దగ్గర పడుంటానంటాడు. కనీసం ఇలాగైనా ప్రాస్పెరో నుండి విముక్తి దొరికింది.

ఈలోగా ఫెర్డినాండ్‌కు మరో పని అప్పచెబుతాడు ప్రాస్పెరో. సాయంత్రంలోగా కట్టెలన్నీ ఒకచోట పోగు చెయ్యాలి. తండ్రి విశ్రాంతి తీసుకోవటానికి నిష్క్రమించగానే మిరాండా వచ్చి తను సాయం చేస్తానంటుంది. కాని ఇద్దరూ కలిసి ప్రేమ కబుర్లలో పడి అసలు పని మరచిపోతారు. దూరం నుండి ఇదంతా గమనించిన ప్రాస్పెరో ముసిముసిగా నవ్వుకుంటాడు.

ప్రస్తుతం స్టెఫానోకి ఓ చిక్కు వచ్చి పడింది. కాలిబాన్‌కు తనంటే భక్తి. కాని ట్రింకూలో అంటే కోపం. వాడికి ఎవరి మీద కోపం వచ్చినా చంపాలనిపిస్తుంది. ప్రాస్పెరోను చంపటానికి వెంటరమ్మని వేడుకుంటాడు. తలకాయ పగలగొట్టి కూతుర్ని బంధించి, పుస్తకాలు తగలబెట్టి తామే ద్వీపానికి రాజులమని ప్రకటించుకోవచ్చు.

అశరీరుడైన ఏరియల్ ఈ సంభాషణ విని కాలిబాన్‌ను లొంగదీసుకొనటానికి రాగం ఆలాపిస్తాడు. కాని చాలా కాలంగా మంత్ర ధ్వనులను విన్న కాలిబాన్ మీద దాని ప్రభావం ఉండదు.

ఏరియల్ నేపుల్స్ రాజపరివారం వద్దకు ఎగిరి పోతాడు. వాళ్లంతా తప్పిపోయిన రాజకుమారుడి కోసం వెదుకుతున్నారు. వాళ్లకొక మాయా భోజనం సమకూరుస్తాడు ఏరియల్. తినటానికి ప్రయత్నించినప్పుడు భోజనం అదృశ్యమవుతుంది. ప్రాస్పెరోకు హాని తలపెట్టిన ముగ్గురికీ గతం జ్ఞాపకం చేస్తాడు.

కూతురికీ, అల్లుడికీ పెళ్లి దుస్తులు తయారుచేస్తాడు ప్రాస్పెరో. సెరెస్, ఐరిస్, జూనో అనబడే ముగ్గురు దేవతలు నూతన వధూవరులను ఆశీర్వదించటానికి తరలి వస్తారు. (ఇక్కడ, ప్రాస్పెరో మంత్రజాలంవల్ల కాకపోయినా, షేక్స్పియర్ కవితా మహిమకు ప్రేక్షకులు ముగ్ధులవుతారు.)

పెళ్లి ముగిసింది. ప్రాస్పెరోకు తెలుసు ద్వీపాన్ని, మాజిక్‌ను వదిలి జనం మధ్యకు వెళ్లిపోక తప్పదని.

తన మంత్ర ప్రభావంతో అందరి కుయుక్తుల్ని భగ్నం చేస్తాడు. తన శత్రువులకు విధించిన శిక్ష ఇక చాలనుకుంటాడు. కాలిబాన్ తను మహా మూర్ఖుణ్ణని గ్రహిస్తాడు. ఆంటోనియో పశ్చాత్తాపపడి, రాజ్యాన్ని తిరిగి తన సోదరునికి అప్పగిస్తాడు.

నేపుల్స్ రాజు కూడా క్షమించమంటాడు. తప్పిపోయిన కుమారుడు తిరిగి దొరుకుతాడు. కొత్త కోడలు మిరాండాను ఆప్యాయంగా ఆహ్వానిస్తాడు.

అందరూ నేపుల్స్‌కు ప్రయాణమయినప్పుడు సముద్రాన్ని ప్రశాంతంగా ఉంచుతాడు ఏరియల్. ప్రాస్పెరో అతడికి ముక్తి ప్రసాదిస్తాడు.

ఆనందంగా, గానధ్వనుల మధ్య ఏరియల్ ఎగిరి పోతాడు.



# 15. టైటస్ ఆండ్రోనికస్

ఇది షేక్స్‌పియర్ రాసిన తొట్టతొలి ట్రాజెడీ. ప్రారంభ రచయితలు చేసే పొరపాట్లు యిందులో కూడా కనిపిస్తాయి. నాటకమంతా హత్యల పరంపర. ప్రతిసీనులో శిరచ్ఛేదాలు, చిత్రహింసలు. షేక్స్‌పియర్ కాలంలో యిది బాగా ప్రేక్షకాదరణ పొందింది. చవకబారు కథల్లో వుండే అర్థంపర్థంలేని మెలొడ్రామా దీన్నిండా వుంది. తరువాతి అనర్ఘరత్నాలతో పోలిస్తే యిది తేలిపోతుంది గాని, రచయిత జీనియస్ అక్కడక్కడా దర్శనమిస్తుంది.

గోత్‌లను పరాజితులను చేసి రోమన్ సైన్యాధిపతి టైటస్ ఆండ్రోనికస్ నగరానికి తిరిగి వస్తున్నాడు. వెంట గోత్‌ల దుష్టరాణి టమోరానూ, మరో దుష్టుడు ఏరన్ అనబడే మూర్‌నూ బందీలుగా పట్టుకొస్తున్నాడు. టమోరా పెద్దకొడుకును బలివ్వమని ఆజ్ఞాపిస్తాడు టైటస్. వాణ్ణి ముక్కలుగా నరికి యుద్ధంలో మరణించిన తన కుమారుల చితిమీద పేర్చాలి. పగబట్టిన టమోరా, ఏరన్‌తో కలిసి రోమ్‌ను 'పులులు తిరుగాడే అడవి'గా మార్చేస్తుంది.

ఆమె పగ సాధించేనాటికి, టైటస్‌కు బాధతో పిచ్చెక్కినట్టవుతుంది. అతడి అల్లుణ్ణి పొడిచి గోతిలో పడేస్తారు. ఇద్దరు కొడుకుల తలలు నరికేస్తారు. టైటస్ చెయ్యి తెగిపోతుంది. కూతురు లావినియాను రేప్ చేసి గాయపరుస్తారు. ఆమె చేతులు నరికి నాలిక పీకేస్తారు. అఘాయిత్యం చేసిందెవరో నోటితో చెప్పలేదు లావినియా. చివరికి

..క కత్రతో యినుకలో వాళ్ల
..ర్లు రాస్తుంది. నేరస్థులు
..మోరా కొడుకులు.

ఇప్పుడు ప్రతీకారం తీర్చు
..వటం టైటస్ వంతు. ఆమె
కొడుకులిద్దర్నీ నరికేస్తాడు.
నెత్తురు పట్టటానికి లావినియా
పళ్లెంతో నిలుచుంటుంది.
వాళ్ల ఎముకలు పిండిచేసి
టమారా నోట్లో కుక్కుతాడు.
అప్పటికే చక్రవర్తిని పెళ్లాడిన
ఆమెను చంపేస్తాడు. చక్రవర్తి
టైటస్‌ను చంపుతాడు. టైటస్
కొడుకు చక్రవర్తిని చంపే
స్తాడు.

అప్పటికి గాని నెత్తుటి
వరదలు ఆగవు. ఏరన్‌కు శిక్ష
వేస్తాడు లూసియస్. మరణిం
చిన వాళ్లందర్నీ సమాధి చేస్తా
డు. తను రోమ్ కొత్త గవర్నర్
గా అధికారం స్వీకరిస్తాడు. ఇక
అప్పుడు నగరంలో శాంతి
మళ్లీ తొంగిచూస్తుంది.





# 16. రోమియో అండ్ జూలియెట్

షేక్స్‌పియర్ రాసిన గొప్ప విషాదాంతనాటకం రోమియో అండ్ జూలియెట్. వారిరువురూ ప్రేమకు మారుపేరుగా మిగిలిన నాయికానాయకులు.

కథాప్రదేశం ఇటలీలోని వెరోనా నగరం. రెండు సంపన్న కుటుంబాలు - కాపులెట్స్, మాంటేగ్‌ల మధ్య దీర్ఘకాలంగా వైరం కొనసాగుతున్నది. అప్పటికే మూడుసార్లు భయంకరంగా పోరు జరిగింది. నాలుగో పోట్లాటతో నాటకం ప్రారంభమవుతుంది. కాపులెట్స్ మనుషులు ఈ సారి గొడవకు కారణం. చివరికి వెరోనా రాకుమారుడి రాకతో పరిస్థితి చక్కబడుతుంది. ఈ నిత్య యుద్ధాలతో రాకుమారుడు విసుగెత్తిపోయాడు. ఇకముందు ఎవరైనా వీధుల్లో అల్లరి సృష్టిస్తే మరణశిక్ష విధించబడుతుందని ఆజ్ఞలు జారీ చేస్తాడు.

మాంటేగ్ సంతతి వాడు రోమియో. ఈ యుద్ధంలో పాల్గొనలేదు. ఊరికి పశ్చిమాన సైకమోర్ వనంలో ఒంటరిగా తిరుగుతున్నాడు. రోమియో వుదాసీనతను తల్లిదండ్రులు భరించలేరు. ఉత్సాహంగా నవ్వుతూ, తుళ్లుతూ తిరగవలసిన కుర్రవాడి మొహంలో విషాదమెందుకు? వాడి కజిన్ బెన్‌వోలియోను కారణం తెలుసుకురమ్మని పురమాయిస్తారు. రోమియో, రోసాలైన్ అనే సుందరితో ప్రేమలో పడ్డాడు. కాని ఆ అమ్మాయికి యితడంటే ప్రేమలేదు. రోమియో మరో ప్రియురాల్ని చూసుకోవటం మంచిదని బెన్‌వోలియో సలహా.

ఇక కాపులెట్స్ యింటికథ. ఇంటి యజమానికి రాకుమారుడి ఆజ్ఞ పూరట కలిగించింది. వయసు పైబడింది. కలహాలు పెట్టుకునే ఓపిక నశించింది. రాజబంధువు పారిస్ అక్కడే వున్నాడు- తన ముద్దుల కూతురు జూలియెట్ మీద మనసు పడ్డాడు. ఆ పిల్లకింకా పద్నాలుగేళ్లే. అప్పుడే పెళ్లిచేసి పంపించటం తండ్రికి ఇష్టం లేదు. అయినా పారిస్ మీది మక్కువతో "మొదట దాని మనసు నీ వైపు మళ్లించుకో" అని సలహా యిస్తాడు. ఆ సాయంత్రం యింట్లో విందు జరగబోతున్నది. అదొక మంచి అవకాశం.

అతిథులందరికీ ఆహ్వానాలు అందించమని సేవకుడిని ఆజ్ఞాపిస్తాడు కాపులెట్. కాని వాడికి చదువు రాదు. లిస్టులో పేర్లు చదవలేడు. చదివిపెట్టే వాళ్లకోసం వెదుకుతున్నప్పుడు రోమియో తారసపడతాడు. రోసాలైన్ కూడా ఆహ్వానితుల్లో వుందని తెలుసుకుంటాడు. రోమియో: ఒకర్ని మించినవాళ్లు ఒకరు. మరెందరో సుందరాంగులు వస్తారు విందుకు" అంటాడు బెన్‌వోలియో.

జూలియెట్ తల్లికి పారిస్ ప్రేమ విషయం తెలుస్తుంది. కూతురి మనసు కూడా తెలుసుకోవాలి మరి. పిలుచుకు రమ్మని ఆయాను పంపిస్తుంది.

ఈ ఆయా గొప్ప హాస్యపాత్ర. ఎప్పుడూ వసపిట్టలా వాగుతుంటుంది. పెళ్లి వ్యవహారాలంటే మహా వుత్సాహం. మంచి మనసు. అందరికీ సాయం చేస్తుంటుంది. జూలియెట్ మాట రాగానే పొత్తిళ్లనాటి కబుర్లన్నీ ఏకరువు పెడుతుంది. ఆమె వాక్ప్రవాహానికి అడ్డుకట్ట వెయ్యటం ఎవరి తరమూ కాదు. చివరికి తల్లినోట పారిస్ ప్రస్తావన వచ్చినప్పుడు "చూద్దాంలే" అంటుంది జూలియెట్.

సాయంత్రం. ఆహూతులు ఒక్కొక్కరే వస్తున్నారు. కొందరు పిలవని పేరంటంగా వచ్చిన వాళ్లూ వున్నారు. అది ఫాన్సీ డ్రెస్ పార్టీ లాంటిది. అందరూ మొహాలకు ముసుగులు తగిలించుకున్నారు. ఆ వచ్చిన వాళ్లలో యిద్దరికి మాత్రం ముసుగులు తప్పని సరి- వాళ్లు రోమియో, బెన్‌వోలియో- కాపులెట్ వంశానికి శత్రువులు. మాంటేగ్ వంశీకులు. వాళ్ల వెంట మరో రాకుమారుడు మెర్క్యూషియో కూడా వచ్చాడు.

మెర్క్యూషియో మరో వాగుడుకాయ. హాస్యోక్తులతో శ్రోతల్ని నవ్విస్తుంటాడు. భగ్న ప్రేమికుడు రోమియో యితర అతిథులతో డాన్సు చెయ్యటానికి నిరాకరించాడు.

రోమియోను ఎలాగైనా వుల్లాస పరచాలని మెర్క్యూషియో ప్రయత్నం.

క్రితం రాత్రి దుస్స్వప్నం వచ్చిందని చెబుతాడు రోమియో. మెర్క్యూషియో కలల గురించి చర్చ ప్రారంభిస్తాడు- అతడి ప్రకారం కలలకు కారణం క్వీన్‌మాబ్ అనే అప్సరస. మనుషులు నిద్రావస్థలో వున్నప్పుడు, సన్నటి రెక్కల పురుగులాగున పెసరగింజంత రథంలో నాసిక మీద ఆమె విహరించినప్పుడు వస్తాయి కలలు.

భోజనానికి ఆలస్యమవుతున్నది. అయినా మెర్క్యూషియో కబుర్లు ఆపడు. మరికాసేపట్లో డాన్సు ప్రారంభం కాబోతున్నది. లార్డ్ కాపులెట్ అతిధులకు స్వాగతం పలుకుతాడు. మొదట స్త్రీలందర్నీ డాన్సుకు ఆహ్వానిస్తాడు. వాయిద్యగాళ్లకు సూచనలిస్తాడు. తను డాన్సు చెయ్యలేడు. వృద్ధుడు. గడచిన రోజుల్ని నెమరేసుకోవటం తప్ప మరేం మిగల్లేదు.

రోమియో కళ్లు రోసాలైన్ కోసం వెదుకుతుంటాయి- అప్పుడు కనిపిస్తుంది జూలియెట్. ఆమె అందం ముందర అక్కడి దివ్వెటీల వెలుగు వెలవెల పోతుంది. ఇంకెక్కడి రోసాలైన్. ఆ క్షణమే రోమియో మనసును జయించింది జూలియెట్. ఆమె పేరేమిటని పరిచారకుణ్ణి ప్రశ్నిస్తాడు రోమియో.

కాని రోమియో ప్రశ్న కాపులెట్ వంశానికి చెందిన టైబాల్ట్ అనే యువకుడికి వినిపిస్తుంది. వీధి యుద్ధాలు చేసేదే టైబాల్ట్. మాంటేగ్ వంశం పట్ల ఎనలేని ద్వేషం. శత్రువు వచ్చినందుకు కత్తిదూస్తాడు. కాని పార్టీలో గొడవ జరగటం యజమానికి యిష్టం లేదు. టైబాల్ట్‌ను ఓపిక పట్టమంటాడు.

డాన్సు ముగుస్తుంది. జూలియెట్ వేపు కదులుతాడు రోమియో-తీర్థయాత్రికుని వేషంలో వున్నాడు. తన యిష్టదేవత యిక్కడ ప్రత్యక్షమైంది. ముద్దు పెట్టుకోవాలని కోరిక: కొంత చతుర సంభాషణ తర్వాత జూలియెట్ అంగీకరిస్తుంది. ఆ తర్వాత తల్లి పిలుపు విని నిష్క్రమిస్తుంది. ఆమె తమ శత్రు వంశీకురాలని ఆయా ద్వారా తెలుసుకుంటాడు రోమియో.

దూరంగా వెళ్లి క్రీగంట చూస్తూ నిల్చుంటుంది జూలియెట్. తనను ముద్దు పెట్టుకున్న కుర్రవాడికోసం వెదుకుతున్నాయి కళ్లు. రోమియోల వంశానికీ తమకూ వైరమని ఆయా ద్వారా జూలియెట్ కూడా గ్రహిస్తుంది.

రోమియో కదలాలన్నా అడుగులు పడవు. జూలియెట్ తన మనసు దోచుకున్నది. కాస్త దూరం వెళ్లినవాడల్లా ప్రహరీ గోడదూకి మళ్లీ చాపులె యింటి ఆవరణలోకి ప్రవేశిస్తాడు.

జూలియెట్‌కు నిద్రపట్టదు. పడకగదిలోంచి బాల్కనీలోకి వచ్చి నిల్చుంటుంది. రోమియో పైకి చూస్తాడు. చీకట్లో సూర్యోదయం. ప్రేమ కాంతిలో వెలిగిపోతున్న జూలియెట్. (ప్రపంచ సాహిత్యంలోని అత్యంత ప్రసిద్ధమైన బాల్కనీ సీనుయిదే) తరతరాల ప్రేమికులు మాట్లాడాలనుకుని, మాట్లాడలేని ప్రేమ పలుకులన్నీ వల్లిస్తారు రోమియో,

జూలియెట్- చీకటి రాత్రిలో, చంద్రవంక సాక్షిగా. తమ కుటుంబాల మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుందన్న విషయమే వాళ్లకు స్ఫురణకు రాదు. ఒకసారి మాత్రం రోమియో గురించి భయం వేస్తుంది జూలియెట్‌కు.

విడిపోయే ముందు ఓ అంగీకారం చేసుకుంటారు. రహస్యంగా పెళ్లి జరిగిపోవాలి. ఎక్కడ, ఎలా కలవాలి అన్న విషయాలు తెలుసుకోవటానికి తెల్లవారి తొమ్మిందింటికి జూలియెట్ ఒక అంతరంగికుణ్ణి పంపిస్తుంది. యువకులు. ప్రేమికులు. ఒక్కరోజు కూడా జాప్యం జరగటానికి వీల్లేదు.

ఫ్రయర్ లారెన్స్ అనబడే క్రీస్తును కలుస్తాడు రోమియో. అతడి రహస్యాలన్నీ లారెన్సుకు తెలుసు. పెళ్లి జరిపిస్తానంటాడు. కనీసం పిల్లల పెళ్లితోనైనా రెండు కుటుంబాలూ కక్షల్ని మరిచి పోగలవేమోనని ఆశ.

బెన్‌వోలియో, మెర్క్యూషియోలు తమ మిత్రుడు రోమియో కోసం వెదుకుతున్నారు. ఇంటికెళ్లి తండ్రిని అడుగుతారు. కొడుకెక్కడున్నాడో అతడికీ తెలియదు. టైబాల్ట్ రాసిన వుత్తరం కనిపిస్తుందక్కడ- రోమియోను అతడు డ్యూయెల్(కత్తియుద్ధం)కు ఛాలెంజి చేశాడు. టైబాల్ట్ అహంకారి. మెర్క్యూషియోకు అతడంటే యిష్టం లేదు.

రోమియో ప్రవేశం. ఉత్సాహంగా వున్నాడు. మరోవైపు మెర్క్యూషియో అందర్నీ ఆటపట్టిస్తున్నాడు. ముఖ్యంగా లావుపాటి ఆయాను. రోమియో ఆయాకు సాయం పోతాడు. మొత్తం మీద ఆమెను సానుకూలం చేసుకుని జూలియెట్‌కు సందేశం పంపిస్తాడు. ఆ మధ్యాహ్నం లారెన్స్ నివాసంలో పెళ్లి.

పొద్దున తొమ్మిదింటికి వెళ్లిన ఆయా యింకా తిరిగి రాలేదు. జూలియెట్ నిరీక్షిస్తున్నది. ఆయా వస్తుంది గాని ఏ విషయమూ చెప్పదు. ఒళ్లు నొప్పులుగా వుందనీ, కాళ్లు పీకుతున్నాయనీ సోది మొదలెడుతుంది. జూలియెట్‌కు సమాచారం కావాలి. ఆయాకు సానుభూతి కావాలి. (ఈ సీను ప్రేక్షకులను కడుపుబ్బ నవ్విస్తుంది.).

అనుకున్నట్టుగా ఆ మధ్యాహ్నం రోమియో, జూలియెట్‌ల వివాహం జరిగి పోతుంది. వీళ్లిద్దరూ పెళ్లికెందుకింత తొందర పడ్డారో లారెన్స్‌కు అర్థం కాదు. రోమియో దేనికీ భయపడడు-మృత్యువుకైనా. జూలియెట్ తనదైనప్పుడు మరిదేనికి భయం!

వెరోనా నగర వీధుల్లో నడుస్తున్నారు మెర్క్యూషియో, బెన్‌వోలియో. ప్రధాన కూడలిలో దృశ్యం. మెర్క్యూషియోను నీడలోకి పదమంటాడు బెన్‌వోలియో. ఎండ మండి పోతున్నది. ఇంత వేడితో మనుషులు సహనాన్ని కోల్పోతారు. ఉత్తినే పోట్లాటలు వస్తాయి. మిత్రుడి మాటలకు నవ్వుతాడు మెర్క్యూషియో. అవసరమైతే యుద్ధం చెయ్యగల సత్తా తనకుందని వాదనలోకి దిగుతాడు.

బెన్‌వోలియో భయపడినంతా జరిగింది. రోమియోను డ్యూయెల్‌కు ఛాలెంజ్ చేస్తూ టైబాల్ట్ దర్శనమిస్తాడు. మెర్క్యూషియోతో తగువు లేదు (అతడు మాంటేగ్ కాదు.).

రోమియో ప్రవేశం. అతడికి టైబాల్ట్‌తో కయ్యానికి దిగాలని లేదు. టైబాల్ట్ ఎత్తిపొడుస్తాడు. అయినా రోమియో కత్తి దూయడు. టైబాల్ట్, జూలియట్‌కు వరుస అన్న. తన ప్రియురాలి బంధువులతో ఎలా యుద్ధం చెయ్యగలడు? మిత్రుడు యింత అవమానాన్ని భరిస్తున్నందుకు మెర్క్యూషియోకు కోపం వస్తుంది. టైబాల్ట్‌తో డ్యూయెల్‌కు తను రెడీ.

ఇద్దర్నీ విడదియ్యటానికి ప్రయత్నిస్తాడు రోమియో. టైబాల్ట్ కత్తితో తన చెయ్యి చీరుకుపోతుంది. తీవ్రగాయంతో మెర్క్యూషియో మరణిస్తాడు.

తనకోసం మెర్క్యూషియో ప్రాణత్యాగానికి సిద్ధపడ్డాడు. రోమియో ఖడ్గం తీసుకుని ముందుకు లంఘిస్తాడు. టైబాల్ట్ నేలకొరుగుతాడు.

రెండు శవాలను చూసి రోమియో నిశ్చేష్టుడవుతాడు. ఎంత పని జరిగింది. జూలియెట్ బంధువును చంపాడు. అంతేకాదు. వెరోనా రాకుమారుడి ఆజ్ఞను వుల్లంఘించాడు. బెన్‌వోలియో రోమియోను దూరంగా తీసుకుపోతాడు. రాకుమారునికి ఘటనాక్రమం వివరిస్తాడు. కాని యిది క్షమార్హమైన నేరం కాదు. మరణశిక్షకు బదులుగా నగర బహిష్కరణ. తెల్లారేలోగా రోమియో వెరోనా విడిచి వెళ్లిపోవాలి. మళ్లీ ఎప్పుడూ తిరిగి రాకూడదు.

జూలియెట్ నిరీక్షిస్తున్నది. పొద్దుగుంకితే భర్త తన చెంత వాలుతాడు. ఆయా వచ్చి టైబాల్ట్ మరణవార్త వినిపిస్తుంది. జూలియెట్ బాధపడుతుంది. రోమియోను చూడాలంటుంది. ఆయా వెదికి వెదికి అతణ్ణి లారెన్స్ నివాసంలో కనుగొంటుంది. రోమియో పశ్చాత్తాపంతో, బాధతో తల్లడిల్లిపోతున్నాడు. టైబాల్ట్‌ను చంపినందుకు జూలియెట్ తననెంత అసహ్యించుకుంటుందో! ఆయా మాటలు విని కొంత వుపశమనం కలుగుతుంది. కనీసం ఒక్క రాత్రైనా తాము కలిసి వుండగలరు.

రాత్రి గడిచింది. పక్షుల కిలకిలా రావాలతో ప్రకృతి పులకరించింది. రోమియో వెళ్లిపోవాలి- శాశ్వతంగా. తెలవారలేదు. ఇప్పటిదాకా కూసింది నైటింగేల్ కాదూ!

రోమియో నిష్క్రమణ. అప్పుడే జూలియెట్ తల్లి మరొక వార్త తీసుకొస్తుంది. వచ్చే గురువారమే జూలియెట్, పారిస్‌లకు పెళ్లి నిశ్చయించారు.

జూలియెట్ మంచి పిల్లే. కాని యిటీవల జగమొండిగా తయారైంది. తెచ్చిన సంబంధాలన్నీ నిరాకరిస్తుంది. ఆమె తండ్రికి కోపంగా వుంది. జూలియెట్ తల్లికి చెప్పుకొని ఏడుస్తుంది. కాని పారిస్ లాంటి కుర్రాడు మళ్లీ దొరుకుతాడా?

చివరికి, ఆయాతో తన కష్టాలు చెప్పుకుంటుంది జూలియెట్. ఆయా లోకంపోకడ తెలిసిన మనిషి. ఇప్పుడు రోమియో లేడు గదా. పారిస్‌ను చేసుకుంటేనేం? ఈ యింట్లో తన మాట వినేవాళ్లెవరూ లేరని తెలిసిపోయింది. జూలియెట్‌కు చివరి ఆశ లారెన్స్. అతడూ సహాయం చెయ్యలేకపోతే యిక మరణమే శరణ్యం.

లారెన్స్ దగ్గర ఓ వుపాయం వుంది. కాస్త ప్రమాదమే. కాని ఆత్మహత్యంత ప్రాణాంతకం

కాదు. ఒక రసాయనం తాగితే మనిషికి నలభైరెండు గంటలు మృత్యుకళ వచ్చేస్తుంది. మరణించినవాళ్లను ఖననం చెయ్యకుండా కొంతకాలం సమాధి గృహాల్లో వుంచటం వెరోనాలోని ఒక ఆచారం. ఆ తర్వాత వుత్తరం రాస్తే రోమియో వస్తాడు. ఇద్దరూ కలసివెళ్లి మంటువా నగరంలో సుఖంగా గడపొచ్చు.

వివాహానికి జూలియెట్ అంగీకరించిందని లారెన్స్ ద్వారా తెలుసుకుని ఆనందిస్తాడు ఆమె తండ్రి. మరో విందుకు ఏర్పాట్లు ప్రారంభమవుతాయి.

ఎవరికీ అనుమానం రాకుండా జాగ్రత్త పడుతుంది జూలియెట్. ఆ చిన్నపిల్ల ఉద్వేగాల్ని దాచుకోలేదు. ఎవర్నీ నమ్మటానికి లేదు. లారెన్సును కూడా. చట్ట వ్యతిరేకంగా జరిపిన పెళ్లి రహస్యం నలుగురికీ తెలిసిపోతుందని, రసాయనం పేరుతో విషమిచ్చి తాగమంటున్నాడేమో.

ప్రసిద్ధ పోషన్ (రసాయన) సీన్ యిదే. జూలియెట్ స్వగతం. మృత్యువు తనను ఆహ్వానిస్తున్నట్టుగా, రక్తసిక్తమైన టైబాల్ట్ దయ్యం రోమియోను చంపటానికి వురికినట్టుగా, సమాధి తలుపులు తెరుచుకొంటున్నట్టుగా పలు రకాల వూహలు. చివరికి అది తాగేసి మంచంమీద వాలి పోతుంది.

ఇంటినిండా పెళ్లి హడావిడి. లేపటానికి వచ్చిన ఆయా, శవంలాగ పడున్న జూలియెట్‌ని చూసి నిర్ఘాంతపోతుంది. రోదనలతో యిల్లు ప్రతిధ్వనిస్తుంది. ఇక జరిగేది పెళ్లి కాదు. చావు. జూలియెట్ "శవాన్ని" సమాధి గృహానికి చేరుస్తారు.

మంటువా నగరంలో, రోమియో వెరోనా నగర వార్తలకోసం వేచిచూస్తున్నాడు. ముఖ్యంగా జూలియెట్ గురించి తెలుసుకోవాలని పరిచారకుడు సమాచారం చేరవేస్తాడు– చావు కబురు చల్లగా. జూలియెట్ మరణించింది. రోమియో మొహంలో మృత్యుకళ వస్తుంది. పరిచారకుడితో బాగానే వుంటాడు గాని, ఏకాంతంలో, "జూలియెట్, ఈ రాత్రి నీతో పాటే నాకు దీర్ఘనిద్ర" అని నిర్ణయించుకుంటాడు. ఆమె లేకుండా తను బతక లేడు. ఒక మందుల కొట్లో విషం కొనుక్కుని వెరోనాకు పయనమవుతాడు.

జూలియెట్ వుదంతమంతా రాసి రోమియోకు లేఖ పంపించాడు లారెన్స్. కాని వూళ్లో ప్లేగుందని తెలుస్తుంది. ఆ వుత్తరం రోమియోకు చేరదు. మరొక మూడు గంటల్లో జూలియెట్‌కు స్పృహవస్తుంది. విశ్వసనీయులెవరూ లేరు గనక తను స్వయంగా వెళ్లి జూలియెట్‌ను కలవాలనుకుంటాడు లారెన్స్.

రాత్రి. చర్చి ప్రాంగణం. కాపులెట్స్ సమాధుల వద్ద యూ చెట్లకింద శోకించటానికి వస్తాడు పారిస్. జూలియెట్ సమాధిమీద వుంచటానికి పుష్పగుచ్ఛం కూడా తెచ్చాడు. ఎవరూ రాకుండా చూడమని పరిచారకుణ్ణి నియమిస్తాడు.

ఎవరో వస్తున్నారని సంకేతంగా పరిచారకుడు ఈల వేస్తాడు. పారిస్ ఆశ్చర్యంగా చూస్తాడు. రోమియో గునపంతో సమాధి తెరవటానికి ప్రయత్నిస్తున్నాడు.

పారిస్ దృష్టిలో రోమియో నేరస్తుడు. జూలియెట్ సమీప బంధువును హత్యచేసి, ఆ సుకుమారి మనసును గాయపర్చాడు. రోమియోను బంధించటానికి ప్రయత్నిస్తాడు.

"వెళ్లిపో, యువకుడా, నేనన్నింటికీ తెగించానిప్పుడు" అంటూ వారిస్తాడు రోమియో. కాని పారిస్ వినడు. యుద్ధం జరుగుతుంది. పారిస్ నేలకొరుగుతాడు. చివరి కోరికగా, "దయచేసి, సమాధిలో నన్ను జూలియెట్ పక్కకి చేర్చ"మని వేడుకుంటాడు.

మృతుని కోరిక తీరుస్తాడు రోమియో. ఇదే తమ సమాగమం. జూలియెట్‌ని తన చేతుల్లో ఎత్తుకుని, విషం తాగి, చివరిసారిగా ప్రియురాలిని ముద్దుపెట్టుకుని శ్వాసవిడుస్తాడు.

సమాధులను వెదుకుతూ లారెన్స్ వస్తాడు. ఒకచోట దివ్విటీ వెలుగుతున్నది. రాళ్లమీద నెత్తుటి మరకలు. సమాధిలో రెండు శవాలు. పారిస్, రోమియో. జూలియెట్ లేస్తుంది. 'నా రోమియో ఎక్కడ?' అని అడుగుతుంది. జరిగింది చెప్పక తప్పదు. జనం వస్తున్న అలికిడి. పారిపొమ్మంటాడు. కాని జూలియెట్ కదలదు. భయపడి, లారెన్స్ వెళ్లిపోతాడు.

ఆత్మహత్యకు విషం మిగల్లేదు. కాని రోమియో వద్ద చురకత్తి వున్నది. కాపలావాళ్లు వచ్చేలోగా, త్వరగా జరిగిపోవాలి పని. "ఇప్పుడు ఆనందాన్నిచ్చే ఒకే ఒక సాధనం ఈ కత్తి" అంటూ పొడుచుకుని రోమియో మీద వాలిపోతుంది జూలియెట్.

ఇక ఆ ప్రేమికులనెవరూ విడదీయలేరు. లారెన్స్ కాపలావాళ్లకు దొరికి పోతాడు. వెరోనా రాజకుమారుడికీ, కాపులెట్, మాంటేగ్ కుటుంబాలకూ వీళ్ల కథ తెలిసిపోతుంది. తమ ద్వేషం పిల్లల్ని బలిగొన్నదని గ్రహిస్తారు. చేతులు కాలాక.... గతాన్ని మరచి స్నేహంగా బతకాలనుకుంటారు యిరు కుటుంబాల వాళ్లు.

పశ్చాత్తాపం తప్ప వాళ్లకు మరేం మిగిలింది!





# 17. జూలియస్ సీజర్

రాజకీయ కుట్రలూ, కుతంత్రాలూ యిందులోని కథావస్తువు. నాయకుల వుపన్యాసాలు ప్రజల వుద్రేకాలను రెచ్చగొడతాయి. అల్లకల్లోల పరిస్థితి అంతర్యుద్ధానికి దారి తీస్తుంది. రోమ్ చరిత్ర నేపథ్యంలో వ్యక్తుల స్వభావాలను కూలంకషంగా అధ్యయనం చేశాడు షేక్స్పియర్. అధికార వర్గంలో అంతశ్శత్రువులే ఎక్కువ. అలనాటి ఈ నాటకం నేటి వ్యవస్థీకృత రాజకీయాలకు ప్రతిబింబం.

రోమ్ చక్రవర్తి జూలియస్ సీజర్ విశ్వవిజేత. ప్రజలకు ఆరాధ్యదైవం. దర్శనం చేసుకోవటానికి దూరప్రాంతాలనించి వ్యయప్రయాసలకోర్చి వస్తారు. గుంపులు గుంపులుగా పోగైన జనాన్ని చెదరగొట్టటం భద్రతా సిబ్బందికి పెద్దసమస్య.

తోటి రాజకీయ నాయకులకు జూలియస్ సీజర్ కీర్తి కంటకంగా మారుతుంది. అశేష ప్రజల మద్దతు కూడగట్టుకున్నవాడు నియంతగా మారటానికెంతో కాలం పట్టదు.

నగర కూడలి. పందాలకు (రేసెస్) పోతూ సీజర్ అటుగా వస్తున్నాడు. చుట్టూ ప్రభుత్వోద్యోగులు. జయజయ ధ్వానాలు చేస్తూ జనం వెంట నడుస్తున్నారు. మార్చి పదిహేను నాడు ప్రమాదం పొంచి వుందని అరుస్తారెవరో. ఆ తేదీ ఎంతో దూరంలో లేదు. అనివార్యంగా జరగబోతున్న రక్తపాతానికి యిది తొలి సంకేతం. సీజర్ ఈ

హెచ్చరికను సీరియస్‌గా తీసుకోడు. "అదంతా వూహాగానం."

గుంపు ముందుకు కదుల్తుంది. ఇద్దరు వ్యక్తులు ఓ పక్కన నిలబడి మాట్లాడుకుంటున్నారు. ఒకడు బ్రూటస్ - కులీన వంశానికి చెందినవాడు. తరతరాలుగా రాజులకు భక్తిప్రపత్తులతో సేవ చేసిన వంశం అది. మరొకతడు కాసియస్ - దేశ రాజకీయాల్లో ప్రముఖుడు. సీజర్‌ను తుదముట్టించటానికి అతడి దగ్గిరో వ్యూహం వుంది. బ్రూటస్, కాసియస్ యిద్దరూ సీజర్‌కు మంచి మిత్రులే. ముగ్గురూ సమవుజ్జీలుగా వున్నరోజులు మననం చేసుకుంటాడు కాసియస్. "ఒకనాడు ఈత కొడుతున్నప్పుడు సీజర్ మునిగిపోకుండా రక్షించింది నేనే. ఇప్పుడు సీజర్ రాజాధిరాజు. నేనో అనామకుణ్ణి. అతడి ముందర వంగి నా భక్తి చాటుకోవాలి." "స్పెయిన్‌లో వున్నప్పుడు ఒకనాడు సీజర్‌కు జ్వరం వచ్చింది. గొంతెండుకుపోతున్నది నీళ్లివ్వమంటూ ప్రాధేయపడ్డాడు. ఈ చక్రవర్తి ఆనాడు బేలగా ఏడ్చాడు. సీజర్ మారలేదు. కాని అధికారం అక్కడకు చేర్చింది. అతడిప్పుడు మానవాతీతుడు. దైవాంశసంభూతుడు."

రేసుల దగ్గిర కోలాహలం. "సీజర్‌కు మరేదో కొత్త సత్కారం జరుగుతున్నట్టుంది." అంటాడు బ్రూటస్.

"అతనెలా అధికుడు. మనమెలా అల్పులం. అందరం ఒకే భోజనం తింటున్నాం. ఎందుకు తలవంచాలి?" అంటూ కవ్విస్తాడు కాసియస్. "రోమ్‌లో ఎప్పుడూ ప్రజాస్వామ్య ప్రభుత్వాలే వున్నాయి. మా పూర్వీకులు నియంతల్ని అంతమొందించి ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని ఏర్పరిచారు." అంటాడు కాసియస్.

అంతావిని బ్రూటస్ "ఆలోచిస్తాను." అంటాడు ముందు జాగ్రత్తగా.

సీజర్ తిరిగివస్తున్నాడు. కాసియస్‌ను చూస్తాడు. (గుంపులను అదుపులో పెట్టటం అతని బాధ్యత) "చూడు. సన్నగా పీలగా వున్నాడు. కళ్లలో ఆకలి వుంది. ఇలాంటి వాళ్లు ప్రమాదకరం. లావుగా వున్న మనుషులే మేలు." అంటాడు మిత్రుడు మార్క్ ఆంటొనీతో.

కాసియస్‌వల్ల ఎవరికైనా ప్రమాదం వాటిల్లగలదని ఆంటొనీ వూహించనైనా లేదు.

సీజర్ భయానికి అతీతుడు. అతనిప్పుడు తనను తాను ఒక మామూలు మనిషిగా పరిగణించటం లేదు. ప్రజలు అలా బ్రహ్మరథం పట్టారు మరి. ఆంటొనీని తన కుడివైపున నడవమంటాడు. (ఎడమ చెవి వినిపించదు.)

బ్రూటస్ మిత్రుడు కాస్కా కూడా రేసులకు వెళ్లివచ్చాడు. అక్కడ సీజర్‌కేం సత్కారం జరిగిందని అడుగుతాడు బ్రూటస్. "అతడికో కిరీటం బహుకరించారు. సీజర్ మర్యాదగా తిరస్కరించాడు. జనం అతని నిరాడంబరతను శ్లాఘించారు. మూడుసార్లు బహూకరించారు. మూడుసార్లు అతడు తిరస్కరించాడు. అతనికి తీసుకోవాలనే వున్నది. కాని ప్రజల మెప్పుకోసం వద్దన్నాడు వాళ్లెంత మంత్రముగ్ధులైనారంటే అతనేం చెబితే

అది చెయ్యటానికి – ప్రాణాలివ్వటానికి కూడా సిద్ధపడ్డారు." అంటాడు కాస్కా
బ్రూటస్‌లో సంచలనం కలిగిస్తుందీ వార్త. కాసియస్ ఈ క్షణం కోసమే నిరీక్షిస్తున్నాడు – సీజర్ హత్యకు అతడు పన్నుతున్న కుట్రలో బ్రూటస్ భాగం పంచుకోవాలి. అతడి మనసు తనవైపు తిప్పుకోవటానికి మరింత ఒత్తిడి పెంచుతాడు. ప్రజలు తమ యిబ్బందుల్ని ఏకరువు పెడుతూ రాసినట్టుగా కొన్ని అర్జీపత్రాలను సృష్టించి బ్రూటస్ యింటిలో వేస్తాడు.

ఆ రాత్రి ఉరుములు మెరుపులతో భయానక వాతావరణం ఏర్పడుతుంది. రోమ్ నగరంలో శాసనసభా భవనంలో క్రూర జంతువులు సంచరిస్తాయి. అతీత శక్తులను నమ్మేవాళ్లకు అనేక సంకేతాలు కనిపిస్తాయి. ఒంటరిగా తిరుగుతున్న కాసియస్ "ఈ తుఫానువంటివాడు సీజర్. నియంత్రించక తప్పదు." అంటూ కుట్రలో చేరమని కాస్కాను కోరతాడు.

బ్రూటస్‌కు నిద్రపట్టలేదు. కాసియస్ మాటలు అనేక సందేహాలను రేపాయి. సీజర్ పట్ల నమ్మకం సన్నగిల్లుతున్నది. రోమ్ నగరానికి తమ వంశమెంతో సేవ చేసింది. రాజ్యంపట్ల విధేయత అతని నరనరాల్లో జీర్ణించుకుపోయింది. పరిస్థితి యిలాగే కొనసాగితే రోమ్ పతనం కాక తప్పదు. అంతకన్నా నియంతను తొలగించటం మేలు. తొలగించటమంటే హత్య చెయ్యటమే. కాని సీజర్ తన అనుంగు మిత్రుడు.

కలత మనసుతో తోటలో తిరుగుతున్నాడు బ్రూటస్. లూసియస్ అనే పరిచారకుణ్ణి తన గదిలో దీపం వెలిగించమని పంపిస్తాడు. తొందర పడవద్దు మొదట తనను తాను సమర్థించుకోగలగాలి. ఒక మహా ప్రమాదాన్ని నివారించటానికి యిలాంటి పని చేస్తే తప్పులేదు. లూసియస్ అర్జీ పత్రాల కట్ట తెచ్చిస్తాడు. రోమ్ నగరవాసులంతా తన సహాయం కోసం అర్థిస్తున్నట్టనిపిస్తుంది. తన పూర్వీకులు నియంత టార్క్విన్‌ను నిర్మూలించారు. సీజర్ నిరంకుశత్వాన్ని నాశనం చేసే బాధ్యత తన మీదున్నది.

కాని హత్య చెయ్యవలసింది మిత్రుణ్ణి. ఇంతటి ఘోరం చెయ్యటానికి చేతులెలా వస్తాయి?

మొహాల మీద ముసుగులు కప్పుకున్న వ్యక్తులెవరో గుమ్మం దగ్గర నిరీక్షిస్తున్నారని చెబుతాడు లూసియస్. వాళ్లంతా తోటి కుట్రదార్లు. ప్రవేశపెట్టమంటాడు బ్రూటస్.

బ్రూటస్ కూడా తమలో ఒకడో కాడో వాళ్లకు తెలియదు. అసలు విషయం దాటేసి కబుర్లు చెప్పుకుంటారు. చివరికి కాసియస్ ఒత్తిడితో బ్రూటస్ వాళ్లతో చేతులు కలుపుతాడు.

ఇది హత్యలా కనిపించగూడదు. అనివార్యమైన బలియిది. సీజర్‌ను తుద ముట్టించకుండా, కేవలం నియతృంత్వాన్ని మాత్రం నియంత్రించగలిగితే ఎంత బాగుండేది! కాని అది అసంభవం గనక రోమ్ సామ్రాజ్య ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకుని ఏదైనా చెయ్యాలి. ఈ విషయంలో కాసియస్‌కూ తనకూ అభిప్రాయభేదమున్నది. లోకం తెలిసిన కాసియస్ అందర్నీ ప్రతిజ్ఞ చెయ్యమంటాడు.

బ్రూటస్‌కు యిష్టముండదు. బాధ్యత తెలిసిన రోమన్ పౌరుడు తన కర్తవ్యాన్నెప్పుడూ విస్మరించడు. దీనికి ప్రమాణాలెందుకు? మార్క్ ఆంటొనీని కూడా చంపెయ్యాలని కాసియస్ ఆలోచన. అతడు బతికుండటం చాలా ప్రమాదకరం. "సంఘశ్రేయస్సునాశించి బలితీసుకుంటున్నామే తప్ప కసాయివాళ్లం కాదు మనం." అవసరాన్ని మించిన హింస అభిలషణీయం కాదు.

మార్చి పదిహేనునాడు ఎనిమిది గంటలకు హత్య జరగాలి. ఆ సమయంలో సీజర్ శాసన సభలో వుండేటట్టుగా జాగ్రత్తపడాలి.

తెల్లవారుతున్నది. కుట్రదారులు తమ తమ యిళ్లకు పోతారు. బ్రూటస్ భార్య భర్తకోసం నిరీక్షిస్తున్నది. అతడి అసహనం, తొట్రుపాటు ఆమెను కలవరపరుస్తున్నాయి. రోమన్ రాజకీయవేత్త కూతురు గనక (రాజకీయ) ఒతిళ్లను అర్థం చేసుకోగలదు. తన ప్లానంతా భార్యకు చెబుతానంటాడు బ్రూటస్. ఆమె అంటే అతడికి చాలా యిష్టం.

సీజర్ భార్య కూడా భయపడుతున్నది. పిడుగులూ, మెరుపులూ ఆమెకు నిద్రాభంగం కలిగించాయి. వింత సంకేతాలు విన్పిస్తున్నాయి ఆ రోజు శాసన సభకు పోవద్దని బతిమాలు తుంది. ఏదో ప్రమాదం పొంచివున్నదని అనిపించింది. "భీరువులు నిత్యం మరణిస్తారు. ధైర్యవంతులు ఒకసారే మరణిస్తారు" అంటాడు సీజర్. చివరికి భార్య మాట కాదనలేక యింటివద్దే వుండటానికి అంగీకరిస్తాడు. కుట్రదారుడొకడు వచ్చి "ఆడదాని కొంగు పట్టుకు తిరిగే మగాడు రోమన్ చక్రవర్తా?" అని పరిహసిస్తాడు.

సీజర్ శాసనసభకు బయల్దేరతాడు.

దారిలో యిద్దరు వ్యక్తులు నిరీక్షిస్తున్నారు. ఒకడు జ్ఞాని. హత్య గురించి అతడికి తెలుసు. కుట్రదారుల పేరు రాసిన కాగితం చేతబట్టుకుని నిలుచున్నాడు. సీజర్ అటుగా వచ్చినప్పుడు ఆ కాగితం అందించవచ్చు. మరొకరు బ్రూటస్ భార్య. ఆమెకు శాసన సభలో జరగబోయే ఘోరం తెలుసు. ప్రశాంతంగా వుండటానికి ప్రయత్నిస్తున్నదిగాని లోపలి అలజడిని ఆపుకోలేక పోతున్నది.

అప్పటికే హత్య జరిగినట్లుగా భ్రమిస్తుంది. కాని యింకా సీజర్ అటుగా రానేలేదు. వార్త తెలుసుకొని రమ్మని లూసియస్‌ను పంపిస్తుంది.

ఇంటికెళ్లి నిరీక్షించటం తప్ప తను చెయ్యగలిగిందేమీ లేదు. రాజకీయాలు పురుషుల వృత్తి. తను స్త్రీ.

సీజర్ వస్తాడు. కాగితం విసిరేస్తాడు జ్ఞాని. మరో అర్జీలేఖ అనుకుని సీజర్ దాన్ని పట్టించుకోడు. మరి కొంత దూరం నడిచి శాసన సభలో ప్రవేశిస్తాడు. దేశ బహిష్కరణకు గురైన ఒకణ్ణి తిరిగి రానివ్వమని ప్రార్థిస్తాడొక సభ్యుడు. సీజర్ దృష్టిలో రాజాజ్ఞలను పునస్సమీక్షించవలసిన అవసరం లేదు. కుట్రదారులందరూ అతని చుట్టూచేరి వంగి నిల్చుంటారు. సీజర్ తృణీకారంగా "మీరేం చేసినా ఒలింపస్ పర్వాతాన్నెత్తలేరు. వెళ్లండి"

అంటాడు

కాని సీజర్ ఒలింపస్ కాదు. దేవుడూకాదు. చక్రవర్తికూడా మామూలు మనిషే. మృత్యువుకు అతీతుడు కాదు. చుట్టూ మూగిన వాళ్లు కత్తులతో పొడుస్తారు. వాళ్లలో తన సన్నిహిత మిత్రుడు బ్రూటస్ కూడా వుండటం చూసి నమ్మలేక ఆశ్చర్యంగా "నువ్వా బ్రూటస్!" అంటూ అరుస్తాడు (ఇది ఇంగ్లీషు నాటకమైనా "ఎట్‌టు, బ్రూట్?" అనే లాటిన్ మాటల్ని యథాతథంగా వాడాడు షేక్స్‌పియర్: ఆనాటి ఇంగ్లిష్ ప్రేక్షకులకు ఈ మాత్రం లాటిన్ అర్థం అయ్యేదన్నమాట.). ఆ మరుక్షణం కుప్పగా కూలిపోతాడు - పాంపే విగ్రహం పాదాలచెంత - తను యుద్ధంలో పరాజితుణ్ణి చేసిన పాంపే. మిత్రద్రోహానికి బలైన సీజర్ కథ అలా ముగుస్తుంది.

"స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు వర్ధిల్లాలి. నిరంకుశత్వం నశించాలి!" అంటూ అరుస్తాడొక కుట్రదారు. "ఈ దేశానికి స్వాతంత్ర్యం ప్రసాదించింది మేమే!" అంటాడు బ్రూటస్.

కాని రోమ్‌కు సంక్రమించింది అంతర్యుద్ధం. మార్క్ ఆంటోనీ ప్రవేశం - అతణ్ణి చంపకుండా వదిలేశారు వాళ్లు. పరిస్థితి సంక్లిష్టంగా వుంది - లోలోపల ప్రతీకారానికి వ్యూహం రచిస్తూనే హంతకులను చూసి చిరునవ్వు నవ్వుతాడు ఆంటోనీ. సీజర్‌కు శ్రద్ధాంజలి ఘటిస్తూ వుపన్యసిస్తానంటాడు. కాసియస్‌కు యిది నచ్చదు. కాని బ్రూటస్ అంగీకరిస్తాడు. కాసియస్ తలపండిన రాజనీతిజ్ఞుడు. మంచి వక్తలు ప్రజల్ని ఎలా రెచ్చగొట్టగలరో అతడికి తెలుసు. బ్రూటస్‌కు హేతుబద్ధత మీద విశ్వాసం.

హత్యకు దారితీసిన పరిస్థితుల్నీ, కారణాల్నీ వివరిస్తే ప్రజలు అర్థం చేసుకుంటారు. హంతకులను విమర్శించకూడదని ఆంటోనీకి ముందరే సూచించాలి.

సహేతుకంగా, హంతకుల దేశభక్తిని, సదుద్దేశాలను విశదం చేస్తాడు బ్రూటస్. ఆ తర్వాత వుపన్యసించటం మార్క్ ఆంటోనీ వంతు. అతడికి అవకాశమిచ్చి హంతకులు తమ నాశనాన్ని కొనితెచ్చుకున్నారు. శ్రోతల్ని మంత్ర ముగ్ధుల్ని చెయ్యగల వాక్చతురుడు ఆంటోనీ. వాళ్లల్లో క్రోధాగ్నిని, ప్రతీకారేచ్ఛను ఎలా రగుల్చాలో అతడికి బాగా తెలుసు. అయితే అధిగమించవలసినవి రెండున్నాయి. ఒకటి. బ్రూటస్ అంటే ప్రజలకు యిష్టం. రెండు. హంతకులను విమర్శించనని వాగ్దానం చేశాడు. రోమ్ సామ్రాజ్య ప్రయోజనం కాపాడటానికి హత్యచేశామని బ్రూటస్ అప్పటికే అందర్నీ నమ్మించాడు. ఇప్పుడు ఎవరైనా సీజర్‌ను పొగిడితే వినటం కూడా వాళ్లకిష్టంలేదు. మొదట ఆంటోనీ గొంతు చించుకొని అరవవలసిన అవసరం ఏర్పడుతుంది. (షేక్స్‌పియర్ అభిమానులకు చిరపరిచితమైన వుపన్యాసం) :

"ఫ్రెండ్స్, రోమన్స్, కంట్రీమెన్, ఒక్కసారి వినండి. సీజర్‌ను సమాధి చెయ్యటానికి వచ్చాను. శ్లాఘించటానికిక్కాదు.....బ్రూటస్ సత్పురుషుడు. సజ్జనుడు." అంటూ ప్రారంభిస్తాడు. శ్రోతల్లో కలవరం పెరుగుతుంది. వాళ్లన్నెమ్మదిగా తనవైపుకు తిప్పుకోవాలి.

"మనకు దైవసమానుడైన సీజర్‌ను హత్యచేసింది బ్రూటస్......" ఒక్కసారిగా జనం కోపం పెల్లుబుకుతుంది.

"ప్రతీకారం తీర్చుకుంటాం. వాళ్ళి చంపండి. నరకండి." అంటూ అరుపులు.

హంతకులను వెంటాడుతూ ప్రజలు వీధుల్లో పరిగెడతారు. ఒక హంతకుడి పేరు సిన్నా. అదేపేరున్న మరో వ్యక్తి తారసిల్లుతాడు. అతడు కవి: కాని జనం అతణ్ణి కొట్టి చంపుతారు.

ఇప్పుడు అధికారానికి వచ్చిన కొత్తపాలకులు, పాతవాళ్ళకన్న ఎక్కువగా హింసను ప్రోత్సహిస్తారు. సీజర్ వారసుడు ఆక్టేవియస్, లెపిడస్‌లతో కలిసి మిశ్రమ ప్రభుత్వం ఏర్పాటుచేస్తాడు ఆంటొనీ. తమ శతృవులందర్నీ నిర్దయగా నాశనం చెయ్యటం వీరి లక్ష్యం. వాళ్ళేకాదు. వాళ్ళ బంధువులూ, మిత్రులూ, పిల్లల్ని కూడా వదలకూడదు. బ్రూటస్, కాసియస్‌లను వెదికి పట్టుకుని హత్యచెయ్యటానికి ఒక ప్రత్యేక సైన్యాన్ని పంపిస్తారు.

బ్రూటస్, కాసియస్‌లు తమ తమ సైన్యాలకు నాయకత్వం వహిస్తున్నారు. ఆసియా మైనర్ లోని సార్డిస్ వద్ద శిబిరం ఏర్పరుచుకుంటాడు బ్రూటస్. ఇద్దరు మిత్రులకు యుద్ధాన్ని గురించి అభిప్రాయభేదమున్నది. లోకం పోకడ తెలిసినవాడు కాసియస్. బ్రూటస్ ఆదర్శవాది. భార్య ఆత్మహత్య చేసుకున్నదని వార్త వస్తుంది. మార్క్ ఆంటొనీ ఏం అఘాయిత్యం చేస్తాడోనని భయపడి ఆమె ప్రాణాలు తీసుకున్నది.

బ్రూటస్‌తో చర్చలకు సార్డిస్‌కు వస్తాడు కాసియస్. ఆంటొనీ సేనలు తమను వెదుక్కుంటూ వస్తున్నాయి. ఎదురుగా వెళ్లి ఫిలిపి వద్ద శతృవులను నిలువరించాలనుకుంటారు బ్రూటస్, కాసియస్. రాత్రి. బ్రూటస్‌కు నిద్రపట్టదు. పుస్తకం చదువుతాడు. దివ్విటీ వెలుగు చెదిరినట్టవుతుంది. సీజర్ ప్రేతం ప్రత్యక్షమవుతుంది.

"ఎవర్నువ్వు?"

ఫిలిపి దగ్గర నీకు మళ్ళీ కనిపిస్తాను" అంటూ ప్రేతం అదృశ్యమవుతుంది. లూసియస్ సంగీత వాయిద్యం సరిచెయ్యబోతాడు. తీగల్లో బిగువు తగ్గింది. కాని అంతకన్నా పెద్ద ప్రమాదమే ముంచుకొస్తున్నదని బ్రూటస్‌కు తెలుసు. యుద్ధమూ, మరణమూ అనివార్యం.

ఫిలిపీ వద్ద యిరుపక్షాలూ ఎదురెదురుగా నిలిచి పరస్పరం దూషించుకుంటారు. యుద్ధం యింకా ప్రారంభం కాలేదు. ఒక తల కూడా తెగిపడలేదు. అయినా అప్పుడే రాబందులు వచ్చి వాలుతున్నాయి. ఇద్దరు మిత్రులూ విడిపోయి తమ తమ సైన్యాలకు నాయకత్వం వహించటానికి ముందుకు కదులుతారు. భీషణ యుద్ధం జరుగుతుంది. ఆ గందరగోళంలో తన సైన్యం ఓటమిపాలైందనుకుంటాడు కాసియస్. బందీగా చిక్కటం యిష్టం లేదు. కొండ దిగువన కాసియస్ మృతదేహాన్ని చూస్తాడు బ్రూటస్

తనకు కూడా ముగింపు యింక ఎంతో దూరంలో లేదు. సీజర్ ప్రేతం తమను

పరాజితుల్ని చేస్తున్నది.

రాత్రి దాకా కొనసాగుతుంది యుద్ధం. బ్రూటస్ అనుచరులు ఒక్కొక్కరే నేలకొరుగుతారు. కాసియస్‌ను అనుసరించటానికి సమయం ఆసన్నమైంది. ఖడ్గాన్ని నిలబెట్టమని సైనికుడికి ఆదేశించి దానిమీద వాలి ఆత్మహత్య చేసుకుంటాడు బ్రూటస్: అతడి చివరిమాటలు "సీజర్, ఇకనైనా శాంతించు."

విజేత మార్క్ ఆంటొనీ ప్రవేశం. బ్రూటస్ పట్ల అతడికి ద్వేషం లేదు. బ్రూటస్ వంటి సన్నిహితుణ్ణి అసహ్యించుకోవటం అసాధ్యం. అతడి ఆశయం శ్లాఘనీయమే. కాని చర్యల పరిణామమింత విషాదభరితం.





# 18. హామ్లెట్

షేక్స్‌పియర్ ట్రాజెడీలలో అత్యంత ప్రసిద్ధి చెందిన నాటకం హామ్లెట్. దీన్ని గురించి వినని వాళ్లు ఈ లోకంలోనే లేరంటే అతిశయోక్తి కాదు. ఇందులోని హీరో పాత్ర చిత్రణా, అతడి సందిగ్ధ మానసిక స్థితీ జీవిత తాత్వికతను గురించి చేసిన గొప్ప వ్యాఖ్యానాలు సాహితీప్రియులకు సుపరిచితమే. ప్రతి ప్రేక్షకుడూ హామ్లెట్‌లో తనను తాను చూసుకుంటాడు. అత్యంత సంక్లిష్టమైన ఈ పాత్ర ఊహాజనితం కాదనీ, మన కళ్ల ముందు కదలాడే మరొక మనిషనీ భ్రమింప చేస్తుంది.

ట్రాజెడీ అంటేనే విషాదాంతం. హామ్లెట్‌లో విషాదం పరాకాష్ఠకు చేరింది. దుష్టకార్యాల వల్ల హీరో చావడు. మంచి చేసే క్రమంలో మరణిస్తాడు. కాని మృత్యుముఖంలో కూడా అతడి ధిక్కార ధోరణి మారదు. జీవన్మరణాల మధ్య గీతను చెరిపి వేస్తాడు. శరీరానికీ ఆత్మకూ మధ్య నిత్య సంఘర్షణ.

విడిపోతే తప్ప రెంటికీ శాంతి లేదు.

డెన్మార్కు శీతాకాలంలో ఒక చలి రాత్రి. ఎల్సినోర్ రాజదుర్గం దగ్గర గార్డులు డ్యూటీ మారుతున్నారు. గత రెండు రాత్రులూ, సరిగ్గా ఒంటిగంటకు కోట గోడల దగ్గర ఒక ప్రేతం కనిపించింది. కవచం ధరించిన ఆ ప్రేతం హామ్లెట్ తండ్రి, దివంగత డెన్మార్క్ రాజును పోలి వున్నది. హామ్లెట్ బాల్యమిత్రుడు హొరేషియో ఈ విషయం నమ్మలేదు. స్వయంగా చూపించటానికి ఈనాడు అతణ్ణిక్కడికి తీసుకువచ్చారు.

ఒంటిగంట. ప్రేతం దర్శనమిచ్చింది. ఆశ్చర్య చకితుడైన హొరేషియో దాంతో మాట్లాడ ప్రయత్నించాడు. కాని అది అంతర్థానమైంది. మరణించిన రాజు మళ్లీ ఎందుకీ రూపంలో తిరిగి వచ్చాడు? బహుశా, దేశానికేదో విపత్తు సంభవించబోతున్నదని హెచ్చరించటానికి కాబోలు. నార్వే రాజబంధు వొకడు డెన్మార్క్ మీద దాడి చేస్తానని బెదిరిస్తున్నాడు. ప్రేతం యివ్వదలచుకున్న సందేశం ఏమిటి? బహుశా, హామ్లెట్‌తో చెబుతుందేమో! వెళ్లి, హామ్లెట్‌కి ఈ వార్త చేరవేస్తారు.

తన చిన్నాన్నను పరికించి చూస్తూ, రాజప్రాసాదంలో ఆసీనుడై వున్నాడు హామ్లెట్. (రాజు మరణం తర్వాత అతడు తన వదిన (హామ్లెట్ తల్లి)ని వివాహమాడి డెన్మార్క్ సింహాసనం అధిరోహించాడు) అన్నీ తెలిసినట్టుగా, చకచకా రాజవిధులు నిర్వహిస్తున్నాడు కొత్త రాజు. ఇద్దరు దూతలను శాంతి ప్రయత్నాలు కొనసాగించమని నార్వేకు పంపించాడు. లార్డ్ చాంబర్లేన్ (రాజమందిర వ్యవహారాలు చూసే అధికారి) తన కుమారుడికి ఫ్రాన్సుకి వెళ్లి రాచకార్యమేదో నిర్వహించవలసిన బాధ్యత అప్పచెప్పాడు.

హామ్లెట్, పితృ వియోగ దుఃఖాన్నించి కోలుకోలేదు. అతడి వేషభాషలింకా శోకావస్థనే సూచిస్తున్నాయి. విచారాన్ని అధిగమించి రాచక్రీడలలో పాల్గొనమని మందలిస్తాడు రాజు. కాని హామ్లెట్‌కు చిన్నాన్నంటే యిష్టం లేదు. అతనితో కాక, తల్లితో మాట్లాడతాడు. యూనివర్సిటీ చదువు మాని, ఎల్సినోర్‌లోనే వుండి పొమ్మని హామ్లెట్‌కు నచ్చచెబుతుంది రాణి (హామ్లెట్ తల్లి).

రాజ దంపతులు సభాప్రాంగణం నుండి నిష్క్రమిస్తారు. ఒంటరిగా వున్నప్పుడు హామ్లెట్ అద్భుతమైన స్వగతాలు వల్లిస్తాడు. తండ్రి మరణం కన్నా, తల్లి పునర్వివాహం హామ్లెట్‌ని ఎక్కువ గాయ పర్చింది – భర్త గతించి రెండు నెలలైనా గడవకముందే ఆమె మళ్లీ పెళ్లికి అంగీకరించింది – అది కూడా హామ్లెట్ అణువణువునా ద్వేషించే ఈ నీచుడితో. తన తల్లి సాంగత్యంలో ఈ కొత్త మనిషిని వూహించుకుంటే హామ్లెట్ కోపంతో, అసహ్యంతో దహించుకు పోతున్నాడు.

ప్రేతానికి సాక్షులైన మరో యిద్దరితో కలిసి హొరేషియో ప్రవేశం. హామ్లెట్ అంతర్ముఖుడు. మితభాషి. హొరేషియో చలాకీగా మాట్లాడుతూ, నవ్వుతూ, నవ్విస్తూ వుంటాడు. యూనివర్సిటీలో యిద్దరూ సహ విద్యార్థులు. సన్నిహితులు.

ప్రేతం గురించి విని హామ్లెట్ చకితుడవుతాడు. ఆ రాత్రికి తను కూడా వాళ్ల వెంట

తండ్రి ప్రేత రూపాన్ని చూడటానికి వస్తానంటాడు.

చాంబర్లేన్ కొడుకు పేరు లార్టెస్. ఫ్రాన్సు ప్రయాణానికి సన్నాహాలు చేసుకుంటున్నాడు. హామ్లెట్ ఆమెను తరచుగా కలుస్తున్నాడు. లార్టెస్ అభిప్రాయంలో యిది అభిలషణీయం కాదు. పరిచయం ప్రేమగా మారే అవకాశమున్నది. కాని హామ్లెట్ డెన్మార్క్ రాకుమారుడు. రాజులకు సామాన్యులను వివాహమాడే స్వేచ్ఛ వుండదు. ఓఫేలియా అమాయకురాలు. కట్టుబాట్లలో పెరిగిన పిల్ల. వెళ్లేముందు లార్టెస్ తన చెల్లెలు ఓఫేలియాను కలిశాడు. తను హద్దుల్లో వుంటాననీ, పారిస్‌లో అన్న కూడా బుద్ధిగా వుండాలనీ హితవు చెబుతుంది.

చాంబర్లేన్ ప్రవేశం. పేరు పోలోనియస్. ఊబ శరీరం. మాటకారి. అందర్నీ చెప్పటానికి అతని నోట నీతివాక్యాలు కోకొల్లలు. ప్రయాణంలో తీసుకోవలసిన జాగ్రత్తల గురించి మొదట కొడుక్కి నీతిబోధ. తరువాత ఓఫేలియా వంతు. తన కూతురు రాకుమారునితో విహరించటం పోలోనియస్‌కు కూడా యిష్టం లేదు. "నేనే తప్పు చెయ్యలేదు. అతడు నన్ను పెళ్లాడతానని వాగ్దానం చేశాడ"ంటుంది ఓఫేలియా. కాని తండ్రి మాటకు ఎదురులేదు. ఇకనించీ హామ్లెట్‌ను కలవటానికి వీల్లేదంతే.

అర్ధరాత్రి. కోట గోడల దగ్గిర హొరేషియో, హామ్లెట్, గాఢాంధకారం. ఒణికిస్తున్న చలి. తాగుబోతుల ప్రేలాపనలు వినిపిస్తున్నాయి. ఇలాంటి అల్లరి హామ్లెట్‌కు యిష్టముండదు. ఆ విషయమే హొరేషియోతో చెప్పబోతున్నప్పుడు దయ్యం ప్రవేశిస్తుంది. హామ్లెట్‌కు మూఢనమ్మకాల్లేవు. హేతుబద్ధంగా వివేచన చేసి నిర్ణయం తీసుకుంటాడు. కాని యిది వింత ప్రపంచం. దయ్యాలూ, భూతాలూ, ప్రేతాత్మలూ సంచరించే అంధ లోకం.

అతని తండ్రి సమాధిని ఛేదించుకుని వచ్చాడు. హామ్లెట్‌కు మాటలు తడబడుతున్నాయి.

దయ్యం పిలుస్తుంది. హామ్లెట్ అడుగు ముందుకేస్తాడు. మిత్రులు వారిస్తారు. ఏదో దుష్టశక్తి అయినా తండ్రి రూపంలో వచ్చిందేమో! కాని హామ్లెట్ అప్పటికే మంత్రముగ్ధుడై ఉత్తేజితుడై ముందుకు కదిలాడు. మిత్రులతణ్ణి ఆపలేరు. కొంత దూరం నడిచి, "ఇంక కదలలేను. మాట్లాడ"మని దయ్యాన్ని వేడుకుంటాడు.

చివరికి, దయ్యం నోట అసలు రహస్యం తెలుస్తుంది. తన తండ్రిది సహజ మరణం కాదు. తమ్ముడు విషప్రయోగం చేశాడు. తన ప్రాణాన్నీ, రాజ్యాన్నీ, భార్యనూ హరించిన దుష్టుడిప్పుడున్నరాజు. ప్రతీకారం తీర్చుకొమ్మని కొడుక్కు చెప్పటానికై మృత్యులోకం నించి వచ్చాడు. "కాని మీ అమ్మను బాధపెట్టకు. ఆమె నాకు ప్రాణం. తను చేసిన పాపానికి భగవంతుడే తగిన శిక్ష విధించనీ."

దయ్యం అదృశ్యమవుతుంది. తండ్రి మరణ రహస్యం తెలిసిన హామ్లెట్‌ను ప్రతీకారజ్వాలలు దహించి వేస్తాయి.

ఈ దుష్టుడిని తుదముట్టించటమే తన జీవిత లక్ష్యం. అంతటి ప్రశాంతచిత్తుడు

యుక్తాయుక్త వివేచనాదక్షుడు హామ్లెట్ ఆ క్షణాన ప్రతీకారమే జీవిత పరమార్థమని, ఏకైక లక్ష్యమని నిర్ణయించుకున్నాడు. అతడిలో కలిగిన ఈ హఠాత్ పరివర్తన మిత్రులకర్థం కాలేదు. హొరేషియో ఏవో కబుర్లు చెప్పి నవ్వించటానికి ప్రయత్నించాడు. కాని రాకుమారుడి భాష కూడా పరుషంగా మారింది.

తను తెలుసుకున్న విషయం రహస్యంగా వుంచాలని హామ్లెట్‌కు తెలుసు. ఇది మరో చెవిన పడకూడదని మిత్రులను ప్రతిన చేయమంటాడు. వాళ్లు సందేహిస్తే, "గుప్తంగా వుంచాల"ని అదృశ్యప్రేతం ఆజ్ఞాపిస్తుంది.

చివరికి ముగ్గురు మిత్రులు హామ్లెట్ ఖడ్గం పిడి తాకి వాగ్దానం చేస్తారు. హామ్లెట్ ప్రవర్తనలో ఎందుకు మార్పు వచ్చిందని ఎవరైనా అడిగితే తమకేం తెలియదనాలి.

పోలోనియస్ (చాంబర్లేన్) తన పిల్లలు అదుపాజ్ఞల్లో వున్నారో లేరోనని ఎప్పుడూ ఓ కంట కనిపెట్టి చూస్తుంటాడు. పారిస్ వెళ్లిన తన కొడుకు గురించి ఎప్పటికప్పుడు వర్తమానం పంపించమని ఓ పెద్దమనిషికి పురమాయించాడు. ఇదంతా కొడుకు మంచి కోసమేనని అతడి నమ్మకం. కూతురి శ్రేయస్సుకోరి ఆమెను హామ్లెట్‌తో కలవవద్దని ఆదేశించాడు.

తను అల్లుకుంటూ కూర్చున్నప్పుడు హామ్లెట్ తలుపు తోసుకుని గదిలోకి వచ్చాడని చెబుతుంది ఓఫీలియా. భయంతో కంపించిపోతున్నది. రాకుమారుడి ప్రవర్తనకు పోలోనియస్ ఆశ్చర్యపడినమాట వాస్తవమే. కాని ఫలించని ప్రేమవల్ల కొంత పిచ్చెక్కిందేమోనని సరిపెట్టుకుంటాడు. వాళ్ల సమాగమం మీద ఆంక్షలు పెట్టినందుకు పశ్చాత్తాపపడి, రాజుగారికీ విషయం చెప్పటానికి బయల్దేరతాడు.

హామ్లెట్‌లో వచ్చిన మార్పుకు రాజుగారు మనస్తాపం చెందాడు. రోజెంక్రాంట్జ్, గిల్డెన్‌స్టెర్న్ అనబడే హామ్లెట్ బాల్యమిత్రులిద్దర్ని ఈ మార్పుకు కారణం కనుక్కొమ్మని పురమాయించాడు. నార్వే నించి వచ్చిన వార్త వుపశమనం కలిగించింది. ఆ రాజు దండెత్తివచ్చే ఆలోచన విరమించుకున్నాడు. తన సైన్యాలు డెన్మార్కు గుండా ప్రయాణించటానికి అనుమతి కోరాడు. "హామ్లెట్ ప్రవర్తనకు కారణాలనేకం" అంటూ తన వూహాగానాలన్నీ ఏకరువు పెడతాడు పోలోనియస్. రాణిగారు అవన్నీ నిజమేకాబోలు అనుకుంటుంది. రాజు అంత సులభంగా నమ్మడు. ఓఫీలియాతో ఏకాంతంలో వున్నప్పుడు హామ్లెట్ మీద నిఘాపెట్టమని ఓ పరిచారకుణ్ణి ఆదేశిస్తాడు.

ఒంటరిగా కూర్చుని హామ్లెట్ ఏదో చదువుకుంటున్నాడు. పోలోనియస్ తన పిచ్చి ప్రశ్నలు సంధిస్తూనే వున్నాడు. హామ్లెట్ దృష్టిలో "ఎన్నేళ్లొచ్చినా ఎదగని పసివాడు" పోలోనియస్. రోజెంక్రాంట్జ్, గిల్డర్‌స్టెర్న్‌ల ప్రవేశం. వీళ్లు పోలోనియస్ అంత అమాయకులు కారని హామ్లెట్‌కు తెలుసు. తన బాధ వీళ్లకు కొద్దిగా సూచించాలని "డెన్మార్క్ ఒక చెరసాలగా మారింది." అంటాడు. మిత్రులు ఈ అభిప్రాయంతో

అంగీకరించరు.

"మన స్పందనలు వేరు. మన వూహ ఎలా వుంటే లోకం అలా కనిపిస్తుంది. న మాత్రం యిది జైలే." హామ్లెట్.

"రాజ్యవిస్తరణ కాంక్షవల్ల డెన్మార్క్ చెరసాలలాగ కనిపిస్తున్నది కాబోలు" వ్యాఖ్యానిస్తారు మిత్రులు.

కాని హామ్లెట్ బాధ రాజ్యానికి పరిమితమైనది కాదు. "నన్ను నేను ఒక అల్ప బంధించుకొని అదే నా విశాల విశ్వమనుకుని తృప్తిపడగలను. కాని... పీడ వెంటాడుతున్నాయి." అంటూ తన మనోవ్యధను వ్యక్తపరుస్తాడు హామ్లెట్.

రాజుగారి ఆదేశాల ప్రకారమే తాము వచ్చామని మిత్రులిద్దరూ అంగీకరిస్తా

"నా జవాబు కూడా రాజుకు చెప్పండి." అంటాడు హామ్లెట్. శోకం త కుంగదీస్తున్నది. ఈ లౌకిక సౌందర్యం, ప్రపంచ వింతలు, సుఖభోగాలు అర్థహీనంగా కనిపిస్తున్నాయి. భగవంతుని అత్యద్భుత సృష్టి - మానవుడు కూడా ధూళి కణంగా మాత్రమే కనిపిస్తున్నాడు. మిత్ర సాంగత్యానికి మనసు పువ్వి స్త్రీల అందాలు ఆకర్షించవు." మిత్రులు చిరునవ్వు నవ్వటం చూసి "మీరు అంగీకరించరులే" అంటాడు.

"ఎల్సినోర్‌కు నాటకాల ట్రూప్ ఒకటి వచ్చింది."

ఇది తెలిసి హామ్లెట్ ఆనందిస్తాడు. బాగోగులు తెలుసుకుని, చిరకాల మిత్రుల నటీనటులను ఆహ్వానిస్తాడు. తనకు నచ్చిన ట్రాజెడీలోని ఏదైనా దృశ్యం అభినయిం ఒక నటుణ్ణి కోరతాడు.

పోలోనియస్ తన విధినిర్వహణలో భాగంగా, అవసరమైన సదుపాయాల్ని సమకూర్చటానికి నటీనటులను వెంట తీసుకుపోతాడు. (పోలోనియస్‌కు క్లాసి ట్రాజెడీలంటే యిష్టం లేదు.) "మర్డర్ ఆఫ్ గోంజాగో" నాటకం రాజు ముందు ప్రదర్శించమని నటులను అడుగుతాడు హామ్లెట్. అందులో కొన్ని అదనపు పంక్తు కూడా చేరుస్తాడు.

ఏకాంతం. అప్పటిదాకా కులాసా కబుర్లు చెప్పి వుల్లాస పరచిన హామ్లెట్ ప్రతీకార భావనల సుడిగుండంలో వుక్కిరిబిక్కిరవుతాడు. నటుడు విషాద సన్నివే అభినయించటం చూసిన వుద్వేగంలోంచి యింకా కోలుకోలేదు అతడు.

నిజజీవిత విషాదంతో శోకసముద్రంలో మునిగిన తను యింకా అకర్మణ్యు వున్నాడెందుకు? చిన్నాన్నను దూషిస్తాడు. కాని మాటలకిది తరుణం కాదు. తన ద్వేషా ఆచరణ రూపం యివ్వవలసిన సమయం ఆసన్నమైంది.

కాని కర్తవ్యం ఎలా నిర్వహించాలో యింకా బోధపడటం లేదు. ప్రేతం, తన తండ్రి వేషంలో వచ్చిన దుష్ట శక్తి కాదుగదా! అసత్యం నమ్మి తాను హాని

కొనితెచ్చుకుంటున్నాడా. ప్రతీకారం తీర్చుకునే ముందర చిన్నాన్న నేరం తన కళ్ల ముందర రుజువు కావాలి. మరుసటిరోజు, నాటక ప్రదర్శనలో, విషప్రయోగం సీను ఒకటి చేర్చాడు. అది చూసిన చిన్నాన్న ముఖ కవళికలు మారిపోతే, తరువాత ఏం చెయ్యాలో తనకు తెలుసు.

హామ్లెట్ ప్రవర్తనకు కారణాలు తెలుసుకోలేక పోయామని రాజుకు నివేదిస్తారు రోజెంక్రాంట్జ్, గిల్డర్‌స్టెర్న్. రాజు, ఓఫేలియా ద్వారా తెలుసుకోవటానికి ప్రయత్నిస్తాడు. హామ్లెట్ వచ్చేదారిలో ఆమెను పుస్తకం పట్టుకుని కూర్చొమ్మని చెప్పి, తెరవెనక నక్కి చూస్తారు పొలోనియస్, రాజు.

హామ్లెట్ ప్రవేశం. డోలాయమానస్థితిలో వున్నాడు. ఆత్మహత్య గురించి తర్కించు కుంటాడు. అత్యంత ప్రసిద్ధ "టు బీ ఆర్ నాట్ టు బీ" యిక్కడే.

కాని ఆత్మహత్య సమస్యలకు పరిష్కారం కాదు. సమస్యకన్నా ఎక్కువ దుఃఖ కారకం కూడా.

ఓఫేలియా కనిపిస్తుంది. ఆ రోజుల్లో తన ప్రేమ చిహ్నంగా ఆమెకు కొన్ని కానుకలిచ్చాడు. ఆమె అవన్నీ తిరిగి యిచ్చివేయటానికి వేచి వున్నది. కాని యిప్పుడు హామ్లెట్‌కు స్త్రీ అంటేనే గిట్టదు. తల్లి తన తండ్రి హంతకుణ్ణి వరించింది. 'పెళ్లి' అనే మాట తలచుకుంటేనే అసహ్యం వేస్తున్నది. "ఆశ్రమంలో చేరు. పాపులకు జన్మనిచ్చే ప్రయత్నం ఎందుకు చేస్తావు!" అంటూ నిర్దయగా మాటాడతాడు. ఈ పాపిష్టి మానవ జాతికి మూలకారణం స్త్రీ అన్నట్టుగా నిందిస్తాడు. హామ్లెట్‌కు వున్మాదం పెరుగుతున్నదని ఆమె కూడా నమ్ముతుంది.

కాని, రాజు దేన్నీ అంత సులభంగా నమ్మడు. హామ్లెట్ మనసునేదో తొలుస్తున్నది. దానివల్ల తనకూ ప్రమాదం పొంచి వున్నదని తెలుసు. రాకుమారుడు దేశం వదిలి ఇంగ్లండు వెళ్లేటట్టుగా ఒక ఆదేశం జారీ చెయ్యగలిగితే తప్ప పరిష్కారం లేదు.

హామ్లెట్ మానసిక స్థితి భగ్నప్రేమికుని లక్షణమే అని పొలోనియస్ యింకా నమ్ముతాడు. నాటకం ముగిసిన తర్వాత రాణి హామ్లెట్ స్థితికి కారణాలు కనుగొనటానికి ప్రయత్నించాలని సూచిస్తాడు రాజు.

నాటక ప్రదర్శనను పర్యవేక్షించటంలో నిమగ్నమైనాడు హామ్లెట్. అభినయం గురించి నటులకు సలహాలిస్తున్నాడు: విష ప్రయోగం సీనులో రాజు ముఖ కవళికల్ని బాగా పరిశీలించమని మిత్రుడికి నిర్దేశిస్తాడు హామ్లెట్. రాజూ, రాణీ, యితర సభికులూ ప్రదర్శన కోసం నిరీక్షిస్తుంటారు. ఓఫేలియా పాదాల చెంత కూర్చున్న హామ్లెట్ ఏదో వుపన్య సిస్తుంటాడు. "మర్డర్ ఆఫ్ గోంజాగో" ప్రారంభమవుతుంది. రాజు అసహనంగా అటూ యిటూ కదులుతాడు. "ఇదంతా కేవలం కల్పన. కట్టుకథ" అని నమ్మబలుకుతాడు హామ్లెట్, "వినోదం కోసమే. ఉత్తుత్తి విషం. తాగితే ఏ హాని జరగదు."

విషప్రయోగం సీను. తను చేసిన పనినే నాటకంలో యథాతథంగా ప్రదర్శించారని గ్రహిస్తాడు రాజు. ఆగ్రహంతో ప్రదర్శనను ఆపు చేస్తాడు. తన ప్లాను ఫలించింది. హామ్లెట్‌లో ఆనందోత్సాహం. తల్లి పిలుస్తుంది. అటోయిటో తేల్చుకునే సమయం వచ్చిందిక.

తన సింహాసనానికీ, ప్రాణాలకూ ముప్పు వాటిల్లిందని తెలుసుకుంటాడు రాజు. రోజెంక్రాంట్జ్, గిల్డర్‌స్టెర్న్‌లతో కలిసి హామ్లెట్‌ను హత్య చెయ్యటానికి కుట్ర చేస్తాడు. రాజు కూడా మనిషే, రాక్షసుడు కాదు. ప్రార్థనలు చేస్తాడు. తల్లి గది వైపు పోతున్నప్పుడు మోకరిల్లి కూర్చున్న రాజును చూస్తాడు హామ్లెట్. ఆ క్షణాన తన చిన్నాన్న వెన్నులో కత్తి దించవచ్చు. కాని యింత పసలేని ప్రతీకారమా? ప్రార్థనా సమయాన హత్యచేస్తే అతడు పుణ్యలోకాలకు పోయే ప్రమాదముంది. మరోసారి, నేరుగా నరకం మాత్రమే ప్రాప్తించే పద్ధతిలో చంపాలి.

ఏదో నివేదించ టానికి పోలోనియస్, రాణి శయ్యా మందిరానికి పోతాడు. నడచివస్తున్న హామ్లెట్ అడుగుల చప్పుడు విని తెరవెనక నక్కుతాడు. హామ్లెట్ మొహంలో కోపం చూసి అతడు తనను చంపటానికే వచ్చాడేమోననుకొని "హెల్ప్ హెల్ప్" అంటూ కేక వేస్తుంది రాణి. ఆమెకు సాయంగా పోలోనియస్ కూడా అరుస్తాడు. హామ్లెట్ ఆ స్వరం రాజుదనుకుని భయపడి తెర వెనక వున్న వ్యక్తిని కత్తితో పొడుస్తాడు. ఆ మరుక్షణమే తెలుస్తుంది. చంపింది వృద్ధ చాంబర్లేన్‌ని అని.

ఆగ్రహావేశంలో వున్న హామ్లెట్ ఎలాగైనా తల్లిచేత తప్పు అంగీకరింప చెయ్యాలని ప్రయత్నిస్తున్నాడు. ప్రాణాలు అరచేత పట్టుకుని నిల్చున్న తల్లికి, కొడుకు మాట ఒక్కటీ అర్థం కాదు. కోపంతో రగిలిపోతున్నాడని మాత్రం తెలుసు. హామ్లెట్ బిగ్గరగా అరుస్తూ ఆకాశంవేపు చూస్తూ వుపన్యాసం ప్రారంభించేసరికి, కొడుక్కు వున్మాదం బాగా పెరిగిందని ఆమెకు కూడా నమ్మకం కుదురుతుంది. ఈ లోగా తండ్రి ప్రేతం మరోసారి కనిపించి హామ్లెట్‌ను ప్రతీకారానికి పురికొల్పుతుంది. కొడుకు వాగ్ధాటి వినలేక, రాణికి మూర్ఛవచ్చినంత పనవుతుంది.

హామ్లెట్ పిచ్చి ప్రకోపించి పోలోనియస్‌ను చంపేశాడని రాజుతో చెబుతుంది రాణి. శవాన్ని హామ్లెట్ ఎక్కడ దాచాడో చూసిరమ్మని రాజు రోజెంక్రాంట్జ్, గిల్డర్‌స్టెర్న్‌లను ఆదేశిస్తాడు.

హామ్లెట్‌కు పిచ్చెక్కిందనే అందరూ నమ్ముతారు. రోజెన్‌కాంట్జ్, గిల్డర్‌స్టెర్న్‌ల వెంట హామ్లెట్‌ను ఇంగ్లండు పంపించటానికి నిర్ణయించాడు రాజు. ఆ దేశం చేరగానే హామ్లెట్‌కు మరణ శిక్ష విధించాలని రాజుగారిచ్చిన తాకీదు రోజెన్ క్రాంట్జ్, గిల్డర్‌స్టెర్న్‌లవద్ద వున్నది.

ఇంగ్లండుకు పయనమైన హామ్లెట్‌కు మార్గమధ్యంలో, డెన్మార్క్ గుండా పోలండ్‌కు కదులుతున్న నార్వే రాకుమారుని సైన్యం కనిపిస్తుంది. తమకు సంబంధించని ఒక

లక్ష్యం కోసం యింత మంది ధీరులు ప్రాణత్యాగాలకు సిద్ధంగా వున్నారన్న సత్యం హామ్లెట్ హృదయాన్ని కదిలించి వేస్తుంది. ప్రతీకారంలో జాప్యం జరుగుతున్నందుకు అసహనంగా వున్నది. తండ్రి మరణం ఓఫేలియాను కుంగతీసింది. ఆ అమాయకురాలి దుఃఖం అందరికీ కన్నీళ్లు తెప్పిస్తుంది. విషాదగీతాలాలపిస్తూ, మతిభ్రమించినట్టుగా కదులుతుంది ఓఫేలియా. ఆమె సోదరుడు, లార్టెస్, రాజే తన తండ్రిని హత్య చేశాడనుకుని తిరుగుబాటు జెండా ఎగరేస్తాడు. కాని కుర్రవాడి కోపం ఎలా అదుపులో పెట్టాలో రాజుకు తెలుసు. పొలోనియస్‌ను హత్యచేసింది హామ్లెట్. ఈ కోపమంతా తనమీద కాదు, అతడిమీద చూపించమని చెబుతాడు. రాకుమారుణ్ణి హత్య చెయ్యటానికి లార్టెస్ అంగీకరిస్తాడు. ద్యూయెల్‌లో విషపూరితమైన కత్తి ఉపయోగించి పని పూర్తిచేస్తాడు.

ఈ లోగా పరిస్థితి మారుతుంది. ఇంగ్లండుకు వెళ్లకుండా హామ్లెట్ తప్పించుకున్నాడు. ఎల్సినోర్‌కు తిరిగి వస్తున్నానని కబురు పెడతాడు. అక్కడ జరుగుతున్న విషయాలు కూడా హామ్లెట్‌కు తెలియవు. ముఖ్యంగా ఓఫేలియా యిక లేదన్న వార్త. కాలవ పక్కన ఒక చెట్టుకు వురేసుకోవటానికి ప్రయత్నించింది. కొమ్మ విరిగి నీటిలో పడినప్పుడు ఆమె ఆత్మ రక్షణకోసం ప్రయత్నించలేదు. విషాదగీతాలాలపిస్తూ మునిగి మరణించింది.

చర్చి ప్రాంగణంలో ఓఫేలియాను ఖననం చెయ్యాలి. సమాధి తవ్వటానికి యిద్దరు మాటకారి గ్రేవ్‌డిగ్గర్స్ వస్తారు. ఆత్మహత్యాపాపానికి ఒడగట్టినవాళ్లను చర్చిలాంటి పవిత్ర స్థలంలో ఖననం చెయ్యటం రివాజు కాదు. కాని వీళ్లు "గొప్పోళ్లు" గనక యిక్కడ పూడుస్తారేమోనంటూ దొకదు. హామ్లెట్ ప్రవేశం. సమాధి దగ్గర ఒక్కడే గ్రేవ్‌డిగ్గర్. వాడి మొహంలో విషాదం ఏ మాత్రం లేదు. కులాసాగా పాటలు పాడుకుంటున్నాడు.

రాజమందిరానికి త్వరగా చేరుకోవాలని హామ్లెట్‌కేమీ కోరికగా లేదు. స్మశానంలో చెల్లాచెదరుగా పడివున్న అస్తికలు హామ్లెట్‌ను ఆకర్షిస్తాయి. తనను చిన్నప్పుడు నవ్వించిన విదూషకుడు(యోరిక్) కంకాళం కనిపిస్తుంది. ఈ భౌతిక శరీరం ఎంత నశ్వరమో తెలిసివస్తుంది. విశ్వవిజేత అలెగ్జాండర్ కూడా యిలాగే ధూళిగా, ఏ చీమల పుట్టగానో మారి వుంటాడనుకుంటున్నప్పుడు ఒక శవయాత్ర అటుగా వస్తుంది.

ఓఫేలియా శవం. రాజపరివారమంతా వెంట నడిచింది. బాధతో పిచ్చెత్తినట్టుగా వున్నాడు లార్టెస్. ఆత్మహత్య గనక, శోక సందేశం చదవకూడదన్నాడు ప్రీస్టు. లార్టెస్‌కు అందుకు కోపంగా వున్నది. సమాధిలోకి దూకి తనమీద మట్టిగప్పమని అరుస్తాడు. ఈ అరుపులకు హామ్లెట్ కూడా సంయమనం కోల్పోయి తనూ సమాధిలో దుమికి లార్టెస్ కన్న బిగ్గరగా కేకలు వేస్తాడు. ఈ కాస్త మట్టేం కర్మ, భూ మండలమంతా తవ్వి తన మీద పోయమంటాడు.

కోటలో – సమాధి దగ్గర తన ప్రవర్తనకు పశ్చాత్తాపపడతాడు హామ్లెట్. లార్టెస్‌కు స్నేహ హస్తం అందించాలనుకుంటాడు. అప్పుడే, ద్యూయెల్‌కు ఛాలెంజ్ చేస్తూ లార్టెస్

రాసిన లేఖను తీసుకొస్తాడు రాజభటుడు. ఇది మిత్రుల మధ్య క్రీడ మాత్రమే అనుకుంటాడు. "కాని నా మనసు కీడు శంకిస్తున్నదని" హొరేషియోతో చెబుతాడు. "డ్యూయెల్ వద్దు, లార్టెస్‌కు క్షమాపణలు చెబుతాన"ంటాడు హొరేషియో.

"జరిగేది జరగకమానదు. అన్నింటికీ సిద్ధంగా వుండటమే మనం చెయ్యగలిగింది" అంటాడు హామ్లెట్. డ్యూయెల్‌ను తిలకించటానికి రాజసభ కొలువు తీరుతుంది. మధువు, కత్తి కూడా విషాక్తమైనవని తెలిసింది యిద్దరే – రాజు, లార్టెస్.

హామ్లెట్ సుదీర్ఘ క్షమాపణలతో రంగప్రవేశం చేస్తాడు. అది అతని జీవితంలో ... దృశ్యం. డ్యూయెల్ త్వరగానే ముగుస్తుంది. మొదటి రెండు రౌండ్లలో హామ్లెట్ గెలుస్తా... "అలసిపోయినట్టున్నావు. కొద్దిగా మధువు రుచి చూడ"మని సూచిస్తాడు రాజు. హామ్లెట్ మధుపాత్ర పక్కన పెట్టి మూడవ రౌండుకు వుద్యుక్తుడవుతాడు. రాణి అందులో... కొద్దిగా తాగుతుంది. రాజు ఆమెను రక్షించటానికి విఫల ప్రయత్నం చేస్తాడు. యోధులిద్దరు విషఖడ్గంతో గాయాలవుతాయి. "నా పాపానికి నేనే బలయినాను. ఈ కుట్ర చేసింది రాజు." అని చివరి డైలాగు చెబుతాడు లార్టెస్.

మరణాసన్నమైన హామ్లెట్ విషఖడ్గంతో రాజును పొడుస్తాడు. ఆ తర్వాత విష మధువు బలవంతంగా అతడి చేత తాగిస్తాడు. మృత్యువుతో పోరాడుతున్నా హామ్లెట్ తన కర్తవ్యం విస్మరించడు. డెన్మార్క్ రాకుమారిడిగా దేశ క్షేమమే తన లక్ష్యం.

హొరేషియోకు బాధ్యతలప్పగించి, నార్వే రాకుమారుణ్ణి డెన్మార్కును ఏలవలసిందిగా అభ్యర్థించమని చెబుతాడు. తరువాత నిశ్శబ్దం.

హొరేషియో తన అనుంగు మిత్రునికి కన్నీళ్లతో వీడ్కోలు చెబుతాడు.

నలుగురు రాజభటులు హామ్లెట్‌ను తీసుకుపోతారు. నాటకం చివరన డెన్మార్క్ రాకుమారునికి సైనికులు శ్రద్ధాంజలి సమర్పిస్తారు.



# 19. ట్రాయిలస్ అండ్ క్రెసిడా

నాటకం సరదాగానే సాగుతుంది. ముగింపు మాత్రమే విషాదం. గ్రీకు పురాణాలలోని ట్రోజన్ యుద్ధ వాతావరణాన్ని కళ్లకు కట్టినట్టు చూపిస్తుంది. హోమర్ కీర్తించిన సాహసవీరులు ఈ కథలో తరచూ గిల్లికజ్జాలు పెట్టుకునే చిన్నపిల్లల్లా కనిపిస్తారు. ప్రత్యేకంగా విలన్ అంటూ ఎవరూ లేరుగాని యుద్ధమే అన్ని అరిష్టాలకూ మూలం అనే సందేశం వుంది.

ట్రాయ్ యువరాజు పారిస్ ప్రపంచసుందరి హెలెన్‌ను అపహరిస్తాడు. ఆమె భర్త మెనెలాస్ గ్రీకు సైన్యాలను సమీకరించుకుని ఏడేళ్లుగా యుద్ధం చేస్తున్నాడు. ట్రాయ్ నగరాన్ని దిగ్బంధించారు. ఇరుపక్షాలూ పట్టు విడవలేదు. దీర్ఘకాల యుద్ధంలో విసుగు, అలసట ప్రవేశించాయి. ఎంత ప్రయత్నించినా ట్రాయ్ కోటగోడలు చెక్కు చెదరలేదు.

ట్రాయ్‌లో కథ ప్రారంభమవుతుంది. పారిస్ సోదరుడు ట్రాయిలస్, క్రెసిడా అనే సుందరి ప్రేమలో పడ్డాడు. ఆమె అంకుల్‌ని మధ్యవర్తిగా పెట్టుకుని ప్రేయసికి విన్నపాలు పంపిస్తున్నాడు. కాని ఎన్నాళ్లకూ ఆమె కరుణించలేదు. ట్రాయిలస్‌కు అంకుల్ మీద

వినుగొచ్చింది. చులకనచేసి అవమానిస్తాడు. అంకుల్‌కు కోపం వస్తుంది. "నా సహాయానికి యిదన్నమాట నీ కృతజ్ఞత." అంటూ నిష్క్రమిస్తాడు.

యుద్ధభేరీ మోగుతుంది. కాని ట్రాయిలస్ యిప్పుడు ప్రేమలోకంలో ఉన్నాడు. క్రెసిడాను ప్రసన్నం చేసుకోవటమే అతడి ఏకైక లక్ష్యం. హెలెన్ లాంటి "సామాన్య స్త్రీ" కోసం యింత యుద్ధం అనవసరమనుకుంటాడు.

ట్రాయిలస్‌ను ప్రేమికుడిగా అంగీకరించమని క్రెసిడాకు నచ్చచెప్పే ప్రయత్నం చేస్తాడు అంకుల్. మగసిరి వుట్టిపడే అతడి విగ్రహాన్ని వర్ణిస్తాడు. క్రెసిడాకు కథంతా పరిహాసంగా తోస్తుంది. (గ్రీక్) "ఆకిలీస్ కూడా అతడికన్నా మెరుగే" అంటుంది. "అకిలీస్ సంస్కారహీనుడు, జంతువు - ట్రాయిలస్ చురుకైనవాడు. బుద్ధిమంతుడు. అందగాడు" అని వర్ణిస్తాడు అంకుల్.

"ట్రాయిలస్ తనకు ప్రియుడు కావటానికి అర్హుడే." అని క్రెసిడా గ్రహించింది. కాని మగాళ్లను ఎలా ఆడించాలో ఆమెకు బాగా తెలుసు. వాళ్లను వెంట తిప్పుకోవాలంటే యిష్టం లేనట్టుగా నటించాలి. "వలలో చిక్కని వనితంటే పడిచస్తారు పురుషులు"

గ్రీకుల యుద్ధ శిబిరం. సైన్యాధిపతి ఆగమెమ్నన్ సమక్షంలో సమావేశం జరుగుతున్నది. యుద్ధం అనుకున్న ఫలితాలు సాధించలేదని నేతల అభిప్రాయం. ఏడేళ్ల ముట్టడి తర్వాత కూడా ట్రాయ్ లొంగలేదు. గ్రీకు సైనికుల్లో అసంతృప్తి మొదలైంది. కొందరు శతృపక్షంలో చేరే ప్రమాదం లేకపోలేదు. ప్రకృతి నియమాలననుసరించే విశ్వమంతా విలసిల్లుతున్నదనీ, సమాజ క్షేమానికి అవి అవసరమనీ వుపన్యసిస్తాడు యులిసిస్ అనబడే వీరుడు. ఈ నీతిబోధకు అసలు కారణం అకిలీస్. అతడు సమావేశానికి వచ్చి, చర్చను ఖాతరు చెయ్యక వికటాట్టహాసం చేస్తూ పడుకున్నాడు. అకిలీస్‌ను కట్టడి చెయ్యకపోతే శిబిరంలో క్రమశిక్షణ అసాధ్యం. గ్రీకు సైన్యంలో తను అతి ముఖ్యుడిననీ, ఏం చేసినా తననెవరూ నిలువరించలేరనీ అకిలీస్ అహంకారం. ట్రాయ్ వీరుడు హెక్టర్, గ్రీకులలో ఎవరైనా ఒకడితో ముఖాముఖీ యుద్ధానికి సిద్ధమని సందేశం పంపిస్తాడు. "ఎవరైనా" అంటే అతడి దృష్టిలో వున్నది అకిలీస్ ఒక్కడే. గ్రీకులు (దొంగ) లాటరీ వేసి తమ తరుపున అజాక్స్ పేరు నిర్ణయిస్తారు. అతడు "తెలివితేటలు లేని మూర్ఖుడు." అకిలీస్‌ను యుద్ధం చెయ్యమంటే అతడి దురుసుతనానికి యిక హద్దులుండవు. అజాక్స్‌ను ఎంపిక చెయ్యటం వల్ల అతడి అహంకారానికి అడ్డుకట్ట వేసినట్టవుతుంది.

హెక్టర్ పంపిన సందేశమేమిటో వివరంగా చెప్పమని థెర్సైటిస్‌ను అడుగుతాడు అజాక్స్. "రాస్కెల్‌ని, దుర్మార్గుణ్ణి" అని తనను తాను వర్ణించుకుంటాడు థెర్సైటిస్. అది నిజమే గాని, అతడికి మూర్ఖులంటే అసహ్యం. ముఖ్యంగా అజాక్స్ అంటే మరీ అసహ్యం. "వాడో అడ్డగాడిద." హెక్టర్ ఛాలెంజి గురించి అకిలీస్‌కు తెలుస్తుంది. అది తన

పర్యవేక్షించి పంపిన సందేశమని కూడా అతడికి తెలుసు.

ట్రాయ్ నగరంలో - హెలెన్‌ను ఆమె భర్తకు తిరిగి అప్పగించి యుద్ధం ముగించాలని ఆలోచిస్తున్నారు రాజూ, అతని ముగ్గురు కుమారులూ. "ఆమె కోసం యుద్ధం చెయ్యవలసిన అవసరం లేదు." అంటాడు హెక్టర్. ఆమె విలువెంతన్నది ముఖ్యం కాదు. ఇంత నష్టం, రక్తపాతం జరిగిన తర్వాత ఆమెను తిరిగి పంపిస్తే ట్రాయ్ పరువు ప్రతిష్టలు మంటకలుస్తా"యంటాడు ట్రాయిలస్. హెక్టర్ అంగీకరిస్తాడు.

థెర్సైటిస్ దృష్టి వేరు. యుద్ధమంటే కీర్తి, గౌరవం కాదు. యుద్ధమంటే మృత్యువు. సర్వనాశనం. ఆకలి. యిక్కట్లు. జీవిత వాస్తవికతను దర్శించలేని అంధులు సైనికాధికారులు.

యుద్ధంలో పాల్గొనమని అకిలీస్‌కు నచ్చచెప్పటానికి ప్రయత్నిస్తాడు గ్రీక్ సైన్యాధిపతి అగమెమ్నన్. కాని అకిలీస్‌ది చిన్నపిల్లాడిలా మంకుపట్టు. వినడు. అజాక్స్ శౌర్య పరాక్రమాలను కీర్తిస్తాడు. అలాగైనా అకిలీస్‌లో కదలిక వస్తుందేమోనని అందరూ కలిసి అజాక్స్‌ను హెక్టర్‌తో యుద్ధానికి పురికొల్పుతారు.

ట్రాయ్‌లో, క్రెసిడాను ఒప్పిస్తాడు అంకుల్. తన తోటలో ట్రాయిలస్‌ను కలుసుకుంటుందామె. క్రెసిడా సమక్షంలో నోరుమెదపలేడు ట్రాయిలస్. "అలా సిగ్గుపడకు. ఇన్నాళ్లు రాలేదన్నావు. ఇప్పుడు ముదుచుకు పోతున్నావు" అంటూ ప్రోత్సాహపరుస్తాడు అంకుల్. ఆ తర్వాత వాళ్ల ప్రణయ క్రీడకు కావలసిన ఏర్పాట్లన్నీ చేస్తాడు.

"అంతా నీదే భారం" అంటుంది క్రెసిడా చిలిపిగా నవ్వుతూ.

"నువ్వే నా ప్రాణం. నా జీవితం నీకే అంకితం" అంటూ ప్రేమ వాగ్దానాలు చేస్తుంది. ఆమె మనసులో నిజంగా అంత ప్రేమ వున్నది. గ్రీకు శిబిరంలో వున్న ఆమె తండ్రి బందీల మార్పిడి జరిగినప్పుడు కూతుర్ని తన వద్దకు వచ్చెయ్యమన్నాడు. యుద్ధ ఫలితంగా ఆమెకు ట్రాయిలస్ వియోగం తప్పదు. ఆ తర్వాత అతణ్ణి మరచిపోతుంది కూడాను.

క్రెసిడాను వెంట తీసుకురమ్మని గ్రీకులు ఒక యువ కమాండర్‌ను పంపిస్తారు.

అకిలీస్‌ను వుడికించటానికి మిగతా నాయకులు అతని వునికినే గమనించనట్లుగా ప్రవర్తిస్తారు. అకిలీస్‌కు కోపం వస్తుంది. "ఎందుకింత కృతఘ్నత! నేను చేసిన సహాయమంతా మరచిపోయారా?" అంటూ అరుస్తారు. యులిసిస్ మరో ఉపన్యాసమిస్తాడు.

"మనుషుల్నీ మరచిపోతారు. మనుషులు చేసిన పనుల్నీ మరచిపోతారు. కృతఘ్నత లోక లక్షణం. ప్రేమ ఒక్కటే అందర్నీ కలిపే బంధం. ఇప్పుడు వాళ్లు అజాక్స్‌ను ఆకాశానికెత్తుతారు."

అకిలీస్ యుద్ధ విముఖతకో కారణం వున్నది. అతడు ఒక ట్రాయ్ రాజకుమారితో ప్రేమలో పడ్డాడు. కాని అవమానాల్ని భరించలేడు. హెక్టర్‌తో అజాక్స్‌కు బదులు తానే

యుద్ధం చెయ్యాలని నిర్ణయించుకుంటాడు. అటు అజాక్స్ కూడా హెక్టర్‌ను పరాజితుణ్ణి చేసినట్టు కలలు కంటుంటాడు. థెర్సైటిస్, అజాక్స్‌ను పరిహసిస్తాడు. "వీడు హెక్టర్ చేతిలో మట్టికరుస్తాడు. లేదా తన అహంకారంతో నవ్వులపాలవుతాడు."

రాత్రంతా ప్రియుడితో గడిపిన క్రెసిడా తెల్లవారి వీడ్కోలు తీసుకొంటుంది. గ్రీకు శిబిరానికి తీసికెళ్లటానికి మనిషి వస్తాడు. తమది దీర్ఘ వియోగం కాబోతున్నదని యిద్దరికీ తెలుసు. అయినా ప్రేమ శాశ్వతమని వాగ్దానాలు చేసుకుంటారు.

క్రెసిడా వుత్సాహంగా, వుల్లాసంగా గ్రీకుల వద్దకు వస్తుంది. (కాసేపటి క్రితమే ప్రియుణ్ణి వదలటానికి కళ్లనీళ్ల పర్యంతమైన క్రెసిడా!). అనేకమంది కమాండర్లను ముద్దు పెట్టుకుని అభివాదం చేస్తుంది. యులిసిస్‌కు ఆమె ప్రవర్తన నచ్చదు.

"అదేమి నడక. అవేమి చూపులు. ఆమె చేతల్లో విశృంఖలత కనిపిస్తుంది"

నగారా మోగుతుంది. కవచం ధరించి హెక్టర్ ప్రవేశిస్తాడు. అజాక్స్ అతడి కజిన్. సోదరుడితో యుద్ధం చెయ్యటం హెక్టర్‌కు యిష్టం లేదు. కాసేపు లాంఛనంగా కత్తులాడించి యిద్దరూ పరస్పరం ప్రేమగా పలకరించుకుంటారు. వీరందరూ వీరుల కోవకు చెందినవాళ్లు. యుద్ధ మర్యాదలు ఖచ్చితంగా పాటిస్తారు. పోరాట సమయంలో మాత్రమే శత్రుత్వం ప్రదర్శించాలి. ఈ మర్యాదలను వుల్లంఘించిన వాడు అకిలీస్ ఒక్కడే.

యుద్ధం చూడటానికి ట్రాయిలస్ కూడా హెక్టర్‌తో కలిసి వస్తాడు. రాత్రి వేళ అందరూ భోజనాలు చేస్తున్నప్పుడు క్రెసిడాను చూడటానికి వెళతాడు. శిబిరంలో ఆమె ఆ యువ కమాండర్‌తో సరిగ్గా తనతో వున్నట్టుగానే ప్రణయ కలాపంలో మునిగి వున్నది. ఆ కమాండర్‌కు అంత యిష్టం లేనట్టుంది. అతణ్ణి వుండిపొమ్మని ప్రార్థిస్తూ ఆమె ట్రాయిలస్ తనకిచ్చిన కానుక యిస్తానంటుంది. ట్రాయిలస్ బాధగా అంతా గమనిస్తాడు.

అంతలోనే ఆమె ట్రాయిలస్‌ను జ్ఞాపకం చేసుకుని కానుక తిరిగి యివ్వమంటుంది "ఇవ్వను. నీకిది ఎవరిచ్చారు?" అని అడుగుతాడు కమాండర్. ఇక ట్రాయిలస్ చెయ్యగలిగిందొక్కటే. మర్నాడు యుద్ధంలో తను ఆ కమాండర్ను చంపాలి.

తెల్లవారి హెక్టర్ మళ్లీ యుద్ధానికి సిద్ధమవుతాడు. "ఇవాళ పోరాటం వద్దు" అని వారిస్తారు భార్యా, సోదరీ. హెక్టర్ పరువుకోసం, ట్రాయిలస్ ప్రతీకారం కోసం ప్రత్యర్థులను తుదముట్టించక తప్పదు.

అందరూ శౌర్యపరాక్రమ వంతులే. కాని యుద్ధ పర్యవసానమెప్పుడూ వినాశమే "ఎలాగైనా సరే" హెక్టర్‌ను చంపాలనుకుంటాడు అకిలీస్. అతడు నిరాయుధుడుగా వున్నప్పుడు అందరూ చుట్టుముట్టగా అకిలీస్ హత్యచేస్తాడు. ఆ తర్వాత అతడి మృతదేహాన్ని తన గుర్రపు తోకకు కట్టి ఈడ్చుకుపోతాడు. షేక్స్పియర్ కథలో అలా ముగుస్తుంది మహా సంగ్రామం. హెక్టర్ యుద్ధంలో మరణించలేదు. కుట్రచేసి అతణ్ణి చంపారు.



# 20. ఒథెల్లో

మెలోడ్రామా ప్రధానమైన ట్రాజెడీ ఒథెల్లో. అద్భుతమైన పాత్రచిత్రణ, కవితావైశిష్ట్యం దీన్ని సాహిత్య శిఖరాలకు చేర్చాయి. ధీరోదాత్తుడూ, అమాయకుడూ అయిన కులీన పురుషుడిలో అసూయ ప్రవేశించి ఆత్మనాశనానికే కాదు, తను ప్రాణప్రదంగా ప్రేమించిన వ్యక్తిని కూడా మానసికంగా చిత్రహింసకు గురిచేసి చివరికి చంపటానికి కారణమవుతుంది. మనుషుల దుష్టత్వాన్ని అనేక కోణాలనించి అధ్యయనం చేసిన కథయిది. విషప్రయోగం చేసినవాడు తాచుపాములాంటి ఇయాగో. జీవితాల్లో చిచ్చుపెట్టటం అతనికో వినోదం..

రాత్రి. వెనిస్ నగర వీధులు. సైన్యంలో పనిచేస్తున్న ఇయాగో, మరోవ్యక్తి రోడెరిగో సంభాషణలో నిమగ్నమై వున్నారు. మూర్ (పశ్చిమోత్తర ఆఫ్రికాకు చెందిన ముస్లింలు) జాతికి చెందిన ఒథెల్లో అంటే తనకెందుకు ద్వేషమో చెబుతున్నాడు ఇయాగో. ఒథెల్లో సైనిక జనరల్. తను లెఫ్టినెంట్ కావాలని కలలు కన్నాడు ఇయాగో. కాని ఒథెల్లో, అనుభవం లేని మరో సైనికుడు, మైకెల్ కాసియోకు ఆ పదవి యిచ్చి, ఇయాగోను తన అసిస్టెంట్‌గా మాత్రమే పెట్టుకున్నాడు.

"ప్రతీకారం తీర్చుకోవటానికే నేనింకా ఈ మూర్ దగ్గర కొలువు కొనసాగుతున్నాను." అంటాడు ఇయాగో. వ్యూహం కూడా తయారుచేసి పెట్టుకున్నా(డు) ఆ రాత్రి వెనిస్ సుందరి డెస్డెమోనాను రహస్యంగా వివాహమాడాడు ఒథెల్లో. ఈ మధువులో విషం కలపటమెంతసేపు? ఎలాగైనా వాళ్ల వివాహబంధాన్ని విచ్ఛి(న్నం) చెయ్యాలి. ఈ కార్యంలో రోడెరిగో తనకు సహాయం చేస్తాడు. (డెస్డెమోనాను రోడె(రిగో) గాఢంగా ప్రేమించాడు.)

వ్యూహంలో తొలిమెట్టు: డెస్డెమోనా తండ్రి యింటి ముందర నిల్చొని, కూ(తుర్ని) ఒక నల్లజాతివాడు (మూర్) లేపుకుపోయాడని గోల చెయ్యాలి. డెస్డెమోనా తండ్రి (ఒక) కౌన్సిల్లో సెనేటర్. "అందువల్ల వివాహం రద్దు చెయ్యగలడు." అనుకుంటాడు రోడె(రిగో) కాని అదంత సులభం కాదని ఇయాగోకు తెలుసు. ఒథెల్లో పరాక్రమవంతుడైన (సైని)... టర్కిష్ యుద్ధాల్లో సెనేట్‌కు అతడి అవసరం వుంది.

ఇయాగో ప్లాను ప్రకారం, తను నమ్మిన బంటుగా ఒథెల్లోకు కనిపించాలి. "(లోప)... ఎంత ద్వేషం దాచుకున్నా పైకి మంచి మిత్రుడిలాగే నటించాలి." రోడెరిగోను (వది)... నడచిపోతాడు ఇయాగో.

రోడెరిగో అరుస్తాడు. డెస్డెమోనా తండ్రి బయటికి వస్తాడు. కూతురు నల్లవా(డితో) లేచిపోయినందుకు లబోదిబోమంటాడు. పైగా డెస్డెమోనా చిన్నపిల్ల. ఒథె(ల్లో) మధ్యవయస్కుడు. బహుశా మాయచేసి దాన్ని వశపర్చుకున్నాడేమో.

వెదికి వెదికి వీధిలో ఒథెల్లోను కనుగొంటాడు డెస్డెమోనా తండ్రి. కూ(తుర్ని) తనక్కాకుండా చేసినందుకు నిందిస్తాడు. "నేను కౌన్సిల్ మీటింగ్‌కు వెళుతున్నా(ను)... జైల్లో పెట్టటం సాధ్యంకాదు." అంటూ ప్రశాంతంగా, మర్యాదగా జవాబిస్తాడు ఒథె(ల్లో) మీటింగున్న విషయం వృద్ధ సెనేటర్‌కు తెలుస్తుంది. తనకు జరిగిన అన్యా(యం) చెప్పుకోగలిగిన చోటు అదే.

డ్యూక్ ఆఫ్ వెనిస్, కౌన్సిల్‌కు అధ్యక్షుడు. టర్కిష్ సైన్యాలు సైప్రస్ మీదికి దండె(త్తి) వస్తున్నాయని తెలిసింది. శత్రువులను ఎదిరించటానికి ఒథెల్లోను పంపించాలని కౌ(న్సిల్) చర్చిస్తున్నది. ఆ సమయంలో డెస్డెమోనా తండ్రి, ఒథెల్లోను మంత్రగాడని ఆరో(పిస్తూ) ప్రవేశిస్తాడు. ఒథెల్లో తన భార్యను కౌన్సిల్ ముందర ప్రవేశపెట్టమంటాడు. తమ ప్రే(మ) వ్యవహారం ఎలా ప్రారంభమైందో కూడా వివరిస్తాడు.

"నేనామెకు నా సాహస యాత్రల గురించి చెప్పాను. ఒకసారి నన్ను బానిస(గా) అమ్మేశారు. విశాలమైన, నిర్మానుష్యమైన ఎడారులలో, పర్వతాలలో, క్రూరజంతువు(ల) మధ్య నడిచి, ఎన్నో కష్టాలకోర్చి ఈ స్థితికి వచ్చాను. బహుశా ఆమె నా సాహ(స) జీవితాన్ని యిష్టపడిందేమో. నేనామెమీద ప్రయోగించిన మంత్రమిదే."

డెస్డెమోనా ప్రవేశం. ఒకవైపు భర్త, మరోవైపు తండ్రీ. వెనిస్‌లోని ఒక సంపన్నుల

భార్య కావలసిన డెస్డెమోనా. చివరికి ఆ సౌందర్యాన్ని సౌకుమార్యాన్ని ఆకర్షించింది ఒథెల్లో వ్యక్తిత్వం. వయసులో పెద్దవాడయినా, మరోజాతి వాడయినా ఆమెకవేమీ అడ్డంకులు కాలేదు.

నీ యజమాని ఎవరో చెప్పమ'ని కౌన్సిల్ అడిగినప్పుడు తండ్రిని కాక, ఆ రాత్రి వివాహమాడిన భర్తనే ఎంచుకున్నది. తండ్రి ఓటమి అంగీకరిస్తాడు. ఇక చెయ్యిగలిగిందేమీ లేదు.

సైప్రస్ రక్షణకోసం తక్షణమే ఒథెల్లోను బయల్దేరమంటాడు డ్యూక్. వెంట డెస్డిమోను తీసికెళ్లటానికి అనుమతి వున్నది. అయినా తాత్కాలికంగా భార్యను ఇయాగో రక్షణలో పెట్టి ఒంటరిగా బయల్దేరతాడు ఒథెల్లో. కొద్దిరోజుల్లోనే ఆమెవచ్చి తనను కలుసుకుంటుంది. ఒథెల్లో దృష్టిలో ఇయాగో "గొప్ప నిజాయితీపరుడు. విశ్వాసపాత్రుడు."

సెనేట్ మీటింగ్ ముగుస్తుంది. ఇయాగో, రోడెరిగో మాత్రమే మిగుల్తారు హాల్లో. డెస్డిమోనా ప్రేమ దక్కలేదు గనక రోడెరిగో సముద్రంలో మునిగి ఆత్మహత్య చేసుకోవాలనుకుంటాడు. "నువ్వెందుకు మునగటం? కుక్కల్నీ, పిల్లుల్నీ ముంచు. ఒక ఆటవిక మూర్‌తో పెళ్లి ఎన్నాళ్లు కొనసాగగలదు?" అంటూ ధైర్యం చెబుతాడు ఇయాగో. తనను పక్కనపెట్టి లెఫ్టినెంట్ అయిన కాసియో పట్ల కూడా ఇయాగో ద్వేషంతో రగిలి పోతున్నాడు.

వాతావరణాన్ని, మనుషుల్ని, సంబంధాల్ని విషపూరితం చెయ్యటం అతడి ప్రత్యేకత. ఈ ప్రేమ వివాహం తన ద్వేషాగ్నితో భస్మం కావాలన్నదే అతడి ఏకైక లక్ష్యం.

సైప్రస్. యుద్ధవార్తలకోసం నిరీక్షిస్తున్నాడు గవర్నర్. తుఫాను తాకిడికి టర్కిష్ నావలు సముద్రంలో మునిగిపోయాయి ఒథెల్లో నావ ఎలాగుందోనని సందేహం. వెనిస్ నించి మరో నావ వచ్చింది. డెస్డిమోనా, ఇయాగో, అతడి భార్య ఎమిలియా వస్తారు. (ఎమిలియా, డెస్డెమోనాకు చెలికత్తెగా వుంటున్నది.)

భర్త క్షేమాన్ని గురించి దిగులు పడుతున్నది డెస్డెమోనా. కాని సెనేటర్ కూతురిగా, తన ఉద్వేగాలను అదుపులో పెట్టుకోగల సామర్థ్యం అలవర్చుకుంది. తన భర్తకు మరో సన్నిహితుడు కాసియో. అతడితో కబుర్లు ప్రారంభిస్తుంది. కాసియో ఆమె చేతిని పట్టుకుని మాట్లాడతాడు. ఒథెల్లో ప్లాను అదే. వీళ్లిద్దరూ ప్రేమికులని ఒథెల్లోను నమ్మించాలి. ఈ అమాయిక స్నేహాన్ని, మోహబంధంగా చిత్రించగలిగితే తన వ్యూహం ఫలించినట్టే.

ఒథెల్లో క్షేమంగా ఒడ్డుకు చేరుకుంటాడు. ఆప్యాయంగా భార్యను ఆలింగనం చేసుకుంటాడు.

తన వివాహ సందర్భంగా ఆ రాత్రి అందరికీ విందు అవసరమైన ఏర్పాట్లు చూడమని కాసియోకు పురమాయిస్తాడు.

ఆ సాయంత్రం, ఒథెల్లో గౌరవార్థం కొద్దిగా మద్యం సేవించాలని కాసియోకు

సూచిస్తాడు ఇయాగో. కాసియో తాగితే రోడెరిగో అతడితో పోట్లాట పెట్టుకోవచ్చు "ఈ రాత్రి వద్దు. తాగితే నా అడుగులూ, మాటలూ తడబడతాయి" అంటాడు కాసియో. "జల్సా చేసుకునే రాత్రి యిదే." తాగనివాడు మగాడు కాదని దెప్పిపొడుస్తాడు ఇయాగో. చివరికి కాసియో తాగుతాడు.

త్వరలోనే తూలుతాడు. అనేక రకాల పిచ్చి కబుర్లు చెప్పి "నేను తాగలేదు. నిషాలేదు. చూడండి. ఇది నా కుడి చెయ్యి. ఇది నా ఎడమ చెయ్యి. చక్కగా నడవగలను ... యింకేం కావాలి" అంటూ వాగుతాడు. "నువ్వు తాగలేదులే" అని అందరూ బుజ్జగించి వెళ్లిపోతారు. రోడెరిగో ఎలాగైనా పోట్లాట పెట్టుకోవాలని నిరీక్షిస్తున్నాడు. సైప్రస్ ద్వీపపు మాజీ గవర్నర్ యిద్దర్నీ విడదియ్యబోతాడు. కాని కాసియో కత్తితో గాయపరుస్తాడు.

పోట్లాట ఆపటానికి ప్రయత్నిస్తున్నట్టుగా నటించి ఇయాగో మరింత గొడవ సృష్టిస్తాడు. ఒథెల్లో వస్తాడు. తప్పంతా కాసియోదేననుకుంటాడు. అతణ్ణి ఉద్యోగం నుండి తొలగిస్తాడు.

కాసియో పశ్చాత్తాపపడతాడు. డెస్డెమోనా చెబితే ఒథెల్లో మళ్లీ వుద్యోగం యిస్తాడంటాడు ఇయాగో. జనరల్‌కు భార్యంటే ప్రేమ. ఆమె కోరిక కాదనడు. డెస్డెమోనాది కూడా సహాయం చేసే స్వభావం.

మరుసటిరోజు డెస్డెమోనాను సహాయం కోసం అర్థించాలనుకొంటాడు కాసియో. "ఆమె ప్రేమికుని కోసం సాయమడుగుతున్నదని ఒథెల్లో నమ్మాలి." అదీ ఇయాగో వ్యూహం.

ఆమె సుగుణమే ఆమెకు మరణశాసనం కావాలి.

తెల్లారి వుదయం. డెస్డెమోనా నివాసానికి వస్తాడు కాసియో. భర్తకు నచ్చచెబుతానని అభయమిస్తుంది డెస్డెమోనా. అప్పుడే ఒథెల్లో, ఇయాగోల ప్రవేశం. "అనుంగు మిత్రుడిగా నటిస్తున్న ఇయాగో, ఒథెల్లో వైపు "వాళ్లెంత ప్రేమగా మాట్లాడుకుంటున్నారో" అన్నట్టు చూస్తాడు.

"ఏం జరుగుతున్నది?" అంటూ ప్రశ్నిస్తాడు ఒథెల్లో. "నాకెలా తెలుస్తుంది - ఎవరి మనసులో ఏముందో....... "ఇప్పటిదాకా యిక్కడవున్నది కాసియో కాదూ..... "అతను అలా దొంగలా ఎందుకు వెళ్లిపోయాడు...."

ఇయాగో విషకోరలతో కాటేశాడు.

కాసియో గురించి అభ్యర్థించడానికి వచ్చింది డెస్డెమోనా. అతడు మంచివాడు, సమర్థుడు. చివరికి ఒథెల్లో కాసియోను తిరిగి వుద్యోగంలోకి తీసుకోవటానికి సుముఖత వ్యక్తం చేస్తాడు. ఇయాగో ఈ క్షణం కోసమే నిరీక్షిస్తున్నాడు. డెస్డెమోనా నిష్క్రమించాక చాలా ప్రేమగా, కాస్త బాధగా, "వాళ్లిద్దరకీ యిదివరలో పరిచయముందా? "అంటూ సందేహంగా చూస్తాడు. వాళ్లిద్దరూ స్నేహితులని ఒథెల్లోకు తెలుసు. "అతడే వాళ్ల

పెళ్ళి కుదిర్చింది." అంటాడు.

ఇయాగో మరింత బాధ నటిస్తాడు. మిత్రుడి సమస్య తన సమస్య. "భార్య గత జీవితం తెలుసుకోవాల్సిన హక్కు ప్రతి భర్తకూ ఉంటుంది." చివరికి ఒథెల్లోతో అడిగించుకుని, ప్రతిమాలించుకుని, చాలా అయిష్టంగా విధిలేక చెబుతున్నట్టుగా, "వాళ్ళిద్దరూ ప్రేమికులనుకుంటాను." అంటాడు. "నేనిలాంటి విషయాలెప్పుడూ మాట్లాడను. నీ మీది ప్రేమతో చెప్పక తప్పలేదు. "ఇంత ఘోరం చెప్పవలసి వచ్చినందుకు క్షమించు...."

ఒథెల్లో మనసులో విషం నింపటానికి రెండు విషయాలు సహాయం చేశాయి. ఒకటి: ఇయాగో వయసుమళ్ళినవాడు. మంచి మిత్రుడు. రెండు: ఆచారాలను ధిక్కరించి జరిగిన వివాహం. డెస్డెమోనా ప్రేమ తప్ప వివాహానికి మరో ఆధారం లేదు. అసలు, కాసియోలాంటి అందగాడి ప్రేమను కాదని ఆమె తననెందుకిష్టపడ్డది? వెనిస్‌లో వున్నప్పుడు డెస్డెమోనా తండ్రి ఒక హెచ్చరిక చేశాడు.

"మూర్, కళ్ళు తెరచి చూడు. నా కూతురు నా కళ్ళు గప్పింది. నిన్ను కూడా మోసం చెయ్యకుండా జాగ్రత్తపడు."

ఇప్పుడు ఇయాగో మళ్ళీ అదేమాట వల్లిస్తాడు.

"నిన్ను పెళ్ళి చేసుకోవటానికామె తన తండ్రిని మోసం చేసింది."

డెస్డెమోనా గత జీవితం ఒథెల్లోకు తెలియదు. తెలిసిందొక్కటే. తనామెను ప్రాణాధికంగా ప్రేమిస్తున్నాడు. ఇయాగో మాటలతో తన ప్రేమలోకం కళ్ళముందే దహించుకు పోతున్నది.

భర్తను భోజనానికి రమ్మని పిలుస్తుంది డెస్డెమోనా. ఒథెల్లోను అనుమానం తొలుస్తున్నది. ఇయాగో చెప్పింది అబద్ధం కావచ్చు. కాని భార్యను పూర్తిగా నమ్మవచ్చా? భర్త ప్రవర్తనలో వచ్చిన మార్పు డెస్డెమోనాకు అర్థంకాలేదు.

"ఒంట్లో బాగోలేదా?" అని అడుగుతుంది. తలనొప్పిగా వుందంటాడు ఒథెల్లో. ఆమె తన చేతి రుమాలుతో కట్టు కడుతుంది. అతను తల విదిలించుకుంటాడు. జేబురుమాలు జారి నేలమీద పడుతుంది.

స్ట్రాబెర్రీపళ్ళు అల్లిన సిల్కు జేబురుమాలది. భర్త తనకు తొలిసారిగా యిచ్చిన కానుక - అతని నుండి దూరంగా వున్నప్పుడల్లా ముద్దాడుతూ, దానితోనే మాట్లాడుతూ గడిపేది. ఇయాగో కొంత కాలంగా ఆ జేబురుమాలును దొంగిలించమని తన భార్య ఎమిలియాతో పోరుతున్నాడు. డెస్డెమోనా భర్త గురించిన ఆందోళనలో జేబురుమాలు కిందపడిన విషయం గమనించలేదు. ఎమిలియా దాన్ని తీసుకొని ఇయాగోకిచ్చింది. అతడికది చాలా అవసరం. కాసియో గది దగ్గర దాన్ని పడెయ్యాలని పన్నాగం.

ఒథెల్లో ప్రవేశం. ఇయాగో సంతోషంగా పలకరిస్తాడు. ఒథెల్లోకిక నిద్రవుండదు.

ఎన్ని మందులు తీసుకున్నా కళ్లు మూతలుపడే ప్రసక్తి లేదు. నల్లమందు సేవించి మధువు తాగినా, మరేమి చేసినా నిద్రకు మాత్రం దూరం ఒథెల్లో.

ఒథెల్లోను అనుమానభూతం ఆవహించింది. ఆమె మరొకర్ని ప్రేమించిందని తెలిసినా కొంత మనశ్శాంతి వుండేది. ఒథెల్లో సందిగ్ధతను పసిగట్టిన ఇయాగో అనేక విషయాలు కల్పించి చెప్పటం ప్రారంభిస్తాడు. కాసియో నిద్రలో కలవరిస్తున్నప్పుడు తను విన్నాడట డెస్డెమోనాతో తను గడిపిన మధుర క్షణాలు జ్ఞాపకం చేసుకున్నాడతడు. ఇలా ఒక్కొక్కటే చెప్పి చివరికి అబద్ధం నిజమని నమ్మిస్తాడు. "అలాంటి వాళ్లంతే...ఇంకా ఆమెమీద ఎందుకు ప్రేమ...." కాసియో ప్రాణాలకే ప్రమాదం వాటిల్లవచ్చు. ఇయాగో కోరింది దొరుకుతుంది. "ఇక నువ్వే నా లెఫ్టినెంటువు" అంటాడు ఒథెల్లో.

కాసియోకు వర్తమానం పంపిస్తుంది డెస్డెమోనా. "నా భర్తకు నీ విషయం చెప్తాను నీ వుద్యోగం తిరిగి వస్తుంది." ప్రస్తుతం ఆమెను బాధిస్తున్న విషయం ఒక్కటే: తన జేబురుమాలు ఎక్కడ పడిపోయిందో అర్థం కావటంలేదు. "ఆ జేబురుమాలెక్కడుంది?" అని ఒథెల్లో అడిగినప్పుడు ఆమె యిరకాటంలో పడింది. భర్త కోపం పెరిగిపోయింది ఎక్కడో పోగొట్టుకున్నానంటే మరెంత కోపగిస్తాడో! కాసియో గురించి ప్రస్తావించాలనుకుంటుంది. కాని ఒథెల్లో "జేబురుమాలు!" అంటూ కేకలేస్తాడు. అది కాసియో దగ్గరుందనీ, ఆమె అది అతనికిచ్చిందనీ ఒథెల్లో నమ్మకం. ఆ జేబురుమాలుకు కొన్ని మంత్రశక్తులున్నాయనీ, అది పోగొట్టుకున్న స్త్రీ, భర్త ప్రేమకు కూడా దూరమవుతుందనీ చెబుతాడు. డెస్డెమోనా నిజమేననుకుంటుంది.

కాసియో ప్రవేశం. తన విషయం భర్తకు నచ్చచెప్పటంలో విఫలమైనానంటుంది డెస్డెమోనా. భర్తకు తనమీదే కోపంగా వున్నది. కారణం తెలియదు. సెనేటర్ కూతురు గనక, భర్త చిరాకుకు కారణం ఏదో రాజకీయ సమస్య అయివుంటుందని సరిపెట్టుకుంటుంది. ఆమె చెలికత్తె ఎమిలియా లోకం తెలిసిన మనిషి. ఒథెల్లో వింత ప్రవర్తనకు కారణం అసూయ అని చెబుతుంది. కాని అది అసాధ్యమని డెస్డెమోనా విశ్వాసం. "నా భర్త వుత్తముడు. సంస్కారవంతుడు. సంకుచిత మనస్కుడు కాదు." అంటుంది.

పైగా అసూయకు కారణమేమున్నది? ఆమె అలాంటి అవకాశమే యివ్వలేదు. "అసూయకు కారణం వుండదు. అది స్వయంభువు. తనకై తనే పుట్టి, పెరిగి, బ్రహ్మరాక్షసిగా మారుతుంది." అంటుంది ఎమిలియా. "నా భర్తను ఈ రాక్షసినుండి భగవంతుడే రక్షించాలి." అంటూ ప్రార్థిస్తుంది డెస్డెమోనా.

కాని అప్పటికే కాలాతీతమైంది. అసూయా భూతం తన విషపంజాలు, విషకోరలు, విషవాయువులతో ఒథెల్లోను కబళించింది. ప్రతిక్షణమూ సానుభూతి వొలికిస్తూ పక్కనే నిలిచాడు ఇయాగో అసూయను పెంచుతూ, మనసును కాటేస్తూ. కాసియో ఒకసారి

ఒక వీధివేశ్య గురించి మాట్లాడినప్పుడు, అతడు డెస్డెమోనా గురించే అలా అన్నాడని ఒథెల్లోను నమ్మిస్తాడు. భార్యపట్ల యిప్పుడతనికున్నది ప్రేమ, దయ, స్నేహం కాదు. కోపం. ద్వేషం. "ఇప్పుడు నా గుండె కఠినశిలగా మారింది. దీన్ని తాకిన చేతులు గాయపడతాయి" అంటాడు.

డెస్డెమోనా మరణించక తప్పదు. ఆమె అందాన్ని, లావణ్యాన్ని గుర్తు చేసుకుంటాడు. అయినా మనసు మారదు. ఆ రాత్రే గొంతు పిసికి చంపెయ్యాలి.

వెనిస్ నించి వచ్చిన దూత, ఒథెల్లోకూ, కాసియోకూ మధ్య పెరిగిన అఖాతం చూసి ఆశ్చర్యపోతాడు. ఆ దూత ఏమైనా సహాయం చెయ్యగలడేమోనని ఆశిస్తుంది డెస్డెమోనా. ఒథెల్లో, వెనిస్‌కు తిరిగి రావాలని వర్తమానం తెచ్చాడు దూత (కాసియో సైప్రస్‌కు అధిపతిగా వుండాలి.) ఈ సమాచారం విని డెస్డెమోనా ఆనందిస్తుంది. కోపంతో రగిలిపోతున్న ఒథెల్లో ఆమె మీద చెయ్యి చేసుకుంటాడు.

వెనిస్‌దూత తన కళ్లను తనే నమ్మలేడు. ఒథెల్లో యిలా ప్రవర్తించగలడా? "చేయని తప్పుకు ఎందుకీ శిక్ష?" అంటుంది డెస్డెమోనా. ఏకాంతంలో వున్నప్పుడు "ఎందుకిలా జరుగుతున్నది?" అంటూ ఇయాగోను అడుగుతాడు దూత. "ప్రశాంతచిత్తుడు. విజ్ఞుడు." అని సెనేట్ ప్రశంసించిన ఒథెల్లో యితడేనా?"

లోలోపల పొంగిపోతూ, "అవును. అతడిలో ఏదో మార్పు వచ్చింది." అంటాడు ఇయాగో.

డెస్డెమోనా, కాసియో ప్రేయసీ ప్రియులని చెప్పమని ఎమిలియాను బలవంత పెడతాడు ఒథెల్లో. ఆమె నిరాకరిస్తుంది. రాజకీయ వివాదాల వల్లనే భర్త మనసు వికలమైనదని డెస్డెమోనా యింకా విశ్వసిస్తున్నది. వెనిస్ తిరిగి రమ్మనటం బహుశా కోపం తెప్పించిందేమో! డెస్డెమోనా తండ్రి ఈ పిలుపుకు కారణమనుకుంటాడు ఒథెల్లో.

తన వల్ల ఏ తప్పూ జరగలేదని డెస్డెమోనాకు గట్టి నమ్మకం. ఒథెల్లో భాషలోని పరుషత్వం అర్థం కావటానికి కొంత కాలం పడుతుంది. కాని తను అమాయకురాలినని చెప్పటం తప్ప ఆమె మరేం చెయ్యగలదు?

ఎమిలియా ప్రవేశం. డెస్డెమోనా స్పృహ కోల్పోతున్నది. చావుదెబ్బలు తిని కళ్లు మూతలుపడుతున్న చిన్నపిల్లలా వుంది. తెలియక ఏ నేరం చేసినా క్షమించమని వేడుకుంటూ భర్తకు కోపం తెప్పించినందుకు క్షమించమని ఇయాగో ద్వారా విన్నపం పంపిస్తుంది.

రాజకీయాలవల్లే ఒథెల్లో అన్యమనస్కంగా వున్నాడంటాడు ఇయాగో. "బాధపడకు. త్వరలో అంతా సర్దుకుంటుంది." అని ధైర్యం చెబుతాడు. ఆమె నిష్క్రమించగానే కాసియోను హత్యచెయ్యటానికి రోడెరిగోను పంపిస్తాడు. డెస్డెమోనా కోసం రోడెరిగో ఏమైనా చెయ్యటానికి సిద్ధం.

రాత్రి. డెస్డిమోనాను శయ్యామందిరానికి పంపిస్తాడు ఒథెల్లో. "గదిలో చెలికత్తెలెవ్వరూ వుండగూడదు. నువ్వొక్కదానివే వుండాలి."

ఎమిలియా సందేహిస్తుంది. "ఆయన చెప్పినట్టే చెయ్యాలి. కోపం తెప్పించకూడదు" అంటుంది డెస్డిమోనా. పెళ్లినాటి బెడ్‌షీట్లు పడకమీద పరచి, డెస్డిమోనా డ్రెస్ మార్చి వెళ్లిపోతుంది ఎమిలియా.

ఏమీ అర్థం కావటంలేదు. తల తిరుగుతున్నట్టుగావుంది. పాతపాట ఏదో మనసులో ప్రతిధ్వనిస్తున్నది. అలనాడు తన తల్లి చెలికత్తె అదృశ్యమైన ప్రియుని కోసం పాడిన పాట.

తలుపు తట్టిన చప్పుడు. ఎవరూ లేరు. గాలి. భర్త ఎందుకిలా వుంటున్నాడు? అసలు ఏ స్త్రీ అయినా భర్తకు ద్రోహం చేయగలదా? భర్తల ప్రవర్తన యిలా వున్నప్పుడు భార్యలనెందుకు తప్పుపట్టాలంటుంది ఎమిలియా. పక్కన లైటు వెలుగుతున్నది. డెస్డిమోనా నిద్రలోకి జారుకుంటుంది.

వీధిలో ఒకచోట రోడెరిగో కత్తి పట్టుకుని నక్కివుంటాడు. కాసియో కోసం నిరీక్షిస్తున్నాడు. ఆకారం కనిపిస్తుంది. పొడుస్తాడు. కాని కాసియో వేసుకున్న దళసరి కోటు అతణ్ణి రక్షిస్తుంది. కాలికి గాయమవుతుంది. కిందపడతాడు. అతడు మరణించాడనుకుంటాడు ఒథెల్లో. ఇంక మిగిలింది మరొక్క ప్రతీకారచర్య. భార్య పడక గది వైపు కదులుతాడు.

డెస్డిమోనా పడక దగ్గర చాలాసేపు నిలుచుంటాడు. ఆమె నిద్రపోతున్నది. ప్రేమ, ద్వేషం కలగలిసి గుండెను పిండేస్తున్నాయి. చివరి సారిగా ముద్దాడాలనుకుంటాడు. డెస్డిమోనా లేస్తుంది. "పడుకుంటావా, రా" అంటుంది. ఆమెనెక్కువ బాధపెట్టకుండా పని ముగించాలి "ప్రార్థన చేసుకో" అంటాడు.

డెస్డిమోనా భయపడి ఆత్మరక్షణకోసం ప్రయత్నిస్తుంది తను అమాయకురాలినని మరోసారి ఏడుస్తుంది. కాని ఆమె దీనాలాపాలు వున్మాదికి వినిపించవు. కాసియో మరణించాడని తెలుస్తుంది. ఇంక తన తరఫున మాట్లాడే వాళ్లెవరూ లేరు. "ఒక్కరోజు కోసం ప్రాణ దానం చెయ్యి. రేపు చంప"మని వేడుకొంటుంది.

అంత సమయం లేదు. రేపటికి తను బలహీన పడవచ్చు. "ఇప్పటికే ఆలస్యమైంది "అంటూ ఆమె గొంతు నులిమేస్తాడు.

బయట చప్పుడు. ఎమిలియా పిలుస్తున్నది. ఆమె రాకతో పరదాలడ్డంపెట్టి నిలుచుంటాడు. కాసియో మరణించలేదని చెబుతుంది ఎమిలియా. పరదాల వెనక మనిషి కదిలిన చప్పుడు. డెస్డిమోనా చివరి శ్వాస తీసుకుంటున్నది. ఎవరింత ఘాతుకానికి ఒడిగట్టారో తెలుసుకోవాలనుకుంటుంది ఎమిలియా. "ఎవరూ కారణం కాదు. ఇది ఆత్మహత్య" అని శ్వాసవిడుస్తుంది డెస్డిమోనా.

తన యజమానురాలి వియోగం భరించలేని ఎమిలియా ఎలుగెత్తి రోదిస్తుంది. తనే హత్య చేశానని అంగీకరిస్తాడు ఒథెల్లో. కారణాలు చెప్పటానికి ప్రయత్నిస్తాడు. కాని ఎమిలియా వినదు. ఒథెల్లో ఆమెను బెదిరిస్తాడు. ఇప్పుడామెనెవరూ భయపెట్టలేరు. "నన్ను గాయపర్చగలిగిన శక్తి నీకులేదు. నీ కోపానికీ, నీ కత్తికీ జంకను నేను."

అరుపులకు జనమంతా వస్తారు. ఇయాగో భార్యను శాంతింప చేయటానికి ప్రయత్నిస్తాడు. భర్త ఆదేశాల మేరకే జేబురుమాలు దొంగిలించావని చెబుతుంది ఎమిలియా. ఇయాగో కోపంతో ఆమెను పొడుస్తాడు. "ఆమెకు నువ్వు తప్ప మరో ప్రియుడు లేదు." అని ఒథెల్లోతో చెప్పి మరణిస్తుంది ఎమిలియా.

అందరూ కలిసి ఒథెల్లో ఖడ్గం లాక్కుంటారు. కాని అతడు గదిలో మరో ఖడ్గం దాచిపెట్టాడు. చచ్చి నరకానికి పోవలసిన అవసరం లేదు. ఇప్పుడు నరకంలోనే ఉన్నాడు. ఇయాగోను చంపటానికి ప్రయత్నిస్తాడు.

కాసియోను క్షమించమని కోరతాడు.

జరిగిన విషయాలన్నీ వివరిస్తూ వెనిస్‌కు సందేశం పంపిస్తాడు. చురకత్తితో పొడుచుకుని భార్య పక్కన వాలిపోతాడు. చివరిసారి ఆమెను ముద్దు పెట్టుకుని ప్రాణం విడుస్తాడు.

జనరల్‌కు శ్రద్ధాంజలి ఘటిస్తాడు కాసియో. అతడు ఇప్పుడు సైప్రస్‌కు కొత్త గవర్నర్ ఇయాగోను శిక్షించవలసిన బాధ్యత అతనిదే.





# 21. మాక్‌బెత్

మరో గొప్ప ట్రాజెడీ మాక్‌బెత్. కుట్రలు, కుతంత్రాలు, హత్యలూ, యుద్ధాలూ, మంత్రాలూ, మాయలూ కలగలిపిన దృశ్యకావ్యం. దురాశ పతనానికి దారితీస్తుందన్న సత్యాన్ని కవితాత్మకంగా దర్శింపచేస్తుంది. మాక్‌బెత్ దంపతులు స్కాట్లండ్ సింహాసనాన్ని ఆశించారు. దక్కించుకున్నారు. కాని ఆ క్రమంలో జరిగిన వరుస హత్యలతో వాళ్లకు శాంతి కరువైంది. ప్రాణభయం, పాపభయం, తమ మీద తమకు కలిగిన అసహ్యం వాళ్ల జీవితాల్ని నరకం చేశాయి.

ప్రాచీన స్కాట్లండులో యుద్ధం జరుగుతున్న రోజులు. రాజుకు వ్యతిరేకంగా ఎవరో తిరుగుబాటు చేశారు. వాళ్లను అణచివెయ్యమని మాక్‌బెత్, బాంకోలను ఆదేశిస్తాడు రాజు. యుద్ధరంగానికి దగ్గరగా, పిడుగులు, ఉరుములు, మెరుపుల మధ్య, బీడుభూమిలో ముగ్గురు మంత్రగత్తెలు సమావేశమై, సంధ్యాసమయాన మాక్‌బెత్‌తో మాట్లాడాలని తీర్మానించుకుని అదృశ్యమవుతారు.

యుద్ధ వార్తల కోసం నిరీక్షిస్తుంటాడు రాజు. వార్తాహరుడు ప్రవేశించి మాక్‌బెత్ శౌర్య పరాక్రమాలను వర్ణిస్తాడు. కాడర్ సామంతరాజు చేసిన ద్రోహాన్ని కూడా తెలుసుకుంటారు రాజు. ఈ పట్టం మాక్‌బెత్‌కే కట్టాలనుకుంటాడు. మాక్‌బెత్ అప్పటికే గ్లామిస్‌కు సామంతరాజు.

చిత్ర విచిత్రమైన వుచ్చారణలతో మాట్లాడుతూ మంత్రగత్తెలు మాక్‌బెత్‌కోసం నిరీక్షిస్తుంటారు. వాళ్లు, ఏవో మంత్రాలు చదివి, మాయ చేస్తున్నప్పుడు మాక్‌బెత్, బాంకోలు ప్రవేశిస్తారు. మంత్రగత్తెల్ని మొదట గమనించింది బాంకో. కాని వాళ్లు మాక్‌బెత్‌తో మాత్రమే మాట్లాడతారు.

"విజయోస్తు మాక్‌బెత్ వీరుడా. గ్లామిస్, కాడర్‌ల సామంతరాజా విజయోస్తు ఇక రాజసింహాసనం నీదే."

మాక్‌బెత్ నిశ్చేష్టుడవుతాడు. మంత్రగత్తెలు జరగబొయ్యేవన్నీ చెప్పగలరు. "నీ కొడుకులు రాజులవుతారులే" అని బాంకోకు జోస్యం చెబుతారు. కాడర్‌కు సామంతరాజు కావటం అసంభవం అంటాడు మాక్‌బెత్. సరిగా అప్పుడే రాజభటుడు వచ్చి మాక్‌బెత్‌కు శుభవార్త చెబుతాడు. మాక్‌బెత్‌కు రాజసింహాసనం వైపు దృష్టిపోతుంది. "ఇప్పుడు సామంతరాజును. రాజునెందుకు కాలేను?" అనుకుంటాడు.

ఆస్థానంలో సకల మర్యాదలతో మాక్‌బెత్‌కు స్వాగతం పలుకుతాడు రాజు. "మీ ఇన్‌వెర్నెస్ దుర్గానికి స్వయంగా వచ్చి మీ ఆతిథ్యం స్వీకరిస్తాను." అని స్నేహ హస్తం అందిస్తాడు. మాక్‌బెత్‌లో మళ్లీ దురాలోచన మొదలవుతుంది.

ఇన్‌వెర్నెస్ కోట దృశ్యం. యుద్ధం తర్వాత భర్త రాసిన వుత్తరం చదువుకుంటున్నది లేడీ మాక్‌బెత్. మంత్రగత్తెల జోస్యం గురించి సూచించాడు భర్త. ఆమె మనసులో కూడా కోరిక ప్రవేశిస్తుంది. కాని భర్త స్వభావం తెలుసు. తెగించి ఓ నిర్ణయం తీసుకోలేడు. హత్య చెయ్యాలా వద్దా అని ఆలోచిస్తాడు. ఆ ఒక్కపనీ చెయ్యగలిగితే స్కాట్లండు సింహాసనం తమదే.

రాజు గారు ఆ రాత్రి ఇన్‌వెర్నెస్‌కు అతిథిగా రాబోతున్నారని వార్త తీసుకొస్తాడు దూత. తనలో క్రౌర్యాన్ని పెంచి, అనుకున్న పనికి సాయం చెయ్యమని క్షుద్ర దేవతలందర్నీ ప్రార్థిస్తుంది మాక్‌బెత్. భర్త రాగానే " రాజును హత్య చేద్దాం" అని చెబుతుంది. "తరువాత మాట్లాడుదాం" అంటాడు మాక్‌బెత్. "స్వాగతం ఏర్పాట్లు నువ్వు చూసుకో. మిగతా

పని నేను పూర్తిచేస్తాను." అంటుంది భార్య.

కొడుకులనూ, యితర పరివారాన్నీ వెంటపెట్టుకుని రాజు ప్రవేశిస్తాడు. లేడీ మాక్‌బెత్ సాదరంగా స్వాగతం చెబుతుంది. భర్త ఆమె పక్కన లేడు. భోజన సమయంలో అతిథులతో కలిసి వుండలేక నిష్క్రమిస్తాడు. "హత్య" అతడి మనసును కలచి వేస్తున్నది.

మనసు తన మాట వినటం లేదు. చంపాలంటే చేతులు రావటం లేదు. సాటి రాజవంశీకుడు. బంధువు. అతిథి. అన్నిటినీ మించి సజ్జనుడు. స్నేహశీలి. ఎలా చంపటం?

"రాజు నిన్ను పిలుస్తున్నాడ"ని చెబుతుంది భార్య. "మనమీ పని చెయ్యబోవటం లేదు." అంటాడు మాక్‌బెత్.

ఎలాగైనా, అనుకున్నది సాధించటం లేడీ మాక్‌బెత్ లక్షణం. అందుకోసం ఆమె దేనికీ వెనుకాడదు. ఎట్టి పరిస్థితుల్లోనూ ఓటమి అంగీకరించదు. తన అమ్ముల పొదిలోని రెండు పదునైన అస్త్రాలను ప్రయోగిస్తుంది. "నువ్వు పిరికిపందవు. నేనంటే ప్రేమ లేదు." ఏ భర్త ఈ నిందను తట్టుకోగలడు?" "ప్రయత్నంలో ఓడిపోతే?....." అంటాడు. "..... ఓడిపోం. ధైర్యం కూడగట్టుకుని ప్రయత్నించు. అనుకున్నది సాధిస్తాం." అంటూ వాక్యం పూరిస్తుంది లేడీ మాక్‌బెత్.

పకడ్బందీ ప్లాను వేసింది. ప్రయాణ బడలికతో రాజు గాఢంగా నిద్రపోతున్నాడు. అతని అంగరక్షకులకు మద్యమిచ్చి నిద్రపుచ్చుతుంది. వాళ్ల చురకత్తులతోనే రాజును హత్యచేసి, తిరిగి ఆ రక్తసిక్తమైన కత్తుల్ని అంగరక్షకుల చేతుల్లో పెడుతుంది. వాళ్లే చంపారని అందరూ నమ్ముతారు. ఈ స్కీము మాక్‌బెత్‌కు నచ్చుతుంది. రాజమకుటం తన కోసం నిరీక్షిస్తున్నది. ఆ రాత్రే హత్య జరగాలి.

అర్ధరాత్రి. బాంకోకు నిద్రపట్టలేదు. ప్రాంగణంలో దివిటీల వెలుగులో మాక్‌బెత్ కనిపిస్తాడు. అతడు కూడా అసహనంగా అటూ యిటూ తిరుగుతున్నాడు. మంత్రగత్తెల గురించి మాట్లాడాలనుకుంటాడు. మాక్‌బెత్ నివారిస్తాడు. బాంకో గుడ్‌నైట్ చెప్పి నిష్క్రమిస్తాడు.

భార్య సంజ్ఞ కోసం నిరీక్షిస్తున్నాడు మాక్‌బెత్ – అంగరక్షులు తాగి, నిద్రలోకి జారుకుంటే సంకేతంగా ఒక గంట మోగుతుంది. పరిపరివిధాల చెలరేగుతున్న వూహలు మనసును కలవర పెడుతున్నాయి చురకత్తి మీద నెత్తురు కనిపించింది. అంతా తన భ్రమ. ఘోరం జరగబోతున్నది. మిత్ర ద్రోహం. తోడేళ్లు, పిశాచాలు అమాయక ప్రాణాలను బలితీసుకున్నట్టుగా విచిత్ర సంకేతాలు వినిపించాయి ఆ కాళరాత్రి.

గంట మోగింది ."కార్యసిద్ధి" కోసం కదిలాడు మాక్‌బెత్.

చీకట్లో, మెట్లకింద, లేడీ మాక్‌బెత్ నిరీక్షిస్తున్నది. పైన గదిలో, భర్త తన అతిథిని హత్యచేశాడు. హమ్మయ్య. అనుకున్నది జరిగింది. కాని తను వూహించినంత

ధీరమనస్కురాలు కాదు లేడీ మాక్‌బెత్. ఆమె శరీరంలో వున్నది మాంసమే. లోహం కాదు.

మాక్‌బెత్ ప్రవేశిస్తాడు. ఇద్దరూ గుసగుసలాడుకునే ప్రసిద్ధ సీన్ యిదే. మొదట పొడిమాటలు, తరువాత అసంపూర్తి వాక్యాలు, బాధతో నిర్విణ్ణమైన మాక్‌బెత్ వదనం. రక్తసిక్తమైన చేతులు. మెట్లు దిగుతున్నప్పుడు, ఒక గదిలో ఎవరో కదిలినట్లైంది. ప్రార్థన చేసుకుంటున్నట్టుంది. మాక్‌బెత్ కూడా ప్రార్థించాలనుకుంటాడు. వీలుపడదు. మనసు మరింత బాధపడుతుంది. ఇలాంటి చిన్నచిన్న విషయాలకు విచారించ వద్దంటుంది భార్య

హత్యకు ముందరే, చురకత్తి మీద నెత్తురు చూసిన మాక్‌బెత్‌కు అదృశ్యవాణి వినిపిస్తుంది., "నీకు నిద్రలేదిక. నిద్రను కూడా హత్యచేశావు."

లేడీ మాక్‌బెత్‌కు భర్త మాటలు అర్థంకావు. కాని మాక్‌బెత్ చెవుల్లో అదృశ్యవాణి గింగురుమంటూనే వుంటుంది.

"నిద్రను హత్య చేశాడు గ్లామిస్. కాడర్‌కు నిద్ర రాదు. మాక్‌బెత్ యిక నిద్రకు దూరం...."

"చేతులకంటిన నెత్తురు కడుక్కుని, చురకత్తులు అంగరక్షకుల చేతుల్లో పెట్టి రమ్మ"ంటుంది భార్య. హత్యా స్థలానికి మళ్లీ వెళ్లలేడు మాక్‌బెత్. రెండు కత్తులూ తీసుకుని భార్య నిష్క్రమిస్తుంది. తన చేతుల్ని చూసుకొని మాక్‌బెత్ స్వగతంగా,

"నెప్ట్యూన్ సముద్రంలోని నీళ్లన్నీ పోసినా ఈ నెత్తురు పోతుందా? లేదు. అన్ని సంద్రాల ఆకుపచ్చని నీరూ ఎర్రగా మారుతుంది." అంటాడు.

భార్య ప్రవేశం. ఆమె చేతులక్కూడా నెత్తురంటింది. మృతుడి రక్తం అంగరక్షకులకు రాసి వచ్చింది. దక్షిణ ద్వారం తట్టిన చప్పుడవుతుంది. కాని మాక్‌బెత్ కదల్లేదు. భర్తకు ధైర్యం చెప్పి, విశ్రాంతి తీసుకొమ్మని పడక గదికి పంపిస్తుంది.

దుర్గపాలకుడొకడు తలుపుచప్పుడు విన్నాడు. కాని తప్పతాగి వున్నాడు గనక లేవలేడు. నరకంలో యిలాంటి వుద్యోగం చెయ్యటం ఎంత కష్టమోనని కాసేపు కలలుకంటాడు.

తలుపు తట్టింది రాజు దర్శనానికి వచ్చిన యిద్దరు వున్నతోద్యోగులు. ఆత్మస్థైర్యం పెంచుకున్న మాక్‌బెత్ వాళ్లను ఆహ్వానిస్తాడు. ఆగంతుకుల్లో ఒకడు మాక్‌డఫ్. రాజును చూడటానికి వెళ్లి అసలు విషయం తెలుసుకుంటాడు. కోటంతా అరుపులతో, ఏడుపులతో దద్దరిల్లుతుంది. మాక్‌బెత్ వెళ్లి యిద్దరు అంగరక్షకుల్నీ పొడిచి చంపుతాడు. "ఇలాంటి హంతకులు బతికుండటానికి వీల్లేదు." అంటాడు.

రాజు గారి కొడుకులకిది నమ్మశక్యంగా కనిపించదు. తమ ప్రాణాలక్కూడా ముప్పుందని తెలుసుకుంటారు. "మనుషుల చిరునవ్వులలో చురకత్తులున్నాయ"ంటారు. రాత్రికి రాత్రి ఇన్‌వెర్నెస్ వదిలి, స్కాట్లండ్ దాటి పోతారు. ఇలా హడావిడిగా వెళ్లిపోవటం

వల్ల వాళ్లకూ నేరంలో పాలుందేమోనని అనుమానం కలుగుతుంది. కాదరకు రాజుగా వున్న మాక్‌బెత్ స్కాట్లండ్ సింహాసనం అధిష్టిస్తాడు.

రాజప్రాసాదం. పట్టాభిషేకం సందర్భంగా విందుకు ఘనంగా ఏర్పాట్లు జరుగుతున్నాయి. అతిథుల్లో బాంకో ఒకడు. అతడికి అందరికన్నా ఎక్కువ తెలుసు. హంతకుడు మాక్‌బెత్ అని అనుమానం కూడా వుంది. రోజంతా "ఏంచేస్తావ"ని మిత్రుణ్ణి ప్రశ్నిస్తాడు మాక్‌బెత్. కొడుకుతో కలిసి గుర్రపు స్వారీ చేసి విందు సమయానికి వస్తానంటాడు బాంకో. బాంకో బతికుండటం తనకు క్షేమం కాదని గ్రహించిన మాక్‌బెత్ అతణ్ణి చంపటానికి యిద్దరు హంతకుల్ని నియోగిస్తాడు. బాంకో కొడుకు కూడా చావాల్సిందే. బాంకో సంతానం రాజసింహాసనమెక్కుతారని మంత్రగత్తెలు చెప్పలేదూ!

మాక్‌బెత్ దంపతులకు నిద్ర కరువైంది. పీడకలలు వేధిస్తున్నాయి. మరణించిన రాజే సుఖంగా వున్నాడనిపిస్తున్నది.

బాంకో, అతడి కొడుకూ ప్రాణాలు విడిస్తే తమకు కొంత మనశ్శాంతి దొరుకుతుంది.

చీకటి పడుతున్నప్పుడు హంతకులు బాంకోను వెంబడిస్తారు.

బాంకో, అతడి కొడుకూ గుర్రాలు దిగి కబుర్లు చెప్పుకుంటూ రాజప్రాసాదం వైపు నడుస్తుంటారు. కొడుకు చేతిలో దివ్విటీ వున్నది. హంతకులను చూసి బాంకో అరుస్తాడు. కొడుకు పారిపోతాడు. సగం పని మాత్రమే పూర్తి చేశామని హంతకులకు తెలిసిపోతుంది. మాక్‌బెత్‌కీవిషయం చెప్పటానికి వెళతాడొకడు.

విందుకు కూర్చుంటున్నప్పుడు మాక్‌బెత్‌కు తలుపు దగ్గిర హంతకుడు కనిపిస్తాడు. "హత్య జరిగింది. బాంకో కొడుకు దొరకలేదు." కనీసం బాంకో అడ్డు తొలగినందుకు సంతోషించి భోజనం టేబుల్ దగ్గర కూర్చుంటాడు మాక్‌బెత్. టేబుల్ దగ్గర ఒక కుర్చీ ఖాళీగా వుండాలి. కాని అక్కడ కూర్చున్న బాంకో ప్రేతం మాక్‌బెత్ వైపు చూస్తుంది. తల మీద నెత్తురు.

"ఈ పని చేసింది నేను కాదు!" అంటాడు మాక్‌బెత్ ప్రేతంతో. అతిథులందరూ ఆశ్చర్యంగా చూస్తారు. "నా భర్త అప్పుడప్పుడు యిలా మాట్లాడుతుంటాడు. ఒకసారి చురకత్తి మీద నెత్తురు చూశాడు." అంటుంది లేడీ మాక్‌బెత్.

ప్రేతం అదృశ్యమైనంతదాకా ఏదో మాట్లాడుతూనే వుంటాడు మాక్‌బెత్.

ఆహ్వానించిన అతిథులపట్ల తమ బాధ్యతను గుర్తుచేస్తుంది భార్య. మాక్‌బెత్‌కు సభా మర్యాదలు తెలుసు.

ఏదో సందర్భంలో బాంకో పేరు రాగానే, ఆ ప్రేతం మళ్లీ వస్తుంది. మాక్‌బెత్‌కు తల తిరుగుతుంది. అతడు మంచి యోద్ధ: ఎవరితోనైన్నా యుద్ధం చెయ్యగలడు. కాని నీడల మీదికి ఎలా కత్తిదూయటం? ప్రేతం వెళిపోతుంది గాని, అప్పటికే విందు రసాభాసగా ముగుస్తుంది.

హత్యతో అనుకున్నది సాధించగలననుకున్నాడు మాక్‌బెత్. కాని ఎంత మందిని చంపినా తనకు మాత్రం క్షేమం లేదు. శాంతి లేదు.

భార్య ప్రవేశిస్తుంది. మాక్‌బెత్ తనలో తను మాట్లాడుకుంటున్నాడు. "హత్య చేస్తాం. ఆ హత్య మరో హత్య చేయిస్తుంది. ...." మాక్‌డఫ్ గురించి ఆలోచిస్తాడు. రమ్మని కబురంపితే అతడు రాలేదు. అతడూ ఒక సమస్యే. "విందులో కనిపించిన ప్రేతం నిజం కాదు. నిద్రలేమి వల్ల కలిగిన భ్రమ" అని సరిపెట్టుకుంటాడు. తొలి హత్యతో కలిగిన మనోక్లేశం తరువాతి హత్యల్లో వుండదు. మంత్రగత్తెల్ని సంప్రదించాలనుకుంటాడు మాక్‌బెత్. ఆ జోస్యం వల్లే కద యిదంతా జరిగింది.

హెకేట్ (చంద్రదేవత, ప్రేతాలదేవత), మాక్‌బెత్ మనశ్శాంతికోసం "జీవులందరి ప్రధాన శత్రువు భద్రత" అంటూ పలికింది.

మంత్రగత్తెలు ఒక పెద్ద కుండలో కషాయం మరగపెడుతున్నారు. విషమూ, యితర ప్రాణాంతక పదార్థాలూ అందులో వేసిన ప్రధాన వస్తువులు. అది "హెల్‌బ్రాత్"

మాక్‌బెత్ ప్రవేశం. మంతగత్తెలు భవిష్యత్తు చెబుతామంటారు. పిడుగుపడిన చప్పుడై, ఆ కొండలోంచి మూడు ఆకారాలు లేస్తాయి. మొదటిది మాక్‌డఫ్ నించి జాగ్రతగా వుండమని చెబుతుంది. స్త్రీకి పుట్టిన, సంతానం వల్ల మాక్‌బెత్‌కు అపకారం వుండదంటుంది రెండవది. (బిర్నాం) అరణ్యం (డన్సినేన్) కొండను కలిసిందాకా అపజయమనేదుండదు నీకు" అంటుంది.

ఇదంతా బాగానే వుందిగాని అతడినో సందేహం పీడిస్తున్నది. బాంకో సంతానం స్కాట్లండును ఏలుతుందని మొదట చెప్పిన జోస్యం నిజమవుతుందా? మంత్రగత్తెలు మాక్‌బెత్ ముందర ఎందరో రాజుల పరంపరనూ నెత్తురోడుతూ, చిరునవ్వు నవ్వుతున్న బాంకోనూ సాక్షాత్కరింపచేస్తారు. క్రోధోద్రిక్తుడవుతాడు మాక్‌బెత్.

మరణించిన రాజుగారి పెద్దకొడుకు సాయం అర్థించటానికి మాక్‌డఫ్ ఇంగ్లండ్ వెళ్లాడని తెలుస్తుంది. ప్రతీకారంగా అతడి భార్యనీ, పిల్లల్నీ చంపమని మాక్‌బెత్ హంతకుల్ని పంపుతాడు. ఒక దూత లేడీ మాక్‌డఫ్‌కు ఈ విషయం చెబుతాడు. "కాని ఏం చెయ్యను? ఎక్కడికి పోగలను?" అంటుందామె. హంతకులు వచ్చి వాళ్లను చంపేస్తారు.

ఇంగ్లండులో వున్న రాజుగారి పెద్దకొడుకు మాక్‌డఫ్‌ను గానీ, మరే స్కాట్లండు మనిషిని గానీ నమ్మే స్థితిలో లేడు. మాక్‌బెత్ లాంటి విశ్వాసపాత్రుడే ద్రోహిగా మారిన తర్వాత ఎవర్నైనా ఎలా నమ్మగలరు? ఇద్దరూ చర్చించి, ఒక అంగీకారానికి వస్తున్న దశలో మాక్‌డఫ్‌కు తన కుటుంబం హత్యకు గురైన విషయం తెలుస్తుంది. రాకుమారుడు ప్రతీకారం తీసుకుందామంటాడు. కాని మాక్‌డఫ్ "మాక్‌బెత్‌కు సంతానం లేదు." అంటాడు. స్కాట్లండు చేరుకుని హంతకుల గుండెల్లో ఖడ్గం దించటమే యిక

చెయ్యవలసింది.

సైనికులను సమీకరించటానికి మాక్‌బెత్ కోట వెలుపల తిరుగుతుంటాడు. భార్య లోపల ఒక్కత్తే వుంది. కలిసి వున్నప్పుడు ఒకరికొకరు ధైర్యం చెప్పుకుంటారు. ఒంటరిగా వున్న లేడీ మాక్‌బెత్‌ను చీకటి భయాలు ఆవరించాయి. పగటిపూట ఫరవాలేదు. కాని రాత్రుళ్లు నిస్సహాయత పెరుగుతుంది. పక్కనెప్పుడూ దివ్వెటీ వెలుగుతుంటుంది. కాని కలల్నించి, పీడకలల్నించి ఎక్కడికి పారిపోగలదు? ఇటీవల ఆమె నిద్రలో నడుస్తున్నది. పరిచారకుడు డాక్టర్ను పిలుచుకువచ్చాడు. ఆమె నడకను పరిశీలించటానికి యిద్దరూ నిరీక్షిస్తున్నారు.

ఇదే ప్రసిద్ధ స్లీప్‌వాకింగ్ సీన్. షేక్స్‌పియర్ జీనియస్‌కు అద్దం పడుతుంది. ఆనాటి హత్యను ఆమె పునర్జీవిస్తున్నది. మరచిపోదామని ప్రయత్నించింది. కాని వీలుపడలేదు. ఆమె వూహాల్ని వుప్పెనలా కమ్మేసిందాహత్య. భర్తను మరచిపొమ్మంది. కాని తాను మరచిపోలేక పోతున్నది. ఆ వృద్ధుడు (రాజు) తమనింత యిబ్బంది పెడుతున్నాడు.

చేతులకున్న నెత్తురు కడుక్కోవటానికన్నట్టుగా అటూ యిటూ తిప్పుతున్నది. ఒక గ్లాసుడు నీళ్లు చాలు హత్యను కడిగెయ్యటానికనుకున్న స్త్రీ యిప్పుడు ఎంత కడిగినా శుభ్రంకాని చేతుల్ని నిరంతరం కడుగుతూనే వున్నది. తనలో తను మాట్లాడుకుంటుంది. బాంకోతో, రాజుతో, మాక్‌డఫ్ భార్యతో, (మృతులతో) మాట్లాడుతుంది. అందరూ స్వప్నావస్థలో ఆమెను వెంటాడుతూనే వున్నారు. తలుపు తట్టినట్టుగా వులిక్కిపడుతుంది. పక్కన లేని భర్తను వెళ్లి తలుపు తియ్యమని చెబుతుంది. "ఇంక ఆశలేదు" అంటాడు డాక్టరు. ఇప్పుడామెకు కావలిసింది వైద్యుడు కాదు. ప్రీస్టు. చేసిన పాపాలకు నిష్కృతి లేదు.

మరణించిన రాజుగారి పెద్దకొడుకు నాయకత్వంలో ఇంగ్లీష్, స్కాటిష్ సైనికులు డన్సినేన్ వైపు కదిలివస్తారు. వాళ్ల గురించి మాక్‌బెత్‌కు తెలుస్తుంది. తన సైనికులే తనను వదిలి వెళ్లి పోతున్నారు. ఇటువంటి పిరికిపందలున్న మాక్‌బెత్ కెక్కడి రక్షణ. కవచం ధరిస్తాడు. కాని అందులోనూ భద్రత లేదు.

డాక్టర్ వస్తాడు. "మనోవ్యాధికి మందులేదా?" అని అడుగుతాడు మాక్‌బెత్. ఇలాంటి విషయాల్లో డాక్టరు నిస్సహాయుడు. మాక్‌బెత్ హృదయ భారం ఏమాత్రం తగ్గదు.

స్కాట్లండుకు సమీపంలో, బిర్నాం అరణ్యం వద్ద దాడికి వస్తున్న రాకుమారుడి సైన్యం సేద తీరుతుంది. ప్రతి సైనికుడూ ఒక కొమ్మ తెంపి ముందర పెట్టుకుని నడవాలి. అలా చెయ్యటం వల్ల సైన్యబలం ఎంతున్నదో శత్రువులు అంచనా వెయ్యలేరు. డన్సినేన్ దుర్గం మీద ముట్టడికి పన్నిన వ్యూహం యిది.

దుర్గం లోపల మాక్‌బెత్ నిరీక్షిస్తున్నాడు. బలమైన కోట గోడలు శత్రుసైన్యాల దాడికి నిలబడగలవు. ఆకలితో, రోగాలతో వాళ్లే కొంతకాలానికి బలహీనపడి మరలిపోతారు.



అప్పటికే ఒక శత్రువు మాక్‌బెత్‌ను పరాజితుణ్ణి చేసింది. స్త్రీల రోదనలనుబట్టి భార్య మరణించిందని తెలుసుకుంటాడు. మానవ జీవిత నిరర్థకత బోధపడుతుంది. బిర్నాం అరణ్యం, డన్సినేన్ వైపు కదిలివస్తున్నదని నివేదిస్తాడు వేగులవాడు. మంత్రగత్తెల జోస్యం నిజం అవుతున్నది. మాక్‌బెత్‌లో నిర్లక్ష్యం ప్రవేశించింది. కాని యుద్ధం చేసి సైనికుడిలా వీరమరణం పొందటం మేలుగదా! స్త్రీ సంతానం వల్ల తనకు మృత్యువురాదని చెప్పలేదా మంత్రగత్తెలు.



మాక్‌బెత్ సైనికులు యుద్ధం చెయ్యటానికి నిరాకరిస్తారు. కోటను వదిలి వెళ్లిపోతారు. మాక్‌బెత్ ఒంటరిగా యుద్ధం చేస్తాడు. మాక్‌డఫ్‌ని చూసి సందేహిస్తాడు. ఇప్పటికే అతడి సంసారాన్ని నాశనం చేశాడు. కాని మాక్‌డఫ్ కత్తి దూస్తాడు. యుద్ధం జరుగుతుంది. అతడు తనను చంపలేడని మాక్‌బెత్‌కు తెలుసు. "నేను స్త్రీకి పుట్టలేదు. నన్ను గర్భం నించి లాగి తీశారు." అంటూ ప్రకటిస్తాడు మాక్‌డఫ్. మంత్రగత్తెలు తనను పరిహసిస్తున్నారని తెలుసు. యుద్ధం చేస్తాడు. వీరుడిలా జీవించలేదు. కాని వీరుడిలా మరణిస్తాడు.

రాకుమారుడు స్కాట్లండుకు కొత్త రాజవుతాడు "నరరూప రాక్షస దంపతుల కాలం ముగిసింద"ని ప్రకటిస్తాడు. మాక్‌బెత్‌లు రాక్షసులు కాదు. క్రూరులు. ఒక తప్పుకి పర్యవసానం వంద తప్పులు. షేక్స్‌పియర్ హంతకులను కూడా సజీవమూర్తులుగా చిత్రించగలడు. అసలైన ట్రాజెడీ మృత్యువు కాదు – వాళ్ల జీవితం.



# 22. కింగ్ లియర్

షేక్స్పియర్ నాటకాలకు మకుటాయమానమైంది ***కింగ్ లియర్.*** విధి వక్రించిన జీవితం వింత కథ. అసూయ, అహంకారం, దురాశల ఫలితంగా అజేయులు కూడా వికారులు అవుతారు. ముసుగులు తొలగిస్తే సజ్జనుల ప్రవర్తన కూడా వికృతంగానే ఉంటుంది. ఇన్ని నాటకాలకు బదులు, ఒక 'కింగ్ లియర్' మాత్రమే రాసినా షేక్స్పియర్ కీర్తి తగ్గేది కాదు.

కథాకాలం ప్రాచీన బ్రిటన్. కింగ్ లియర్ రాజమందిరం. రాజుగారికి వృద్ధాప్యం మీద పడింది. రాజ్యాన్ని ముగ్గురు కూతుళ్లకూ పంచి విశ్రాంతి తీసుకోవాలనుకుంటాడు. పెద్ద కూతురు గోనెరిల్–డ్యూక్ ఆఫ్ అల్బానీ భార్య; రెండవ కూతురు రెగాన్- డ్యూక్ ఆఫ్ కార్న్వాల్ భార్య. అందరి కన్నా చిన్నది కార్డెలియా. ఫ్రాన్స్ దేశపు రాజు, మరో ఫ్రెంచి డ్యూక్ కూడా ఆమెను ఇష్టపడ్డారు. ఇంకా వరుడు నిశ్చయం కాలేదు. అయితే తండ్రికి మాత్రం కార్డెలియా అంటే ప్రాణం. ముగ్గుర్లోకీ ఆ పిల్లే అతడి ముద్దుల కూతురు.

విలాస జీవితం, అధికార మదంతో తనకు సాటి మరెవరూ లేరనుకున్న రాజు

వందిమాగధుల స్తోత్రాలు మరింత మత్తెక్కిస్తాయి. రాజ్యాన్ని పంచటానికి బదులుగా, ముగ్గురు కూతుళ్లలో ఎవరు తనను అధికంగా ప్రేమిస్తున్నారో తెలుసుకోవాలనుకొని ఓ పరీక్ష పెడతాడు. గెలిచిన వాళ్లకు అత్యధిక భాగం లభిస్తుంది.

గోనెరిల్ చూపిన వినయ విధేయతలు, గాఢమైన ప్రేమతో తండ్రి మనసు అర్థమవుతుంది. మూడో వంతు ఆమెకిస్తాడు. రెగాన్ తన అక్కకన్నా రెండాకులెక్కువ చదివింది. ఆమెక్కూడా మూడో భాగం దొరికింది. కార్డెలియాకు పొగడ్తలంటే గిట్టవు. మనసులోని మాట టక్కున చెప్పేస్తుంది. ప్రపంచంలో తండ్రి తప్ప తనకు మరెవరూ ఇష్టంలేరని ఎలా అబద్ధాలు వల్లించగలదు? ఒక కూతురికి తండ్రిపట్ల ఉండవలసిన ప్రేమ తనకుంది. కాని బ్రిటన్ మొత్తం ఇస్తానన్నాసరే, కల్లబొల్లి మాటలతో తండ్రిని మోసం చెయ్యలేదు. నిజాయితీని మించిన సుగుణం లేదు.

పొగడ్తలకు అలవాటు పడ్డ రాజుకు కోపం వస్తుంది— చేతిలోని బొమ్మను లాక్కుంటే చిన్న పిల్లలు ఏడుస్తారే, అలా. మిగతా రాజ్యాన్ని కూడా పెద్ద కూతుళ్లిద్దరికీ ఇచ్చేసి, "నీ మొహం నాకు చూపించకు" అంటూ కార్డెలియాను శిక్షిస్తాడు.

లియర్ విశ్వాసపాత్రుడైన అనుచరుడు ఎర్ల్ ఆఫ్ కెంట్. రాజు ప్రవర్తనకు విస్తుపోతాడు. అనుభవజ్ఞుడైన వృద్ధుడినోట రావలసిన మాటలా ఇవి! సామాన్యులు కూడా ఇంత మూర్ఖంగా ప్రవర్తించరే. "విజ్ఞత సన్నగిల్లిందా? చూపు మందగించిందా?" అంటూ రాజును మందలిస్తాడు. కాని కోపోద్రిక్తుడైన రాజు అతణ్ణి దేశం విడిచి వెళ్లమంటాడు.

రాజ్యానికి వారసురాలుకాని కార్డెలియాను వివాహమాడటానికి ఫ్రెంచి డ్యూక్ నిరాకరిస్తాడు. కాని ఫ్రాంసు రాజు అడ్డు తొలగినందుకు సంతోషించి ఆమెను తన రాణిగా చేసుకుంటాడు. కన్నీటితో వీడ్కోలు చెబుతుంది కార్డెలియా. తండ్రిని కంటికి రెప్పలా చూసుకొమ్మని అక్కలిద్దర్నీ అర్థిస్తుంది. లియర్ నెలకో కూతురి వద్ద ఉండాలని ఏర్పాటు జరిగింది. అయితే ఆయన వెంట ఎప్పుడూ వంద మంది సైనికులు, సిబ్బంది ఉంటారు. గోనెరిల్, రెగాన్‌లకు ఇంతమందిని పోషించటం ఇష్టముండదు. ఒకప్పుడు రాజాధిరాజు. ఇప్పుడు కూతుళ్లమీద ఆధారపడిన ముసలాడు. ఎంత చులకనగా మాట్లాడినా, అవమానించినా శిక్షించలేడు.

లియర్ మిత్రుడు ఎర్ల్ ఆఫ్ గ్లూసెస్టర్ ది కూడా ఇదే పరిస్థితి. అతడికిద్దరు కుమారులు. ఒకడు ఎడ్మండ్, అక్రమ సంతానం. ఎర్ల్ వారసుడు ఎడ్గార్. అతని ఆస్తిమీద ఎడ్మండ్ కన్నేశాడు. ఎడ్గార్ దస్తూరీ ఫోర్జరీ చేసి ఒక పత్రం సృష్టిస్తాడు. తండ్రిని అంతమొందించటానికి కుట్ర పన్నుతున్నాడని దాని సారాంశం. గ్లూసెస్టర్ ఇదంతా నిజమేనని నమ్ముతాడు. ఎడ్గార్ సాయుధుడై తండ్రి వద్దకు వెళ్లాలని సలహా ఇస్తాడు ఎడ్మండ్.

ఒప్పందం ప్రకారం లియర్ మొదట గోనెరిల్ ఇంటికెడతాడు. తండ్రి పొడంటేనే

గిట్టదామెకు. ఏ అధికారమూ లేని ముసలాడు ఇంకా రాజదర్పం చూపించటం మరింత కోపం తెప్పిస్తుంది. వేట నుండి తిరిగి వచ్చిన లియర్, గోనెరిల్ లేని సమయంలో తనకూ, తన పరివారానికీ భోజనం వడ్డించమని ఆజ్ఞాపిస్తాడు.

గోనెరిల్ సేవకుడొకడు లియర్ ముందర హాజరవుతాడు. అతడు పాత అనుచరుడు తను దేశబహిష్కరణ శిక్ష విధించిన ఎర్ల్ ఆఫ్ కెంట్. ఇలాగైనా యజమాని సన్నిధిలో ఉండొచ్చని మారు వేషంలో ఇక్కడ ఉద్యోగంలో చేరాడు. ఇతర పరిచారకులను చీవాట్లు అతడు లియర్‌ను సంతోషపెడతాడు.

గోనెరిల్ వచ్చి తండ్రితో పరుషంగా మాట్లాడుతుంది. పరివారాన్ని యాభైకి తగ్గించమంటుంది. ఆమె ఎందుకలా అంటున్నదో కెంట్‌కు తెలుసు. కోరలు పీకిన సింహం  కూడా పెంపుడు జంతువులాగే ఉంటుంది.

కూతురి ప్రవర్తన సహించలేని లియర్ తక్షణమే రెండవ కూతురి దగ్గరకు పోతానంటాడు. గోనెరిల్ భర్త డ్యూక్ ఆఫ్ అల్బానీ తండ్రీ, కూతుళ్లను శాంతింప చేయటానికి ప్రయత్నిస్తాడు. కాని లియర్ కోపంతో ఊగిపోతూ ప్రయాణానికి సిద్ధమవుతాడు.

ప్రశాంతంగా ఉండాలని లియర్ ప్రయత్నం. వెంట వచ్చిన గోనెరిల్ సేవకుడి (మారువేషంలో ఉన్న కెంట్)ను ముందుగా రెగాన్ ఇంటికి పంపిస్తాడు. గోనెరిల్ కూడా మరో మనిషికి ఉత్తరమిచ్చి పంపిస్తుంది.

తన తండ్రి ఇంటికి (కోటకు) రెగాన్ వస్తున్నదని ఎడ్మండ్‌కు తెలుస్తుంది. తమ్ముడు ఎడ్గార్‌ను అంతమొందించటానికి ఇదే అదను. చంపటానికే ఎడ్గార్ వస్తున్నాడని తండ్రిని నమ్మిస్తాడు ఎడ్మండ్. ఎడ్గార్ పారిపోతాడు.

భర్తతో కలిసి కోటకు వస్తుంది రెగాన్. లియర్, అతడి అనుచరులూ ఎడ్గార్ మనసులో విషబీజాలు నాటారంటుంది రెగాన్. ఏదో ఒక సాకుతో తండ్రిని వదిలించుకోవాలని ఆమె ప్రయత్నం.

కెంట్ కూడా ప్రవేశించి గోనెరిల్ సేవకుణ్ణి గాయపరుస్తాడు. రెగాన్, ఆమె భర్త కెంట్‌ను బంధిస్తారు. లియర్ అనుచరుణ్ణి ఇలా నిర్బంధించటం తగదంటాడు కోట యజమాని, (ఆతిథ్యం ఇస్తున్న) ఎర్ల్ ఆఫ్ గ్లౌసెస్టర్.

తన అనుచరుణ్ణి బంధించగలిగిన ధైర్యం ఎవరికైనా ఉంటుందని లియర్ నమ్మలేడు. ఇది రెగాన్ దంపతులు చేసిన పెద్ద పొరబాటు. తక్షణమే ఇద్దరూ తన ముందు హాజరు కావాలని ఆదేశిస్తాడు.

కాని కూతుర్ని చూడగానే మనసు మారిపోతుంది. గోనెరిల్ తనను అవమానించిందని చెప్పి బాధపడతాడు. అక్క చేసిన పనిని సమర్థిస్తుంది రెగాన్. "చిన్నవాళ్లు చెప్పినట్టు వినటమే వృద్ధులకు శ్రేయస్కరం, వెంటనే వెళ్లి గోనెరిల్‌కు క్షమాపణ చెప్పమ"ని కూడా సలహా ఇస్తుంది.

లియర్ బాధపడతాడు. అయినా, రెగాన్‌కు తనంటే ఇష్టమనే అతడి భ్రమ. గోనెరిల్ వస్తుంది.

"నువ్వు చెప్పినట్లే వింటాను. నా వందమంది సిబ్బందినీ అనుమతించమ"ని వేడుకుంటాడు లియర్.

"ఇరవై అయిదుమంది చాలు"నంటుంది రెగాన్.

కృతఘ్నులైన కూతుళ్లిద్దర్నీ అభిశంసించి, తుఫాను రాత్రిలో పయనం కొనసాగిస్తాడు లియర్. ఇంటికి ఆహ్వానించిన ఎర్ల్ ఆఫ్ గ్లాసెస్టర్ బాధపడతాడు.

ఉరుములు, మెరుపులు, కుండపోత వర్షంతో ప్రళయ వాతావరణం భీతిగొల్పుతున్నది. తోడేళ్లు కూడా ముడుచుకొని ఎక్కడో నిద్రిస్తున్నాయి. కాని లియర్ హృదయంలో అంతకన్నా భీకరమైన తుఫాను చెలరేగుతున్నది. కంటికి రెప్పలా యజమాని వెంట నడుస్తాడు కెంట్. కాసేపు ఎక్కడన్నా తలదాచుకొమ్మని అర్థిస్తాడు. దూరంగా ఒక పూరిపాక కనిపిస్తుంది. అయితే ముందర తన సేవకుణ్ణి లోపలికి వెళ్లమంటాడు. గూడులేని పేదల గురించి ఆలోచిస్తాడు లియర్. రాజుగా ఉన్నంతకాలం తనకిలాంటివి తట్టలేదు. స్వసుఖంలో పరుల కష్టాలు కనిపించవుగదా!

పూరిపాకలో దయ్యముందని అరుస్తాడు కెంట్. నిజానికి అక్కడ దాగింది ఎడ్గార్, గ్లాసెస్టర్ కుమారుడు. పారిపోవాలనుకున్నాడుగాని రేవులన్నీ దిగ్బంధం చేశారు. చేసేది లేక ఇక్కడ రహస్యంగా ఆశ్రయం తీసుకున్నాడు. జనం గుర్తు పట్టకుండా "టామ్ ఆఫ్ బెడ్లాం" (ఆనాటి పిచ్చివాడొకడు) వేషం వేసుకున్నాడు.

కన్నపిల్లల చేతిలో దగాపడిన తనలాంటి మరో తండ్రి కాబోలు ననుకుంటాడు లియర్. ఉన్నదంతా ఊడ్చిపెట్టిన అభాగ్యుడు. ఈ ఉన్మాది ఇప్పుడు తన సోదరుడు. బట్టలు చించుకుంటే తనకూ టామ్‌కూ తేడా ఉండదు.

దివిటీతో ప్రవేశిస్తాడు ఎర్ల్ ఆఫ్ గ్లాసెస్టర్. రెగాన్ దంపతులు వారిస్తున్నా వినక తన అతిథి యోగక్షేమాలు స్వయంగా తెలుసుకోవటానికి వచ్చాడు. ఉండటానికి మరో మంచి ఇల్లుంది. కాని టామ్ వెంటలేకుండా కదలనంటాడు లియర్. వృద్ధుడి క్షేమంకోరి ఎడ్గార్‌ను కూడా వెంట తీసుకొని నడుస్తారు.

లియర్ తన ఊహాలోకంలో ఉన్నాడు. న్యాయస్థానంలో విచారణ జరుగుతున్నది. న్యాయమూర్తి స్థానంలో టామ్ కూర్చున్నాడు. ఒక మూలన ఉన్న స్టూల్ గోనెరిల్. తనను చూసి కుక్కలు మొరుగుతున్నాయని భ్రమ పడతాడు. మరో ఊహ వస్తుంది. దాక్టర్లు రెగాన్ హృదయం కోసి చూసి అదెందుకంత కఠినంగా ఉందో తెలుసుకోవాలి. కాసేపు విశ్రాంతి తీసుకొమ్మని అర్థిస్తాడు కెంట్.

రెగాన్, తండ్రి హత్యకు ప్రణాళిక సిద్ధం చేసింది. వెంటనే మరో చోటికి వెళ్లిపోవాలని చెబుతాడు గ్లాసెస్టర్. అందరూ డోవర్ (ఫ్రాంసు వెళ్లటానికి ఉపయోగించే రేవుపట్టణం)కు

ప్రయాణమవుతారు. (కార్డెలియా భర్త నాయకత్వంలో ఫ్రెంచి సైన్యం అక్కడికి చేరుతుంది. గోనెరిల్, రెగాన్‌లకిచ్చిన రాజ్యాన్ని తిరిగి గెలుచుకుని లియర్‌కు అప్పగించటానికి సన్నాహాలు జరుగుతున్నాయి.) ఉన్మాది వేషంలో ఉన్న ఎడ్గార్ మాత్రం అక్కడే ఉంటానంటాడు.

ఎడ్గార్ తండ్రి, ఎర్ల్ ఆఫ్ గ్లాసెస్టర్ కోటకు తిరిగి వస్తాడు. కాని అతడు లియర్ పారిపోవటానికి సహాయం చేశాడన్న వార్త అంతకు ముందరే చేరింది. రెగాన్ దంపతులు అతణ్ణి బంధించి నిజం చెప్పమని హింసిస్తారు. ఒక కన్ను పీకినప్పుడు ఆ దృశ్యం చూడలేని సైనికుడొకడు రెగాన్ భర్తమీదికి కత్తి దూస్తాడు. కానీ యుద్ధంలో మరణిస్తాడు. గ్లాసెస్టర్ మరో కన్ను కూడా పీకుతారు. బాధతో ఎడ్మండ్ కోసం అరుస్తాడు ఎర్ల్. ఎడ్మండ్ పన్నిన కుట్ర ప్రకారమే ఇదంతా జరిగిందని తెలుస్తుంది. పంతం నెగ్గించుకున్న రెగాన్ అంధుడైన తన మామగారిని కోటలోంచి గెంటేస్తుంది.

దారిన పోయే వాడొకడు గ్లాసెస్టర్ చేయి పట్టుకుని నడిపిస్తాడు. ఇంక నడవలేక, "నన్నొదులు. ఆత్మహత్యే నాకు శరణ్యం" అని విలపిస్తాడు అంధ ఎర్ల్. డోవర్‌లో కొండపైనుండి సముద్రంలో దూకి చావాలని నిశ్చయించుకుంటాడు. తనను డోవర్‌కు చేర్చమని టామ్ ఆఫ్ బెడ్‌లాంను బతిమాలతాడు. తండ్రి పరిస్థితి చూసి ఎడ్గార్ కన్నీరు మున్నీరవుతాడు. కాని నిజం చెప్పటానికి మరికొంత సమయం పడుతుంది.

ఫ్రెంచి సైన్యం డోవర్ చేరిందని గోనెరిల్‌కు తెలుస్తుంది. కాని ఆమె భర్త, డ్యూక్ ఆఫ్ అల్బానీ సౌమ్యుడు. యుద్ధానికి సిద్ధంగా లేడు. మగాళ్లంటే ఎడ్మండ్‌లాగ క్రూరంగా ఉండాలని ఆమె అభిప్రాయం. (ఎడ్మండ్ ఇప్పుడు తనను తాను కొత్త ఎర్ల్ ఆఫ్ గ్లాసెస్టర్‌గా ప్రకటించుకున్నాడు.) ఎడ్మండ్ తన ప్రేమికుడు కావాలని కలలు కంటుంది. కాని భర్త మరణించిన రెగాన్ కూడా అతణ్ణే కోరుకుంటే.....

డోవర్ చేరిన ఫ్రెంచి రాజు, సైన్యాన్నక్కడే వదలి, ఓ ముఖ్యమైన పనిమీద తిరిగి వెనక్కు పోతాడు. మరోవైపు కార్డెలియా తండ్రి కోసం గాలిస్తున్నది. నెరిసిన జుత్తుతో, ముళ్ల కంపల్లో తిరుగాడుతున్నాడు లియర్. విశ్రాంతి తప్ప మరో మందు లేదంటాడు డాక్టర్.

గ్లాసెస్టర్, అతడి కుమారుడూ డోవర్ చేరుకుంటారు. తండ్రిని కొండపైకి తీసికెళ్తానంటాడు ఎడ్గార్. పైనుండి చూస్తే కన్పించే దృశ్యం వర్ణిస్తాడు. గ్లాసెస్టర్ ఆ సమయం ఆసన్నమైందని 'కిందికి' దూకుతాడు. దారినపొయ్యే వారువచ్చి రక్షించినట్లుగా ఎడ్గార్ తండ్రిని పట్టుకుంటాడు. దైవ మహిమ వల్లే తన ప్రాణం దక్కిందని నమ్ముతాడు గ్లాసెస్టర్.

గ్లాసెస్టర్‌ను చూసి అతడే గోనెరిల్ అనుకుంటాడు లియర్. ఈలోకంలో నేరస్థులెవరు? శిక్షించే వాళ్లెవరు? స్థానాలు మార్చుకుంటే ఎవరెవరో తెలియదు. అనుచరులు వచ్చి

లియర్‌ను సేదదీరమంటారు. గ్లాసెస్టర్, ఎడ్గార్ ఏకాంతంలో ఉన్నప్పుడు గోనెరిల్ పరిచారకుడు వచ్చి అంధుణ్ణి చంపటానికి ప్రయత్నిస్తాడు. యుద్ధంలో ఎడ్గార్ వాణ్ణి చంపేస్తాడు. మృతుడి జేబులో గోనెరిల్ రాసిన ఉత్తరం దొరుకుతుంది. భర్తను చంపి, తనను స్వీకరించమని ఆమె ఎడ్మండ్‌కు పంపిన వర్తమానమది. ఎడ్గార్ ఆ ఉత్తరం తన జేబులో పెట్టుకుంటాడు.

ఫ్రెంచి శిబిరంలో లియర్ గాఢనిద్రలో ఉన్నాడు. కార్డెలియా తండ్రి ప్రక్కనే కూర్చున్నది. కళ్ళు తెరిచిన లియర్ కూతుర్ని వెంటనే గుర్తు పట్టలేదు. 'భయంలేదు. త్వరలో కోలుకుంటాడని ధైర్యం చెబుతాడు డాక్టరు.

తండ్రి పరిస్థితి చూసి భోరున విలపిస్తుంది కార్డెలియా. "ఈ వృద్ధుణ్ణి క్షమించు తల్లీ" అంటూ ఆమెను అక్కున చేర్చుకుంటాడు లియర్.

యుద్ధంలో ఫ్రెంచి సైన్యం ఓడిపోతుంది. కార్డెలియా, లియర్‌లను బందీలుగా పట్టుకుంటారు. విజయం సాధించిన ఎడ్మండ్ వాళ్లను చెరసాలకు పంపిస్తాడు. సైన్యానికి నాయకత్వం వహిస్తున్న డ్యూక్ ఆఫ్ అల్బానీ (గోనెరిల్ భర్త) బందీలకు ఏ అపకారమూ తలపెట్టకూడదంటాడు. కాని ఎడ్మండ్ అంగీకరించడు. అతడే తన భర్త కావాలంటుంది రెగాన్. అది అసాధ్యమని గోనెరిల్‌కు తెలుసు. ఆమె రెగాన్ మీద విషప్రయోగం చేసింది. మరికాసేపట్లో చెల్లెలు మరణించక తప్పదు. ఉత్తరం ఆధారంగా ఎడ్మండ్‌ను దేశద్రోహిగా ప్రకటిస్తారు. ఎడ్గార్ వచ్చి అతణ్ణి యుద్ధంలో తీవ్రంగా గాయపరుస్తాడు.

ఎడ్మండ్ మరణ శయ్యమీదున్నప్పుడు, గోనెరిల్, రెగాన్‌ల మృతదేహాలను తీసుకొస్తాడు. కారాగారంలో వున్న కార్డెలియాకు ఉరిశిక్ష వెయ్యమని ఆదేశించిన విషయం జ్ఞాపకం వస్తుంది ఎడ్మండ్‌కు. విషయం తెలిసి ఎడ్గార్ ఆమె ప్రాణం రక్షించటానికి పరిగెత్తుతాడు. కాని అప్పటికే శిక్ష అమలు జరిగింది. కూతురి మృతదేహాన్ని చేతుల్లో ఎత్తుకొని వస్తాడు లియర్.

కారణాలేమైతేనేం, తను ప్రాణానికి ప్రాణంగా చూసుకున్న ముగ్గురు కూతుళ్లలో ఒక్కరూ మిగల్లేదు. ఇంత విషాదం భరించలేని వృద్ధరాజు లియర్ గుండె పగిలి మరణిస్తాడు.

# 23. టైమన్ ఆఫ్ ఏథెన్స్



జూలియస్ సీజర్, ఆంటోనీ, క్లియోపాత్రాల గురించి చదివినప్పుడే టైమన్ గురించి తెలుసు కుని వుంటాడు షేక్స్ పియర్. అయితే వాటి లాగ టైమన్ కథను ఒక "అద్భుత" నాటకంగా మలచలేకపోయాడు. ఒక నీతికథకు నాటక రూపం ఇచ్చినట్టుగా వుంటుంది ఇది. "సజీవ పాత్ర చిత్రణ" అనలేంగాని, జీవిత సత్యాన్ని దర్శింప చేస్తుంది

ఏడు తరాలకు సరి పడినంత ఆస్తి కూడ బెట్టాడు టైమన్. రోజూ విందు వినోదాలతో కాలక్షేపం చేస్తుంటాడు. కీర్తి కండూతి ఎక్కువ. చేయి చాపిన వాళ్లందరికీ కానుకలిస్తుంటాడు ఒక కవిగారు కావ్యం అంకిత మిస్తాడు. ఒక చిత్ర కారుడు ఆయన బొమ్మ గీస్తాడు.

వజ్రాలు పొదిగిన నగలు తెస్తాడొక వ్యాపారి. ఆ యిల్లు నిత్యం అతిథి, అభ్యాగతులతో కిటకిట లాడుతూ వుంటుంది. ఏథెన్స్ శాసనసభ్యులు ఆయన దర్శనం కోసం నిరీక్షిస్తుంటారు. చుట్టూ పొగడ్తలలో ముంచెత్తే వందిమాగధులు, మిత్రులు. వచ్చిన వాళ్లెవరూ ఖాళీ చేతుల్తో వెనక్కి తిరగరు. ధర్మదాత టైమన్.

ఏథెన్స్‌లో టైమన్ దాతృత్వాన్ని నిరాకరించింది ఏప్మాంటస్ ఒక్కడే. "గుంటనక్కలు, స్వార్థపరులు ఆకాశానికెత్తితే పొంగిపోతాడు." అని వ్యాఖ్యానిస్తాడు.

"ఎక్కడికెడుతున్నావని" అడుగుతాడు టైమన్. "ఈ నగరంలో నిజాయితీగా బతుకుతున్న మనిషున్నాడేమో వెదకటానికి" అంటాడు ఏప్మాంటస్." అలా మాట్లాడితే వురితీస్తారంటాడు టైమన్. "ఊరిమీద పడి తిరగటం నేరం కాద"ని జవాబు.

మిత్ర బృందానికి బ్రహ్మాండమైన విందిస్తాడు టైమన్. ఏప్మాంటస్ వెళ్లడు. "నీ భోజనం గొంతుకడ్డం పడుతుంది. పొగడ్తలరాయుణ్ణి కాన్నేను. అందరూ కలిసి టైమన్‌ను దోచుకుతింటున్నారు."

టైమన్ పరిచారకుడు కూడా దిగులుపడుతుంటాడు. ఇలా విచ్చలవిడిగా ఖర్చుచేస్తే యజమాని ఆస్తి ఎంతోకాలం మిగలదని తెలుసు. ఆస్తి తరిగి పోతున్నదని పరిచారకుడూ, "దొంగమిత్రులున్నారు, జాగ్రత్త" అని ఏప్మాంటస్ హెచ్చరిస్తారు. ఇలాంటి సలహాలు టైమన్‌కు రుచించవు. తన మిత్రులు శాశ్వతంగా తనతోనే వుంటారని అతడి నమ్మకం.

టైమన్‌కు అప్పుల వాళ్ల బాధ ప్రారంభమవుతుంది తీసుకున్న డబ్బు తిరిగివ్వమని ఒత్తిడి చేస్తుంటారు. తన అప్పు అంతగా పెరిగిపోయిందని అతడు గ్రహించడు. "పీకలదాకా కూరుకుపోయావని" చెబుతాడు పరిచారకుడు.

భోజనం, మద్యం, విలాసాలు, కానుకలకు ఎంత ఆస్తి వున్నా సరిపోదని అప్పుడు తెలుస్తుంది. మిత్రులు వేసవిలో విడిదికి వచ్చే వలస పక్షుల్లాంటివాళ్లు. అవసరం తీరగానే ఎక్కడివాళ్లక్కడ వెళ్లిపోతారు. కాని, మిత్రులు అంత స్వార్థపరులని టైమన్ యింకా నమ్మడు. "వాళ్లకు తనమీద నిజంగా ప్రేమవున్నది." తన విందులకు వచ్చిన వాళ్లందరికీ అభ్యర్థనలు పంపిస్తాడు. కష్టకాలంలో తనని ఆదుకొమ్మనీ, తోచినంత అప్పు ఇవ్వమనీ.

టైమన్ సేవకుడొకడు లకలస్ వద్దకు వెళతాడు. టైమన్ తనవద్ద చేయిచాచటం హాస్యాస్పదంగా కనిపిస్తుంది లకలస్‌కు – "ప్రతి మనిషికీ ఏదో లోపం వుంటుంది. టైమన్‌లో వున్న పెద్ద లోపం నిజాయితీ". మరొకడు మరొక సాకుతో తప్పించుకుంటాడు. టైమన్ పంపిన సేవకులందరూ ఖాళీ చేతుల్తో తిరిగి వస్తారు. అందరు ఏథెన్స్ నగర పౌరుల్లో ఒక్కడు కూడా అప్పివ్వడు.

అప్పుల వాళ్ల ఒత్తిడి పెరుగుతుంది. లోకరీతిని అసహ్యించుకుంటాడు టైమన్. చివరగా, మరొక్కసారి దొంగమిత్రులందరికీ విందివ్వాలనుకొంటాడు. "దొంగ వెధవలందరూ చివరిసారి నా తిండి మెక్కనీ"

అప్పుల్లో వుంటే టైమన్ మళ్లీ విందెలా యివ్వగలడు. సరదా కోసం తమను పరీక్షించాడంతే. అందరూ పోటీపడి వస్తారు. భోజనం గిన్నెలమీద బోర్లించిన మూతల్ని చూస్తూ లొట్టలు వేస్తూ నిరీక్షిస్తారు.

విందుకు ముందర, టైమన్ వ్యంగ్యంగా భగవంతుణ్ణి ప్రార్థిస్తాడు. "తినండి గాడిద కొడుకుల్లారా తినండి." అంటూ అరుస్తాడు. గిన్నెల్లో వేడినీళ్లు తప్ప భోజనం లేదు. టైమన్ కోపంతో, అసహ్యంతో వూగిపోతూ, వచ్చిన వాళ్లందర్నీ బూతులు తిడుతూ ఒక్కొక్క గిన్నె ఎత్తి వాళ్లమీదికి విసిరేస్తాడు.

"మిత్రద్రోహులు. మనుషుల్ని పీక్కుతినే కుక్కలు. జలగలు. ముఖస్తుతి చేసి పబ్బం గడుపుకునే నీచాతినీచ జంతువులు. గుంటనక్కలు. నాకు మానవ జాతి మీదనే అసహ్యం ఏర్పడింది." అంటూ సుదీర్ఘ వుపన్యాసం యిస్తాడు.

ఆ తిట్లూ, ఆ గిన్నెల విసుర్లూ భరించలేక అతిథులు హడావిడిగా పరుగు తీస్తారు– "టైమన్‌కు పిచ్చెక్కింది" అనుకొంటూ.

టైమన్‌కు నిజంగానే పిచ్చెక్కింది. మనుషుల కృతఘ్నత చూసి అసహ్యమేసింది. ఒకప్పుడు మిత్రులంటే ప్రాణమిచ్చేవాడు. ఇప్పుడు ద్వేషం. దొంగమిత్రులను మాత్రమే కాదు – ఏథెన్స్ ప్రజలందరి పట్ల అసహ్యమేర్పడింది – అంటే ప్రపంచం మీదనే అసహ్యం.

నగరం విడిచి, అడవుల్లో క్రూరమృగాల మధ్య బతకాలని బయల్దేరతాడు. యజమానిని చూస్తే పరిచారకుడికి ప్రేమా, జాలీ. మంచి మనిషి యిలాగైనాడని బాధ. ఒంటరిగా వదలలేక, బాగోగులు చూసుకోవటానికి యజమాని వెంట నడుస్తాడు.

ఒకనాడు, గుహదగ్గిర, దుంపలకోసం తవ్వుతుంటే బంగారం నిధి కనిపిస్తుంది. ఏథెన్స్‌పై దాడికి వెళుతున్న ఒక యోధుడికి బంగారం కానుకగా యిస్తాడు టైమన్.

ఆ యోధుడు కూడా ఏథెన్స్ పౌరుడే. శాసనసభ్యుల కృతఘ్నతతో బహిష్కరణకు గురై, యిప్పుడు నగరాన్ని ధ్వంసం చెయ్యటానికి బయల్దేరాడు. ఏథెన్స్‌ను తలచుకొంటే కోపంతో మండిపోతాడు టైమన్. అది కృతఘ్నుల, మానవాధముల నగరం. ఎప్పుడైతే

వస్తాడు. "దొంగమిత్రుల్ని అసహ్యించుకొంటే అర్థం వుంది. నిన్నెప్పుడూ ఆకాశానికెత్తిన వాళ్లను ఎందుకసహ్యించుకొంటావు?" అని అడుగుతాడు.

టైమన్‌కు బంగారం దొరికిందనీ, దాన్నందరికీ పంచుతున్నాడనీ నగరంలో తెలుస్తుంది. ఎలాగైనా కొట్టెయ్యాలని యిద్దరు దొంగలు వస్తారు. టైమన్ వాళ్లను సాదరంగా ఆహ్వానిస్తాడు. అతని దృష్టిలో మనుషులందరూ దొంగలే. "ఇన్ని కష్టాల్లోనూ తన్నంటి పెట్టుకున్న పరిచారకుడి మీద ప్రేమ పెరుగుతుంది. "నిజాయితీగా నాకు సలహా యిచ్చింది యితడొక్కడే"

పాత మిత్రులూ, శాసనసభ్యులూ గుంపుగా టైమన్‌ను చేరుకొంటారు. అందరికీ బంగారం కావాలి. యోధుణ్ణి నియంత్రించటానికి టైమన్ సహాయం అర్థిస్తారు.

"మీకొక్క సహాయం చెయ్యగలను. ఈ చెట్టును కూల్చబోతున్నాను. ఈ లోగా యిష్టమున్న వాళ్లు వచ్చి వురేసుకోవచ్చు" అంటూ బూతులు తిడతాడు టైమన్.

యోధుని ముందర మోకరిల్లుతారు శాసనసభ్యులు. "న్యాయం చెయ్య"మంటారు. "దుష్టులను మాత్రమే శిక్షిస్తానని" హామీ యిస్తాడు యోధుడు.

మనుషుల పట్ల తనకున్న అసహ్యాన్ని సమాధి ఫలకంమీద రాసుకుని మరణిస్తాడు టైమన్.

టైమన్ లోపాల్ని క్షమిస్తారు ప్రజలు. ఏథెన్స్‌లో శాంతి విలసిల్లుతుంది. షేక్స్‌పియర్ ముగింపులు యిలాగే వుంటాయి.





# 24. ఆంటోనీ అండ్ క్లియోపాత్రా

ప్రపంచాన్ని తమ స్వంత ఆస్తిలాగ పంచుకున్న రాజుల కథ యిది. ప్రేమ ప్రణయాల పర్యవసానాన్ని దర్శింపచేస్తుంది. రాజ్యాలు వాళ్ల ఆటబొమ్మలు. గొప్ప కవిత్వ పంక్తులతో నగిషీలు చెక్కిన మధుర, విషాద కావ్యం ఆంటోనీ అండ్ క్లియోపాత్రా. ఈ ప్రణయ గాధకు కేంద్ర బిందువు కియోపాత్రా. ప్రపంచ సుందరి. ఈజిప్టు రాణి.

అలెగ్జాండ్రియా నగరం. క్లియోపాత్రా అంతఃపురం. రోమన్ సైన్యాధిపతి మార్క్ ఆంటోనీ ప్రేమ వలలో చిక్కుకున్నాడు. విశ్వవిజేత అయిన ఆ మహావీరుడు ప్రస్తుతం క్లియోపాత్రా కనుసన్నలు దాటలేని బానిస. రోమ్‌లో జూలియస్ సీజర్ మరణించాడు. తిరిగి వచ్చి బాధ్యతలు స్వీకరించమని వర్తమానాలు వస్తున్నాయి. కాని ఆ విషయాలు తెలుసుకోవటానికి కూడా యిచ్ఛలేదు. ఆంటోనీకి క్లియోపాత్రా తప్ప మరి లోకం లేదు.

సీజర్ మరణం తర్వాత, రోమన్ సామ్రాజ్యాన్ని పాలిస్తున్న ముగ్గురు అధినేతల్లో ఒకడు ఆంటోనీ. ముగ్గురిలోకీ ఎక్కువ అనుభవజ్ఞుడూ, పరాక్రమశాలీ. పైగా వివాహితుడు. అతనికి ఈజిప్టులో వుండవలసిన పనిలేదు. కాని క్లియోపాత్రా యిక్కడ వున్నది. ఆమెను విడిచి ఒక్క క్షణం కూడా వుండలేడు.

తమ పరిచారకులను వెంటపెట్టుకుని, ఆంటొనీ, క్లియోపాత్రా ప్రవేశిస్తారు. ఆంటోనీకి తనమీద నిజమైన ప్రేమ లేదని రుసరుసలాడుతున్నది కియోపాత్రా. రోమ్‌నించి వచ్చిన దూతలను చూసి తన కోపం మరింత పెరిగింది. విరహం భరించలేక (భర్తకు) పత్రం

పంపింది అంటొనీ భార్య. రోమ్ పాలకుల్లో ఒకడు అక్టేవియస్ సీజర్ కొన్ని ఆదేశాలు జారీ చేశాడు - అంటొనీ వాటిని శిరసావహించక తప్పదు. ఆంటొనీకి ఎవర్నీ వినే ఓపికలేదు. తన ప్రియురాలిని ప్రసన్నం చేసుకోవటమే అతడి తక్షణ కర్తవ్యం. రాత్రి వినోదాల గురించి చర్చించుకుంటూ యిద్దరూ నిష్క్రమిస్తారు.

అంతఃపురంలోని మరొక గదిలో, ఎవరో జాతకం చెబుతుంటే వింటున్నారు పరిచారికలు. క్లియొపాత్రా ప్రవేశం. "నేనంటే ప్రాణమే. కాని రోమన్ స్వభావం అతడి దృష్టిని రాజ్యవ్యవహారాల వైపు మళ్లిస్తున్నది." అంటొనీ భార్య గురించి ఆమెకు భయంలేదు. కాని యుద్ధతంత్రం, అధికారం అంతకన్నా ప్రియం అంటొనీకి. ఏలాగైనా అతణ్ణి తనకు కట్టిపడేసుకోవాలి.



మరొక భటుడితో కలిసి ఆంటొనీ ప్రవేశం. క్లియొపాత్రా తప్పుకుంటుంది. ఆంటోనీ, భటుడూ మాట్లాడుకుంటారు.

రెండు దుర్వార్తలు. రోమన్ అధికారానికి వ్యతిరేకంగా శతృసమీకరణ జరుగుతున్నది. ఆంటొనీ భార్య మరణించింది. అప్పటిదాకా అతడు, ఆమె మరణిస్తే బాగుండుననుకున్నాడు. కాని యిప్పుడు ఆమెను తలచుకుంటే బాధగా వున్నది. బహుశా, యిక ఈజిప్టును వదలవలసిన సమయం వచ్చింది. తన మిత్రుడు ఎనోబార్బస్‌ను పిలిచి ప్రయాణ సన్నాహాలు చెయ్యమంటాడు.

ఎనోబార్బస్ హాస్యప్రియుడు. ఆంటొనీ వెళ్లిపోతే క్లియొపాత్రా ఏమైపోతుంది? ఎలా వుంటుంది? అని ఆలోచిస్తాడు. చాలా చిన్న విషయాలకే ఆమె తల్లడిల్లి పోతుంటుంది. ఈ వియోగాన్ని తట్టుకోగలదా. ఇవన్నీ ఆంటొనీ కూడా వూహించక పోలేదు. "ఆమెతో పరిచయం కలగకపోయినా బాగుండేది!" కాని క్లియొపాత్రాను చూడని ఈజిప్టు యాత్ర వృధా కాదూ!

అంటొనీని రక్షించుకోవటానికి క్లియొపాత్రా యుద్ధం చెయ్యగలదు. "అతడు విచారంగా వుంటే నేను నాట్యం చేస్తూ నిరీక్షిస్తున్నానని చెప్పు. సంతోషంగా వుంటే అనారోగ్యంగా వున్నానని చెప్పు." అంటూ చెలికత్తెను పంపిస్తుంది.

"మగవాళ్లు మన దగ్గరకు రావాలంటే, వాళ్లకు కోపం తెప్పించకూడదు" అంటూ సలహా యిస్తుంది చార్మియన్ (చెలికత్తె)

"నువ్వు మూర్ఖురాలివి. అలా చేస్తే వాళ్లు మన మొహం కూడా చూడరు." అంటూ చీవాట్లు పెడుతుంది క్లియొపాత్రా. ఆమె సాంగత్యంతో మొహంమొత్తిన ప్రేమికులుండరు.

హడావిడిగా వస్తాడు ఆంటొనీ. జబ్బు నటిస్తూ పడుకుని వుంటుంది క్లియొపాత్రా. అంటొనీ రాకను గమనించనట్టు ఎవరో (ప్రేమ) ద్రోహిని నిందిస్తున్నది: ఆంటొనీ భార్య ఏదో జాబు పంపించిందని ఆమె అనుమానం

"భార్యంటే పడిచచ్చేవాడివి యిక్కడికెందుకొచ్చావ్? నిన్నిక్కడ కట్టిపడేశానని నన్నెవరూ

ఆడిపోసుకోనక్కర్లేదు. నీ మీద నాకేం అధికారమున్నది? నేనేమైపోతే నీకేం. ఎంత భార్యముందు మరో ఆడది సాటిరాదుకదా!"

ఈ వాగ్ధాటికి ఆంటొనీ చేతలుడిగి, ఆమె చెంత మోకరిల్లటం తప్ప మరేమీ చెయ్యలేదు. చివరికి, రోమ్‌నించి వచ్చిన రాజకీయ వొత్తిడులను వివరిస్తాడు. అంతర్యుద్ధానికి రంగం సిద్ధమవుతున్నదంటాడు. ముందరే చెప్పవలసిన విషయం యిప్పుడు చెబుతాడు. భార్య మరణించింది. అయినా, క్లియోపాత్రా శాంతించదు. మరికాసేపటికి ఆమె ప్రేమవర్షంలో తడిసి ముద్దవుతాడు. అనివార్యమైన పరిస్థితులు ఏర్పడ్డాయి. పైగా భార్య బతికిలేదు. తన ప్రియుడికి వెళ్లటానికి అనుమతిస్తుంది క్లియోపాత్రా.

రోమ్. మరో యిద్దరు పాలకులు లెపిడస్, ఆక్టేవియస్ సీజర్ యుద్ధతంత్రం చర్చిస్తున్నారు. పాంపే సైన్యాన్ని ఎలాగైనా ఎదుర్కొనక తప్పదు. సీజర్ యువకుడు ఎవర్నీ అంత సులభంగా క్షమించడు. ఆంటొనీ ప్రవర్తన అతడికేమాత్రం నచ్చలేదు. "ఈజిప్ట్ విలాసాలు అతణ్ణి కబళించాయి." ఆంటొనీ అప్పటికే అలెగ్జాండ్రియా నుండి బయల్దేరాడని అతడికి తెలియదు. క్లియోపాత్రా ప్రేమలేఖలు రాస్తూ కాలం గడుపుతున్నది. పాంపే సైన్యం సిసిలీదాకా వచ్చింది. ఆంటొనీ రోమ్‌కు వస్తున్నాడని తెలుస్తుంది.

సీజర్, ఆంటొనీల సమావేశం సాఫీగా జరగదు. సయోధ్య కుదర్చటానికి లెపిడస్ చేసిన ప్రయత్నాలు విఫలమవుతాయి. సీజర్ ఆరోపణల్లో వాస్తవముంది. ఆంటొనీ సమర్థించుకోలేడు. రాజకీయాల్లో తలపండినవాడు పొరబాట్లను అంగీకరిస్తాడు కాని తలవంచలేడు. ఆంటొనీతో శతృత్వం పెట్టుకుంటే వుభయులకూ నష్టమని సీజర్‌కు తెలుసు. తన చెల్లెల్ని ఆంటొనీకిచ్చి సంబంధం కలుపుకోవాలంటాడు. వ్యక్తిగత కక్షలకన్నా రాజకీయ ప్రయోజనం ముఖ్యం. వివాహానికి ఆంటొనీ అంగీకరిస్తాడు.

ముగ్గురు పాలకులూ నిష్క్రమించిన తర్వాత మిత్రులతో ఎనోబార్బస్ ప్రవేశం. క్లియోపాత్రా సౌందర్యాన్ని గురించే అందరూ మాట్లాడుకుంటున్నారు. చెప్పటానికి ఎనోబార్బస్ దగ్గిర ఎన్నో కథలున్నాయి. స్త్రీ లావణ్యాన్ని వర్ణించే కవిత్వం కూడా మధురాతి మధురంగానే వుంటుంది.

"స్వర్ణ సింహాసనం మీద కూర్చుని బంగారు నావలో నైలునది మీద విహరించిందామె. ఎటుచూసినా బంగారం. తెరచాపలు వెదజల్లిన సుగంధ పరిమళాలు. వెండి తెడ్లకర్రలు. ప్రేమలోకానికి మహారాజ్ఞి ఆమె....."

"మళ్లీ పెళ్లి చేసుకున్నాడు గనక యిక ఆంటొనీని ఆమె మరచిపోవటం మేలు" అంటాడొకడు.

కాని అసలు రహస్యం ఎనోబార్బస్‌కు తెలుసు.

"ఆంటొనీ ఎప్పుడూ ఆమెకు దాసుడే. కాలంతో పదలిపోయే అందం కాదామెది. 

ప్రేమ చతురత అసామాన్యం. ఆమె సాంగత్యంలో తృప్తి తీరదు. కోరిక మరింత పెరుగుతుంది......"

అలెగ్జాండ్రియాలో క్లియోపాత్రా విరహం. ఆంటొనీ ఆలోచనలే ఆమెను ముసురు కుంటున్నాయి. రోమ్ నించి దూతవస్తాడు. వాడికి నోరు తెరిచే అవకాశమైనా యివ్వకుండా ప్రశ్నలతో ముంచెత్తుంది క్లియొపాత్రా. చివరికి, వార్త విన్న ఆమె కోపానికి అవధులుండవు. ఆంటొనీ, సీజర్ సోదరిని వివాహమాడాడు. ఆగ్రహం వస్తే క్లియొపాత్రా పులిలాగ మారిపోతుంది. స్త్రీ సహజమైన అసూయ. ఆ అగ్నిశిఖలకు తల్లడిల్లుతాడు దూత. ఈజిప్టు రాణికి దుర్వార్త అందించిన వాడు శిక్షార్హుడు కాదా మరి! ప్రాణాలు చేతపట్టుకుని పారిపోతాడు. తన కోపమంతా వాడిమీద చూపినందుకు బాధపడి మళ్లీ దూతను వెనక్కి పిలిపిస్తుంది. కాసేపు దూషించి, కాసేపు బుజ్జగించి తనక్కావలసిన వార్తలు చెప్పింపు కుంటుంది. కాని రారాణి కూడా వాస్తవానికి అతీతురాలు కాదు. "ఆమె జుత్తు రంగు ఎలాగుంది?" అని అడుగుతుంది.

రోమ్ పాలకులు పాంపేతో సంధి చేసుకుంటారు. శాంతి వచ్చిందనే అందరూ అనుకుంటారు, ఎనోబార్బస్ తప్ప. ఆంటొనీ వివాహం ఎంతోకాలం నిలవదని అతడికి తెలుసు. సీజర్ సోదరి సాదాసీదామనిషి. క్లియొపాత్రా ఆకర్షణల ముందు దిగదుడుపు. సీజర్, ఆంటొనీలను బంధువులను చెయ్యటానికి వుద్దేశించిన వివాహం వాళ్లను విడదీస్తుంది. ఆంటొనీ తన "ఈజిప్షన్ విందు" కోసం ఆవురావురు మంటున్నాడు.

శాంతి సంధి సందర్భంగా పాంపే తన పడవలో అందరికీ పార్టీ యిస్తున్నాడు. మధువు ప్రవహిస్తున్నది. లిపిడస్ ఎక్కువగా తాగలేదు. మత్తులో జోగుతున్న ఆంటొనీ మొసలిని వర్ణిస్తాడు. ".....ఎలా వుంటుంది? మొసలిలా వుంటుంది....." ముగ్గురు పాలకులనూ చంపి, రోమ్ సింహాసనం హస్తగతం చేసుకోమ్మని పాంపేకు సలహా యిస్తారు మిత్రులు. అది వీర లక్షణం కాదు. కాని ఆ సలహా యిచ్చినవాడు మొదట ఆ పని చేసి వుంటే ఎంత బాగుండేది. తప్పతాగి నీటిలో పడిపోయిన లెపిడస్‌ను రక్షిస్తారు. ఎనోబార్బస్, ఆంటొనీ కూడా తూలుతూ వొడ్డుకు చేరుకుంటారు.

యుద్ధం- ఆంటొనీ సైనికులను విజయం వరిస్తుంది. భార్యతో కలిసి ఆంటొనీ ఏథెన్స్‌కు ప్రయాణమవుతాడు. చెల్లెలికి కన్నీటి వీడ్కోలు చెబుతాడు సీజర్. ఈజిప్టులో కూడా ఆమె గురించి చర్చ జరుగుతున్నది. ఆక్టేవియా (ఆంటొనీ భార్య) అందచందాలను గురించి ఆరాతీస్తున్నది క్లియొపాత్రా.

"మీ అంత పొడుగు కాదు." అంటాడు దూత. "గొంతు కూడా మీలా వుండదు." "మరుగుజ్జా, బొంగురు గొంతూ" కాబోలుననుకుంటుంది క్లియొపాత్రా. రాణీగారికి కోపం రాకుండా వుండాలంటే ఎలాంటి వార్తలు చెప్పాలో దూతకు కూడా తెలిసిపోయింది. "ఆక్టేవియా అస్సలు అందంగా వుండదు. పైగా మొహం కూడా గుండ్రంగా- బావుండదు.

జుత్తులో మెరుపుండదు. నుదురుభాగం బాగా పలచన." క్లియొపాత్రా ఆనందం రెట్టింపవుతుంది. దూతకు బహుమతుల పంట. క్లియొపాత్రాకు తెలుసు-ఆంటొనీ వెళ్ళి మున్నాళ్ల ముచ్చట. అతడు తన దగ్గరకు తిరిగి రాక తప్పదు.

ఆమె అంచనా సబబే. "మీ అన్నతో నాకు భేదాలున్నాయంటాడు" ఆంటొనీ, భార్యతో. అన్నకు సర్ది చెబుతానంటుంది ఆక్టేవియా. వైరం పెట్టుకుంటే యిద్దరికీ ముప్పు అని ఆమెకు తెలుసు.

కాని ఆమె నిస్సహాయురాలు. అధికారం పంచుకోవటం. ఒకరి ఆజ్ఞలకు ఒద్దిగ వుండటం సీజర్‌కు నచ్చదు. లెపిడస్‌ను పదవీచ్యుతుణ్ణి చేశాడు. పాంపేతో యుద్ధం చేశాడు. ఆ విజయం వల్ల కలసివచ్చిన సంపదలో ఆంటొనీకి భాగమివ్వలేదు.

ఆంటొనీ ఈజిప్టుకు తిరిగి వెళ్లి, బావమరిది మీద యుద్ధం ప్రకటిస్తాడు.

ఇదంతా నిజానికి క్లియొపాత్రా గెలుపు. ఆంటొనీ మళ్లీ తనకు దక్కాడు. కాని ఆంటొనీకి యుద్ధ తంత్రం చేసే తీరిక లేదు. ఆమె అతణ్ణి ఒంటరిగా వదిలితే గద. ఎనోబార్బస్‌తో వాగ్వాదానికి దిగుతుంది. యుద్ధ వ్యూహం మార్చుకొమ్మంటుంది. ఈజిప్ట నౌకా శక్తి అపారం. భూమార్గం వదిలి సముద్ర యుద్ధం చెయ్యమంటుంది. కాని ఆంటొనీ సైన్యం భూయుద్ధంలో తర్ఫీదు పొందింది. ఎనోబార్బస్ ఎంత చెప్పినా ఆంటొనీ వినడు.

"మన నాయకుణ్ణి నడిపించే నాయకురాలామె. స్త్రీ ఆజ్ఞను పాటించే సైనికులం మనం." అంటాడొక సైనికుడు.

సముద్ర యుద్ధంలో ఆంటొనీ సైన్యం బాగా నష్టపోతుంది. క్లియొపాత్రాకు యుద్ధంలో ఆసక్తి తగ్గుతుంది. తన నావల్ని వెనక్కి రప్పించుకుంటుంది. ఆంటొనీ – సైన్యాధిపతి, మహావీరుడు – యిప్పుడు స్వంత నిర్ణయాలు తీసుకునే స్థితిలో లేడు. క్లియొపాత్రా సూచనమేరకు తన సైన్యాన్ని వుపసంహరించుకుంటాడు. పరాజితుడైన ఆంటొనీని వదిలి, సీజర్‌కు తమ విధేయత ప్రకటించుకుంటారు తూర్పు దేశాల రాజులు. ఆంటొనీ సైనికులు కూడా సీజర్ పక్షం చేరిపోతారు. ఆంటొనీ యిప్పుడు నిర్బలుడని ఎనోబార్బస్‌కు తెలుసు. అయినా స్నేహం వీడడు.

పరాజితుడైనా, పరాభవంలో కూడా ఆంటొనీ ఔన్నత్యం తగ్గలేదు. "ఇంకేమీ మిగల్లేదు." అయినా తన మనుషుల బాగోగుల గురించే ఎప్పుడూ ఆలోచిస్తాడు. బంగారంతో నిండిన ఒక నావ రేవులో లంగరువేసి వున్నది. "అది తీసుకుని వెళ్లి సీజర్‌తో సంధి కుదర్చండి" అని ఆదేశిస్తాడు.

తన దీన స్థితిని చూసి క్లియొపాత్రా రోదిస్తుంది. ఆంటొనీ మనసు కరుగుతుంది. ఆమె సన్నిధి వుంటే చాలు. మరి దేన్నీ లెక్కచేయడు. కాని విజేత సీజర్. అతడే షరతులు పెట్టినా పరాజితులు అంగీకరించక తప్పదు. ఆంటొనీని దేశం నించి తరిమేస్తే క్లియొపాత్రాకు తననించి ప్రమాదమేమీ వుండదని వార్త పంపిస్తాడు సీజర్. అవమానంతో

ఆంటొనీ, సీజర్ను ఎదురెదురు యుద్ధం చెయ్యమంటాడు "సైన్యాల వెనక పిరికి పందలా దాక్కోవటం కాదు."

మనస్తాపంతో కుంగిపోతున్న ఆంటొనీ, ఒకనాడు సీజర్ దూత వచ్చి క్లియొపాత్రా ముందు మోకరిల్లటం చూస్తాడు. కోపంతో, ఆ దూతను చావచితకదన్నమంటాడు. సీజర్ మనిషికి అతిథ్యమిచ్చినందుకు క్లియొపాత్రాను కూడా దూషిస్తాడు.

ఆంటొనీ వుద్రేకాలను కంట్రోలు చెయ్యటమెలాగో క్లియొపాత్రాకు తెలుసు. సైన్యాన్ని పునర్నిర్మించి మళ్లీ యుద్ధానికి సన్నద్ధం కమ్మంటుంది. యుద్ధానికి ముందు యిద్దరూ కలిసి ఒక శృంగార రాత్రి గడుపుతారు.

ఆంటొనీ వాస్తవాల్ని విస్మరించి వూహాలోకంలో గడుపుతున్నాడని ఎనోబార్బస్ గ్రహిస్తాడు. విచక్షణలేని శౌర్యం ప్రమాదకరం. ఆంటొనీని వదలక తప్పదు.

యుద్ధానికి ముందురోజు సైనికులనుద్దేశించి ఆంటొనీ వుపన్యసిస్తాడు. ఉద్వేగంతో ఎనోబార్బస్ కళ్లనీళ్ల పర్యంతమవుతాడు. ఆంటొనీ క్లియొపాత్రాను ప్రాణప్రదంగా ప్రేమించాడు. కాని తన అరోప్రాణం యుద్ధం. యుద్ధంలో పుట్టిపెరిగిన వాడతడు. యుద్ధరంగం అతడి క్రీడాస్థలి. ఆయుధాలు ధరించి సన్నద్ధమవుతాడు. ఎనోబార్బస్ తనను వదిలి సీజర్ పక్షం వెళ్లిపోయాడని తెలుసు. తన మిత్రుడి శ్రేయస్సు కాంక్షిస్తూ ధనకనక బహుమతులు పంపిస్తాడు.

సీజర్ శిబిరంలో పశ్చాత్తాపంతో కుంగిపోతున్నాడు ఎనోబార్బస్. ఆంటొనీ పంపిన కానుకలు మోసుకుని వచ్చాయి కంచర గాడిదలు. ఇంత దాతృత్వం భరించలేడు. 'మిత్రద్రోహం' చేశాననే బాధతో ఆ రాత్రి మరణిస్తాడు.

ఆంటొనీ సైనికులు వీరోచితంగా పోరాడి, విజయం సాధించి, అలెగ్జాండ్రియాకు తిరిగి వస్తారు. క్లియొపాత్రా తన హీరోను ఆలింగనం చేసుకుంటుంది. మరుసటి రోజు నౌకలో సముద్ర యుద్ధానికి బయల్దేరుతాడు. కాని ఈజిప్షన్ సైనికులను విశ్వసించలేడు. వాళ్లు యుద్ధమైనా సరిగా చేయకుండానే శత్రువుకు లొంగిపోతారు. క్లియొపాత్రా నమ్మకద్రోహం చేసిందని తెలుసు.

మరొక్కసారి తన అందచందాలతో, యుక్తులతో ఆంటొనీని లోబరుచుకోవాలని అనుకుంటుంది క్లియొపాత్రా. తను మరణించానని ఆంటొనీకి వార్తపంపి, ఒక సమాధిలో దాక్కుంటుంది.

క్లియొపాత్రాను చంపాలని కోపంతో దహించుకుపోతున్న ఆంటొనీకి ఆమె మరణ"వార్త" తెలుస్తుంది. ఇంకేం మిగిలిందని? ఒక గొప్ప నిస్తబ్ధత ఆవరించుకుంటుంది. క్లియొపాత్రా పట్ల ప్రేమ తప్ప అంతా మరచిపోతాడు. ఏ స్త్రీ సౌందర్యం కోసమైతే సామ్రాజ్యాలను, సింహాసనాలను కాలదన్నాడో ఆ అపురూప లావణ్యవతి యికలేదు.

తనను పొడిచి చంపమని మిత్రుడు ఎరాస్ను అర్థిస్తాడు. ఆజ్ఞను శిరసావహిస్తానని

చెప్పి ఎరాస్ ఆత్మహత్య చేసుకుంటాడు.

ఖడ్గం నేలమీదబెట్టి ఆంటొనీ దానిమీద వాలిపోతాడు. లోతుగా గాయమైంది. కాని మరణం వరించలేదు. తన కథ ముగించి సహాయం చెయ్యమని ఆక్రోశిస్తాడు. సైనికులెవ్వరూ అంతటి సాహసానికి పూనుకోరు.

క్లియొపాత్రా మరణించలేదని తెలుస్తుంది. మళ్లీ కొత్త ఆశలు. తనను ఆమె దగ్గిరకు చేర్చమని చివరి కోరికగా అర్థిస్తాడు.

ఆంటొనీని సమాధి వద్దకు తీసికెళతారు. "ఆంటొనీ ఆంటొనీ" అంటూ విలపిస్తుంది క్లియొపాత్రా. సీజర్ చేతుల్లో గాయపడలేదు. తన ప్రాణం తనే తీసుకున్నాడు. అందుకు గర్వంగా వుంది ఆంటొనీకి. ఒక్కసారి క్లియొపాత్రాను ఆలింగనం చేసుకోవాలి.

"అయాం డైయింగ్, ఈజిప్ట్, డైయింగ్...."

సీజర్ తనను చెరలోకి తీసుకుంటాడేమోనని భయపడి క్లియొపాత్రా సమాధి వెలుపలికి రాదు. కాని ఆమె చెలికత్తెలు ఆంటొనీని చేరువకు తీసుకొస్తారు. ఆమె క్షేమం గురించే ఆలోచిస్తున్నాడు ఆంటొనీ. సీజర్ మనుషుల్లో విశ్వపాత్రుడైన ఒక వ్యక్తి పేరు చెప్పి ఆమె చేతుల్లో ప్రాణం విడుస్తాడు.

ఆంటొనీ చేసిన పని క్లియొపాత్రా కూడా చెయ్యగలదు. "రహస్య మృత్యు మందిరం"లోకి ప్రవేశించటం పాపకార్యమేమీకాదు. క్లియొపాత్రా సాహసికురాలే. కాని రోమన్ కాదు. ఆత్మహత్య ప్రయత్నాన్ని వాయిదా వేస్తుంది. "చెరలోకి తీసుకుని ఏంచేస్తావ"ని అడుగుతూ సీజర్‌కు సందేశం పంపిస్తుంది. ఆంటొనీ చెప్పిన విశ్వసనీయ భటుణ్ణి పంపిస్తాడు సీజర్. ఒక ప్లాను వేసి, క్లియొపాత్రాను సజీవంగా పట్టుకుంటాడు భటుడు. అవమానంతో పొడుచుకోబోతుంది క్లియొపాత్రా. ఆక్టేవియా మొహం చూడటమామెకిష్టంలేదు. ఖైదీగా రోమ్ నగరవీధుల్లో తనను వూరేగించినప్పుడు, అందరూ హేళనగా నవ్వుతుంటే...... అంతకంటే చావు చాలా గౌరవప్రదం.

సీజర్ ప్రవేశం. మనసు మార్చుకుని క్లియొపాత్రా అతని ముందర మోకరిల్లుతుంది. తను "చక్రవర్తి గారి సేవకురాలు." తన సంపదనూ, ఆభరణాలనూ లిస్టు రాసి సీజర్‌కు సమర్పిస్తుంది. "నాకున్నదంతా యిదేగదా "అని కోశాధికారి నడుగుతుంది." ఇంకా చాలా వుంద"ంటాడు కోశాధికారి. తనింకా రాణిగానే వున్నాననుకొని అతణ్ణి నిందిస్తుంది క్లియొపాత్రా. ఆడవాళ్లు దాచుకునే వస్తువులు కొన్ని వుంటాయి" అని సీజర్ ముందర సమర్థించుకుంటుంది. "నేను బేహారిని కాను. నీ సంపద నువ్వే వుంచుకో" అంటాడు చక్రవర్తి. కాని క్లియొపాత్రాకు అసలు విషయం తెలుసు. సీజర్‌కు కావలసింది సంపద కాదు. తనే. యుద్ధంలో అతనికి దొరికిన పెద్ద బహుమతి క్లియొపాత్రా. ఈ బహుమతిని రోమన్ ప్రజలముందు ప్రదర్శించాలనుకుంటున్నాడు.

"మంచిరోజులిక లేవు. కథ ముగించ"మంటున్నది చెలికత్తె.

క్లియోపాత్రా మళ్ళీ రాణిగా ముస్తాబు అవుతుంది. కిరీటం, బంగారు దుస్తులూ అత్తిపళ్ళ బుట్టా పట్టుకుని ఒక వృద్ధుడొస్తాడు. అందులో నైలు సర్పం వుంది. బాధలేకుండా త్వరగా జరిగిపోవాలి. రాజవైద్యుడు చెప్పాడు. ఇదే మంచి పద్ధతని.

ఆస్ప్ (సైజు చిన్నది. కాని విషం ప్రాణాంతం. ఈజిప్టు లిబియాలలో దొరికే పాము) కాటేస్తే తక్షణ మృత్యువు.

రాజదండమూ యితర ఆభరణాలూ అందిస్తారు. చెలికత్తెలు రోదిస్తుంటారు. మరుక్షణం అంటొనీ కౌగిలికి చేరుకోబోతున్నా అని క్లియోపాత్రా ఆనందం. పాముతో కాసేపు ఆడుకుని, ఆ "నీచ" సీజర్‌మీది అసహ్యంతో మహారాణిలాగ కనులు మూస్తుంది క్లియోపాత్రా. ఆమె చెలికత్తె చార్మియన్ వీడ్కోలు పలుకుతుంది. రాణిని విడిచి వుండలేక ఆమెకూడా ప్రాణం తీసుకుంటుంది.

తన ఖైదీ తనను తప్పించుకు పోయిందని తెలుసుకుంటాడు సీజర్. అంటొనీ, క్లియోపాత్రాలను జోడుగా సమాధి చెయ్యమని ఆదేశాలు ఇస్తాడు.





# 25. కారియోలానస్

షేక్స్పియర్ ట్రాజెడీలన్నింటిలోకీ సమగ్రమైన కథా సంవిధానం వున్న నాటకం కారియోలానస్. వస్తువుకు తగ్గ శిల్పం కథకు పరిపూర్ణత చేకూర్చింది. హీరో ఎవరికీ తలవంచని రోమన్ వీరుడు. యోధులకుండవలసిన లక్షణాలన్నీ అవసరమైన దానికన్నా ఎక్కువ మోతాదులో వున్నాయి. చివరికి ఆ లక్షణాలే అతని నాశనానికి దారి తీస్తాయి.

హీరో అసలు పేరు కేయస్ మార్టియస్. కారియల్స్ నగరాన్ని జయించాక అతని పేరు కారియోలానస్‌గా మారుతుంది - ఒక రకంగా అది బిరుదు. కథలో అతన్ని ఆ పేరుతోనే పిలుస్తారు.

రోమ్‌లో క్షామం వచ్చింది. ఆహారధాన్యాల ధరలు ఆకాశాన్నంటాయి. నిరుపేదలు ఆకలితో అలమటిస్తున్నారు. శాసన సభలో కూర్చున్న పాలకులే ఈ స్థితికి కారణమని వాళ్ల నమ్మకం.

"దేవుడు ఆగ్రహిస్తే క్షామం వచ్చింది. మన శాసనసభ్యుల్నెందుకు నిందిస్తారు?" అంటూ వాదిస్తాడు మెనెనియస్ అనబడే వృద్ధుడు, కారియోలానస్ మిత్రుడు.

"సెనేటర్లు (శాసన సభ్యులు) మమ్మల్ని నాశనం చేస్తున్నారు. "అంటూ అరుస్తారు బాధితులు:" వాళ్లెప్పుడూ మా బాగోగులు పట్టించుకోలేదు. ఏడాదికి సరిపడా తిండిగింజలున్నాయి వాళ్ల యిళ్లలో. ఇక్కడ మేం ఒక్కపూట గంజిలేక అల్లాడుతున్నాం ఇదే అదునుగా ధరలు పెంచేసి మమ్మల్ని మాడుస్తున్నారు. నల్లబజారులో ధాన్యం అమ్మకం చట్టబద్ధం చేస్తూ శాసనాలు చేస్తారు. మా మంచి కోరేవాళ్లైతే ధనికులకు వ్యతిరేకంగా చట్టాలు చెయ్యమనండి - అంతేకాని మమ్మల్ని మరింత దోచుకోవటానికి కాదు. ఇలా మమ్మల్ని పీక్కుతింటారు. లేదా యుద్ధాల్లో బలిపశువుల్ని చేస్తారు."

మెనెనియస్ వాళ్లను శాంతింప చెయ్యటానికి ప్రయత్నిస్తూనే వున్నాడు. కారియోలానస్ వచ్చి, నిరసన తెలియచేస్తున్న ప్రజలంతా "వీధికుక్కలం"టాడు. "ఎంతసేపూ వీళ్లకు

అతని తప్ప మరొక ధ్యాసలేదు. శాసన సభ అనుమతి యిస్తే కత్తి ఝళిపించి ఒక్క క్షణంలో వీళ్ల నోర్మూయిస్తాను." ఈ జనాభిప్రాయానికి అనుగుణంగా శాసన సభ అయిదుగురు ప్రతినిధులను ఎన్నుకున్నది. ఎన్నికల తతంగమంటేనే కారియోలానస్‌కు మంట.

ఇటలీలోని ఒక యుద్ధ తెగనాయకుడు వోల్సియన్ రోమ్ మీద దాడి చెయ్యటానికి సన్నాహాలు చేసుకుంటున్నాడు. కారియోలానస్‌కు ఆనందంగా వున్నది - అతడు యుద్ధప్రియుడు. యుద్ధరంగమే అతడి క్రీడాంగణం. పైగా అదనపు జనాభాను నియంత్రించటానికి యిది బాగా వుపయోగపడుతుంది. ఆజ్ఞలకోసం శాసన సభకు వెళతాడు. ఇద్దరు ప్రతినిధులు కారియోలానస్‌తో చర్చిస్తారు. వాళ్లు చతురులు. వాగ్దానాలతో ప్రజలను మభ్యపెట్టటం తెలిసినవాళ్లు. కారియోలానస్ దురుసుతనం వాళ్లకు గిట్టదు. తనమీద యుద్ధానికి వస్తున్న ముగ్గురు సేనానుల్లో కారియోలానస్ ఒకడని తెలిసి వోల్సియన్ సంతోషిస్తాడు. తనలాంటి వీరుడు, కారియోలానస్ వంటి మరొక వీరుడితో తలపడటం కన్నా గౌవరమేముంటుంది!

కారియోలానస్ తల్లి వీరమాత. పేరు వాలమ్నియా. చిన్నప్పుడే కొడుకును యుద్ధ విద్యలో నిష్ణాతుణ్ణి చేసింది. "రోమన్ వీరులు ఎవరికీ తలవంచరు" అని బోధించింది. యుద్ధగాయాలు వీరులకు గర్వకారణం. కోడలు వర్జిలియాది సౌమ్య స్వభావం. యుద్ధం, రక్తపాతం చూసి తట్టుకోలేదు.

అత్తాకోడళ్లు కుట్టుకుంటూ కూర్చున్నారు. వీరపత్ని లక్షణాల గురించి కోడలికి ఉపన్యసిస్తుంది వాలమ్నియా. ఎవరో వచ్చి కొడుకు కారియోల్స్ నగరం మీద దాడికి బయల్దేరాడని చెబుతుంది. అందరూ కలిసి పండగ చేసుకోవాలి. భర్త క్షేమం గురించి వర్జిలియా భయపడుతుంది. అత్తలాగ సంతోషించలేదు.

తల్లి కలల్ని నిజం చేస్తాడు కారియోలానస్. వోల్సియన్లతో భయంకర పోరు జరుగుతుంది. పారిపోతున్న యితర రోమన్ సైనికులకు ధైర్యం చెప్పి పోరాటానికి ప్రోత్సహిస్తాడు ఇంచు మించు తనే ఒక సైన్యంగా నగరాన్ని జయిస్తాడు. గాయాలవుతాయి. నెత్తురు కారుతూంటుంది. అయినా కత్తి దించడు. వోల్సియన్లు చిత్తుగా ఓడిపోతారు.

సత్కారాలు, బిరుదులంటే కారియోలానస్‌కు యిష్టముండదు. అవి వ్యక్తి బలహీనతకు నిదర్శనమనుకుంటాడు. అతడి సమక్షంలో కీర్తించటానికి కూడా లేదు. చివరికి సైన్యాధిపతి యిచ్చిన "కారియోలానస్" బిరుదు మాత్రం అంగీకరిస్తాడు.

రోమ్‌లో, మిత్రులూ, శత్రువులు కూడా కారియోలానస్ రాకకోసం నిరీక్షిస్తున్నారు. భర్త గాయపడ్డాడేమోనని వర్జిలియా బాధపడుతుంది. వాలమ్నియాకు అదే సంతోషకారణం. కొడుక్కు భుజంమీదా ఎడమచేతికీ గాయమైందని ఆమెకు తెలుసు.

"ఇప్పటికే నా కొడుకు యిరవై అయిదు చోట్ల గాయపడ్డాడు." అంటుంది గర్వంగా.

వాయిద్యాలు మోగుతాయి. కారియోలానస్ వస్తున్నాడు. తల్లి ఆనందానికి అవధుల్లేవు. కొడుకు యుద్ధంలో మరణించినా ఆమె బాధపడదు. ప్రాణం కన్నా పరువు ముఖ్యం. కారియోలానస్ యుద్ధం చేస్తున్నది దేశం కోసం కాదు. తల్లిని "సంతోష పెట్టటానికి" అంటారెవరో. ఆ మాట ఆమె గర్వాన్ని యినుమడింప చేస్తుంది.

మెళ్లో విజయహారంతో కారియోలానస్ ప్రవేశించి మొదట తల్లికి ప్రణమిల్లుతాడు. భార్య మాత్రం దిగులుతో కన్నీరు కారుస్తుంటుంది. "నేను గెలిచానని ఏడుస్తున్నావా? బందీనైతే సంతోషించేదానివా?" అంటూ పరిహసిస్తాడు. తల్లికింకా ఒక్క కోర్కె మిగిలుంది. కొడుకు ఎలాగైనా ప్రజా ప్రతినిధి కావాలి.

అభ్యర్థి ఒక కూడలిలో నిల్చుని, తన అర్హతలు చెప్పుకుని, సవినయంగా అందర్నీ ఓట్లడగాలి. అలాగ, ఎక్కువ ఓట్లు వచ్చినవాడు ప్రతినిధిగా ఎన్నికవుతాడు. కారియోలానస్ అసహ్యించుకునే మిగతా యిద్దరు ప్రతినిధులకు తెలుసు. చేతులు చాపి యాచించటం అతడి స్వభావంలోనే లేదని. "శత్రువుల మీద విజయాన్ని మాత్రమే యిష్టపడతాడు. సామాన్య ప్రజలంటే తృణీకరమే." లాభం జరుగుతుందన్నా సరే యిష్టంలేని పనిచెయ్యడు. ప్రతినిధి హోదా కావాలి. శాసన సభ తనకై తానుగా ఆ పదవి తనకివ్వాలి. అంతేగాని వీధిలో నిలబడి ఓట్లడగటం మాత్రం తనవల్ల కాదు. ప్రజల ముందు తలవంచటమంటే అవమానంగా వుంటుంది.

చివరికి వచ్చి వీధిలో నిల్చుంటాడు: కాని విజ్ఞప్తి చెయ్యాలంటే నోరురాదు.

అతడి అహంభావాన్ని మన్నించి, ప్రతినిధిని చెయ్యటానికి జనం సిద్ధపడ్డారు. "శౌర్యపరాక్రమాల్ని గౌరవించాలి. ఇలాంటి వీరుడికి కృతజ్ఞత తెలపాలి." కాని కారియోలానస్‌కు తన గొప్పలు చెప్పుకోవటం యిష్టంలేదు. శాసనసభలో అందరూ తన ధైర్యసాహసాలను ప్రశంసిస్తుంటే వినటానిక్కూడా ఆసక్తి చూపడు. సరుకులమ్ముకునే వాడిలాగ, తన గురించి చెప్పుకొని ఓట్ల కోసం ప్రాధేయపడటం అతడికి అత్యంత నీచమైన విషయం. "ఇది కేవలం ఒక ఆచారం మాత్రమే" అని గుర్తు చేస్తాడు పాతమిత్రుడు మెనెనియస్. "ఎంత గొప్పవాళ్లకైనా ఈ అభ్యర్థన తప్పదు."

"ప్రతినిధి వుద్యోగం ఖరీదెంత?" అని అడుగుతాడు కారియోలానస్. "వినయంగా అర్థించటమే" కాని అతడు తనను తాను యిలా "దిగజార్చుకోలేడు." కారియోలానస్‌ను చూసి జనం వోట్లు వేస్తారు. "మిమ్మల్ని అతడు అవమానించాడు" అంటూ ప్రజల్ని రెచ్చగొడతారు మిగతా యిద్దరు ప్రతినిధులు. జనం తాము చేసింది తప్పే అనుకుంటారు.

"కారియోలానస్‌కు శాసనసభలో ప్రవేశించే అర్హత లేదు." అంటూ ప్రకటిస్తారు ప్రతినిధులు. ఎన్నికైన వాళ్లకు కూడా అధికారం కట్టబెట్టకుండా కొందరు దుర్మార్గులు అడ్డుపడుతున్నారని గ్రహిస్తాడు కారియోలానస్. ఇది రాజ్య వ్యవస్థకే ప్రమాదం.

కారియోలానస్ "దేశద్రోహం చేశాడంటూ" ఆరోపిస్తారు వాళ్లు. అతణ్ణి అరెస్టు చెయ్యబోతారు. కారియోలానస్ విదిలించుకొంటాడు. శాంతింప చేయటానికి ప్రయత్నిస్తాడు మెనెనియస్. యుద్ధం నివారించటానికి మిత్రులు కారియోలానస్‌ను దూరంగా తీసుకుపోతారు. మెనెనియస్ ప్రతినిధులతో మంతనాలు జరుపుతాడు.

ఇద్దరు ప్రతినిధులకూ, కారియోలానస్‌కూ తప్ప అందరికీ శాంతి కావాలి. శాసనసభలో కూర్చున్న దాకా ఓపిక పట్టమని తల్లి కూడా సలహా యిస్తుంది. "కాలం ఎప్పుడూ కలిసిరాదు." చివరికి, మిత్రుల కోరిక మేరకు, వీధిలో నిల్చుని, జనాన్ని పొగిడి ఓట్లు అడగటానికి నిశ్చయించుకుంటాడు.

కారియోలానస్‌కు కోపం తెప్పించటం చాలా సులభం. "ఇద్దరు ప్రతినిధులకు ఈ విషయం బాగా తెలుసు. వినయంగా వుండవలసిన క్షణాన కోపోద్రిక్తుడవుతాడు కారియోలానస్. అసలు అధికారం తమ దగ్గిరే వుందని నిరూపించాలనుకొంటారు జనం. "మీరంటే నాకు అసహ్యం. కుళ్లిన శవాలు మీరు. ఓట్లు నాకక్కర్లేద"ంటాడు.

కారియోలానస్ యిప్పుడు ప్రజలకు బహిరంగ శత్రువు. బహిష్కరణ సమయంలో జనం అతణ్ణి నగర ద్వారం దాకా వెంటాడుతారు.

నగరం వెలుపల కారియోలానస్ తల్లికీ, భార్యకూ వీడ్కోలు చెబుతాడు. తనను నాశనం చేసిన రోమ్ పట్ల ప్రతీకార జ్వాల ప్రజ్వరిల్లుతుంది: పాత శత్రువే యిప్పుడు తన మిత్రుడు. వోల్సియన్ల నాయకుడు తనకండ. కారియోలానస్‌లాంటి వీరుడికింత ఘోరావమానం జరిగినందుకు కోపగించుకొంటాడు అతడు. ఇద్దరూ కలిసి రోమ్ మీద దాడికి సిద్ధపడతారు.

యుద్ధపిపాసి కారియోలానస్ బెడద తొలగిపోయినందుకు ప్రతినిధులు పండగ చేసుకుంటున్నారు. కాని అంతలోనే వోల్సియన్లతో కలిసి అతడు దండెత్తి వస్తున్నాడని తెలుస్తుంది. తక్షణోద్రేకంలో తమ నాయకుణ్ణి బహిష్కరించినందుకు ప్రజలు పశ్చాత్తాప పడతారు.

నగరం ముందర కారియోలానస్ సైన్యం శిబిరం ఏర్పాటు చేసుకుంటుంది. రోమ్‌లోని కొందరు మిత్రులు చేసిన శాంతి ప్రయత్నాలు ఫలించవు. మెనెనియస్‌కు నమ్మకం – మిత్రుడు తన మాట వింటాడని. కాని కారియోలానస్ అతణ్ణి చూడటానికే నిరాకరిస్తాడు.

ఇంక చివరి ఆశ ఒక్కటే – కారియోలానస్ తల్లీ, భార్యా, కొడుకూ. తండ్రి లాంటి మెనెనియస్‌ను అవమానించినందుకు బాధపడుతున్నాడతడు. కాని అన్నింటికన్నా వోల్సియన్లకు చేసిన వాగ్దానం ముఖ్యం. తనను ప్రాణాధికంగా ప్రేమించే ముగ్గురు వ్యక్తులు ముందర నిల్చున్నారు. ముఖ్యంగా తన తల్లి. ఆమె ముందర పాదాక్రాంతుడవుతాడు. తల్లి కూడా ప్రణమిల్లుతుంది. "ఇది అసహజం. నేలమీది గులకరాళ్లు ఆకాశంలోని చుక్కలను తాకుతాయా?" అంటాడు.

తల్లి ఎంత చెప్పినా వినడు. ప్రేమకన్నా పరువు ముఖ్యం. తల్లి చిన్నప్పటినించీ తనకు బోధించింది అదే. కాని ఆవిడే యిప్పుడు యుద్ధం తప్పని, క్షమాగుణంలో ఔన్నత్యమున్నదని చెబుతున్నది. "ముందు తరాల వాళ్లు నిన్ను క్షమించరు" అంటుంది, తన మాట నెగ్గలేదని తెలిసి, చివరికి.

"ధ్వంసం చెయ్యటానికి వచ్చావు. నీ పని నువ్వు చెయ్యి. మేం మాత్రం రోంలోనే మరణిస్తాం." అంటుంది.

కొడుకు తల్లి మాట కాదనలేదు. ఆమె నెగ్గింది. సంధికి అంగీకరిస్తాడు. ఇది అసాధ్యమనీ, తను మరణించక తప్పదనీ తెలుసు. వోల్సియన్లకు యిది మిత్రద్రోహం. వాళ్లు తనను క్షమించరు.

యుద్ధమేఘాలు తొలగినందుకు రోమ్‌లో వుత్సవం జరుగుతున్నది. దీనికంతటికీ కారణం వాలమ్నియా. కొడుకు కారియోల్స్‌కు తిరిగి వెళ్లిపోతాడు. తనకన్నా ఎక్కువ కీర్తి ప్రతిష్ఠలున్న మనిషిని వొల్సియన్ల నాయకుడు సహించలేడు. పైగా యుద్ధంచేస్తానని వెళ్లి చేతులు ముడుచుకుని వచ్చాడు. రోమన్ స్త్రీల కన్నీళ్లకు కరిగిపోయిన భీరువు -

కారియోల్‌లో కూడా రోమన్ నాయకుడికి సమర్థన లేకపోలేదు. వోల్సియన్ల నాయకుడిక కాలయాపన చెయ్యడు. కారియోలానస్‌ను హత్య చేస్తారు. మృతదేహానికి గౌరవ లాంఛనాలతో అంత్య సంస్కారం చేస్తారు.





# 26. సింబెలైన్



1623లో, షేక్స్‌పియర్ నాటకాలన్నింటినీ **ఫస్ట్‌ఫోలియో** పేర ఒక చోట చేర్చారు. సింబెలైన్‌ను అందులో ట్రాజెడీగా పరిగణించారు. కాని యిది విషాదాంతం కాదు.

ప్రాచీన బ్రిటన్‌లో సింబెలైన్ రాజు నివాసం. మొదటి భార్య మరణించింది. మళ్లీ పెళ్లి చేసుకున్నాడు. మొదటి భార్య కూతురు ఇమోజెన్ రెండో భార్య కొడుకు క్లోటెన్‌ను చేసుకోవాలని అతని కోరిక. క్లోటెన్ మూర్ఖుడు. ఇమోజన్ రహస్యంగా పోస్థమస్ అనే యువకుణ్ణి పెళ్లాడుతుంది.

ఇరవైయ్యేళ్ల క్రితం ఆమె సోదరుల్ని ఎవరో అపహరించారు. ఇప్పుడు రాజ్యానికి ఏకైక వారసురాలు ఇమోజెన్. తన ఆజ్ఞను ధిక్కరించి పెళ్లిచేసుకున్నందుకు తండ్రికి ఆమెమీద కోపం. రాణీ చెప్పుడు మాటల్తో అది యినుమడించింది. సవత్తల్లి పైకి ప్రేమ నటిస్తుంది కాని, లోపల ఇమోజెన్ అంటే ద్వేషం.

పోస్థమస్‌ను రాజ్యం నుండి బహిష్కరిస్తారు. వెళ్లిపోయే ముందర అతడూ, ఇమోజెన్ అనేక ప్రేమ వాగ్దానాలు చేసుకుంటారు. వీడ్కోలు కానుకగా ఆమె, భర్తకు వజ్రపుటుంగరం తొడుగుతుంది. పోస్థమస్, భార్యకు దండకడియమిస్తాడు. ఆ తర్వాత పడవలో రోమ్‌కు ప్రయాణమవుతాడు. తండ్రి ఇమోజెన్‌ను నానావిధాల నిందిస్తాడు, హింసిస్తాడు. ఆమె ప్రేమ మరింత ధృఢపడుతుంది. పోస్థమస్‌ను సాగనంపి అనుచరుడు తిరిగి వస్తాడు. ఇమోజెన్ అతణ్ణి మరీమరీ అడిగి భర్త సమాచారం తెలుసుకుంటుంది.

ఇటలీలో – ప్రేమ పరీక్షలో ఇమోజన్ నెగ్గదని పోస్థమస్‌తో పందెంకాస్తాడు అయాకిమో (ఒక ఇటాలియన్). భార్య ప్రేమ అచంచలమని పోస్థమస్‌కు తెలుసు. ఓడిపోతే

వజ్రపుటుంగరం యిచ్చేస్తానంటాడు. తను తప్పక గెలుస్తానని అయాకిమో నమ్మకం. వెంటనే బ్రిటన్‌కు బయల్దేరుతాడు.

పోస్థమస్ నుండి పరిచయలేఖ తెచ్చాడు గనక అయాకిమోను రాజదర్బారుకు ఆహ్వానిస్తుంది ఇమోజెన్. పోస్థమస్ గురించి కట్టుకథలన్నీ అల్లి చెబుతాడు అయాకిమో. ఇటలీలో అనేకమంది భామలతో తిరుగుతున్నాడనీ, భార్యను ఒక్కసారి కూడా తలచుకోడనీ అబద్ధాలు చెబుతాడు. చివరగా, తనకిష్టమైతే భర్త స్థానాన్ని పూరించగలననీ సూచిస్తాడు. ఇమోజెన్ కోపం పట్టలేక అతడి నీచ బుద్ధిని శపిస్తుంది. "ఇక నీ మొహం చూపించకు. తక్షణం వెళ్లిపో" అని ఆజ్ఞాపిస్తుంది. వెంటనే మాటమార్చి, ఆమె ప్రేమను పరీక్షించటానికే అలా అన్నానని సర్ది చెబుతాడు అయాకిమో. అంతే కాదు. పోస్థమస్ సజ్జనుడూ, స్నేహశీలి అనీ, రోమ్‌లో అందరూ అతణ్ణి ఎంతో గౌరవిస్తారనీ చెబుతాడు. ఇమోజెన్ క్షమిస్తుంది.

పందెంలో నేరుగా గెలవలేని అయాకిమో జిత్తులతోనైనా నెగ్గాలనుకుంటాడు. తన వద్ద రత్నాలు, వజ్ర వైడూర్యాలతో నిండిన ఒక పెద్ద ట్రంకుపెట్టె వుందనీ, దాన్ని తనూ, పోస్థమస్, యితర రోమన్ సంపన్నులూ కలిసి చక్రవర్తికి కానుకగా యివ్వాలని అనుకుంటున్నామని చెబుతాడు; "ఈ ఒక్క రాత్రికి మాత్రం దాన్ని మీ గదిలో భద్రంగా దాచండి." ఇమోజెన్ సంతోషంగా అంగీకరిస్తుంది.

రాత్రి చదువుతూ పడుకుని, పుస్తకం చేతపట్టుకుని అలాగే నిద్రపోతుంది ఇమోజెన్. దీపం వెలుగుతూనే వుంటుంది. అప్పటిదాకా ట్రంకుపెట్టెలో దాగిన అయాకిమో బయటికి వచ్చి గదిలోని వస్తువులన్నీ లిస్టురాసుకుని, దండకడియం తీసుకుని, ఆమె చేతిమీద ఒక గుర్తుపెట్టి మళ్లీ పెట్టెలో దాక్కుంటాడు. "ఒక రాత్రి ఇమోజెన్‌తో గడిపా"నని పోస్థమస్‌ను నమ్మించటానికి తెల్లారి ఇటలీ వెళ్లిపోతాడు.

రాజుగారి రెండవ భార్య కొడుకు క్లోటెన్ యింకా ఆశ వదులుకోలేదు. ఎలాగైనా ఇమోజెన్‌తో తన పెళ్లి జరుగుతుందనే అనుకుంటున్నాడు. ఉదయం పూట సంగీత పాఠాలు చెప్పటం వల్ల ఆమెను తనవైపుకు తిప్పుకోవచ్చని ఎవరో సలహా యిచ్చారు. ప్రయత్నం ఫలించకపోవటంతో పోస్థమస్‌ను దూషిస్తాడు క్లోటెన్. "నా భర్త కాలిగోటికి సరిపోవంటు"ంది ఇమోజెన్; దండకడియం పోగొట్టుకున్నందుకు విచారంగా వుంది. "రాత్రి చేతికే వున్నది. ముద్దు పెట్టుకున్నాను కూడాను. నా ప్రేమను నివేదించటానికి భర్త వద్దకు పోయిందేమో." ఇమోజిన్ గురించి చెప్పటానికే దండకడియం రోమ్‌కు వెళ్లింది. అయాకిమో చెప్పింది పోస్థమస్ నమ్ముతాడు. భార్య మీది కోపంతో దహించుకుపోతాడు. తనకు "ద్రోహం" చేసిన విశ్వాస ఘాతకురాలిని చంపెయ్యాలనుకుంటాడు.

రోమన్ చక్రవర్తికి కప్పం చెల్లించమని డిమాండ్ చేస్తూ రాజదర్బారుకు వస్తాడు దూత. సింబెలైన్ నిరాకరిస్తాడు. అయినప్పటికీ దూతకు సకల సత్కారాలూ చేస్తారు.

ఇమోజెన్‌ను హత్య చెయ్యమని బ్రిటన్‌లో వున్న తన పరిచారకుడికి లేఖ పంపిస్తాడు పోస్థమస్. తను స్వయంగా బ్రిటన్‌కు వస్తున్నాననీ, మిల్‌ఫోర్డ్ హావెన్ వద్ద కలుసుకొమ్మనీ ఇమోజెన్‌కు మరో లేఖ పంపిస్తాడు. నిజానికి రావటం లేదు. ఆమె హత్యకు వేసిన ప్లాను యిది. లేఖ చదివి సంతోషంతో వుక్కిరి బిక్కిరవుతుంది ఇమోజెన్. పోస్థమస్ పరిచారకుణ్ణి వెంట తీసుకుని వేల్స్‌కు పశ్చిమాన వున్న మిల్‌ఫోర్డ్ హావెన్‌కు బయల్దేరుతుంది.

వేల్స్ పర్వతాలు. రాజ్య బహిష్కృతుడైన రాజభటుడు బెలారియస్ గత యిరవై సంవత్సరాలుగా యిక్కడ రహస్య జీవితం గడుపుతున్నాడు. చెయ్యని నేరానికి శిక్ష పడిందతడికి. రాజుగారి యిద్దరు కొడుకుల్నీ అపహరించి తన పిల్లల్లాగే పెంచాడు బెలారియస్. సుదీర్ఘ కాలంగా కొండల్లో, గుహల్లో గడిపిన పిల్లలకిప్పుడు లోకం చూసి రావాలని కోరిక కలిగింది. బెలారియస్ వాళ్లిద్దర్నీ వేటకు పంపిస్తాడు. కొంత దూరంలో ఇమోజెన్, పరిచారకుడు గుర్రాలు దిగి "పోస్థమస్ నిరీక్షిస్తున్న" స్థలానికి వస్తున్నారు. పరిచారకుడు పశ్చాత్తాపపడి పోస్థమస్ రాసిన లేఖ చూపిస్తాడు. అది చదివిన తర్వాత కూడా ఇమోజెన్‌కు భర్తమీద కోపం రాలేదు. అతణ్ణి వలలో వేసుకున్న ఇటాలియన్ భామల్ని అసహ్యించుకొంటుంది. భర్తకు దూరమైన తను మృత్యువును ఆహ్వానిస్తుంది. ఆ లేఖ వచ్చినప్పటినుండీ ఒక క్షణం కూడా నిద్రపోలేదనీ, విసుగుతో, అలసటతో ఖడ్గం దూరంగా విసిరేస్తాడు పరిచారకుడు. "పని పూర్తిచేసి నిద్రపో" అంటుంది ఇమోజెన్.

తను హత్య చెయ్యలేనని ప్రాధేయపడతాడు పరిచారకుడు. అందుకు బదులుగా ఒక ప్లాను వేద్దామంటాడు. ఆమెను హత్య చేసినట్టుగా పోస్థమస్‌కు వర్తమానం పంపిస్తాడు. ఇమోజెన్ వెళ్లి పురుష వేషంలో రోమన్ రాయబారివద్ద ఆశ్రయం తీసుకోవాలి. రాణి తనకో మందిచ్చింది. అది వుపశమనకారి అని చెప్పిందికాని నిజానికది విషమయ్యుంటుంది. డాక్టరు ఆ మందు మార్చి మరో మందిచ్చాడు. అది సేవిస్తే మనుషులు మరణించినట్టుగా కనిపిస్తారు గాని ప్రాణం పోదు.

రాజదర్బారు. సింబెలైన్ రోమ్ మీద యుద్ధం ప్రకటించాడు గాని మిల్‌ఫోర్డ్ హావెన్‌దాకా రోమన్ రాయబారి క్షేమంగా ప్రయాణించటానికి ఏర్పాట్లు చేశాడు. రాజకుమారి (ఇమోజెన్) అదృశ్యమైనందుకు రాణి సంతోషించింది. ఇప్పుడు రాజ్యం తనదే. కాని క్లోటెన్ కోపంగా వున్నాడు. పోస్థమస్‌ను కలవటానికి ఇమోజెన్ మిల్‌ఫోర్డ్ హావెన్‌కు వెళ్లిందని కూడా తెలుసుకుంటాడు. భర్తను చంపి, ఆమెను స్వాధీన పర్చుకోవాలని బయల్దేరతాడు. ఇమోజెన్‌ను వశపర్చుకోవచ్చని పోస్థమస్‌లాగే డ్రెస్సు వేసుకొంటాడు.

ఒంటరిగా మిల్‌ఫోర్డ్ హావెన్ వైపు నడుస్తున్నది ఇమోజెన్. ఒక గుహ కనిపిస్తుంది. భోజనం దొరుకుతుందనే ఆశతో కత్తిదూసి లోపలికి ప్రవేశిస్తుంది. బెలారియస్, రాజకుమారులు అందమైన ఈ యువకుణ్ణి చూసి ముగ్ధులవుతారు. తన పేరు ఫిడెల్

అని చెబుతుంది. మిల్‌ఫోర్డ్ హావెన్‌లో ఎవరో బంధువులను కలవాలి. తెల్లవారి, 'అతిథి' యువకులకు వంటచేసి పెడుతుంది. 'ఫిడెల్'ను ఒంటరిగా వదిలి వేటకు పోవటానికిష్టపడరు. కాని నచ్చచెప్పి పంపిస్తుంది ఇమోజెన్. ఆ తర్వాత 'మందు' వేసుకుని పడుకుంటుంది.

పోస్థమస్‌ను వెదుకుతూ క్లోటెన్ అటువైపు వస్తాడు. రాజకుమారుడు అతణ్ణి యుద్ధానికి ఛాలెంజి చేస్తాడు. ఓడిపోయిన క్లోటెన్ తల నరుకుతాడు. అతడు రెండవ రాణిగారి కుమారుడు! (గుర్తిస్తాడు బెలారియస్ ఇరవయ్యేళ్ల తర్వాత కూడా మనుషుల్ని గుర్తుపెట్టుకోగలడు!).

మరో రాజకుమారుడు గుహలో ప్రవేశిస్తాడు. 'కదలిక' లేని అతిథి మరణించాడనుకుంటాడు. శోకించి, ఖననం చెయ్యటానికి వుద్యుక్తులవుతారు.

వాళ్లు గుహదాటి వెళ్లగానే ఇమోజెన్‌కు మెలకువ వస్తుంది. పక్కనే పోస్థమస్ శిరస్త్రాణంలో వున్న క్లోటెన్ తలను చూస్తుంది. 'భర్త' మరణానికి కన్నీరు మున్నీరుగా విలపిస్తుంది. రోమన్ రాయబారి వచ్చి ఆమెను తన వద్ద వుద్యోగంలో పెట్టుకుంటాడు. మిల్‌ఫోర్డ్ హావెన్ వద్ద మోహరించిన రోమన్ సైన్యాలకు నాయకత్వం వహించటానికి వెళుతున్నాడతడు.

యుద్ధం ప్రారంభమవుతుంది. బెలారియస్, యిద్దరు రాజకుమారులూ బ్రిటన్ తరఫున యుద్ధానికి బయల్దేరతారు. పోస్థమస్ కూడా యిటలీ నుండి వస్తాడు. ఇమోజెన్‌ను హత్యచేయించిన తర్వాత తనకూ బతకాలని లేదు. బ్రిటన్ కోసం యుద్ధం చేసి ప్రాణాలర్పించాలనుకుంటాడు. నలుగురూ హోరాహోరి పోరు చేసి రోమన్ సైన్యాలనోడిస్తారు.

ఇటాలియన్ అనుకుని సింబెలైన్ సైనికులు పోస్థమస్‌ను నిర్బంధిస్తారు. జైల్లో పెట్టి వురితీస్తామన్నప్పుడు సంతోషంగా అంగీకరిస్తాడతడు. త్వరలోనే శిక్షమారి పోతుంది. పోస్థమస్‌ను రాజు వద్దకు తీసికెళతారు. రాజుకు తన భార్య మరణ వార్త తెలుస్తుంది. ఇద్దరు కొడుకులూ మళ్లీ తండ్రి చెంతకు చేరతారు. బెలారియస్‌ను క్షమిస్తాడు రాజు. రోమన్ రాయబారి కొలువులో వున్నది తన కూతురని తెలుసుకుంటాడు. అయాకిమో తను చేసిన కుట్రను అంగీకరిస్తాడు. పోస్థమస్ పశ్చాత్తాప పడతాడు. భార్యాభర్తలు కలుస్తారు. రోమన్ రాయబారితో స్నేహ సంబంధాలు ఏర్పరచుకుంటాడు సింబెలైన్. ఇకమీదట రోమ్, బ్రిటన్ మిత్ర దేశాలుగా వర్ధిల్లుతాయనీ ప్రకటిస్తాడు.

## సమాప్తం